# ఆంధ్రప్రదేశ్

జనవరి 1976 | సంక్రాంతి ప్రత్యేక సంచిక | వెల 50 పైసలు



# ఆంధ్ర ప్రదేశ్‌లో

| | |
|---|---|
| జనాభా | 4,35,03,000 |
| షెడ్యూలు కులాలవారు | 57,75,000 |
| షెడ్యూలు జాతులవారు | 16,58,000 |
| విస్తీర్ణం (చ.కి.మీ.) | 2,76,754 |
| జిల్లాలు | 21 |
| తాలూకాలు | 196 |
| పట్టణాలు, నగరాలు | 224 |
| పల్లెలు | 27,221 |
| పంచాయతీలు | 15,920 |
| పంచాయతీ సమితులు | 324 |
| పార్లమెంటు సభ్యులు | 59 |
| శాసన సభ సభ్యులు (ఒకనామినేటెడ్ సభ్యునితోసహా) | 288 |
| శాసన పరిషత్తు సభ్యులు | 90 |
| విశ్వవిద్యాలయాలు | 6 |
| అక్షరాస్యులు | 1,06,90,000 |

# ఆంధ్రప్రదేశ్

జనవరి, 1976
పుష్య—మాఘ, 1897

సంపుటి : 20 సంచిక : 3

ప్రధాన సంపాదకులు
శ్రీ రా జ్యం సి న్హా

సంపాదకులు
యన్. వి. గోపాలశాస్త్రి

## సంక్రాంతి ప్రత్యేక సంచిక

ఇమ్ముగ గాకుళమ్ము మొదలీ వరకుంగల
యాంధ్ర పూర్వరా
జ్యమ్ముల పేరు చెప్పిన హృదంతర మేలొ
చలించి పోవునా
ర్ద్రిమ్మగు చిత్తవృత్తుల పురాభవ నిర్ణయ మేని
ఎన్ని జ
న్మమ్ములుగాగ నీతనువునన్ బ్రవహించునొ
యాంధ్రర క్తముల్!
—"కళాప్రపూర్ణ" విశ్వనాథసత్యనారాయణ

మొదటి కవరు పేజీ : ఈ "క్రాంతి సమయాన
కోళిల్లు మకర సంక్రాంతి"
చివరి కవరు పేజీ : ప్రధాని జన్మదినోత్సవం సందర్భాన
ఊరేగింపులో పాల్గొన్న సమాచార
శాఖ వారి అలంకృత శకటం.

సాలు చందా : ఆరు రూపాయలు

వెల: 50 పైసలు

రిజిస్టరు నెం: హెచ్/హెచ్. డి. 81

## ఈ సంచికలో...

పేజీ

# నా జాతికో గీతి

శ్రీ సోమసుందర్

నా జాతి ఛాతీపై
ఎఱ్ఱగులాబీ కీలించాను
నా దేశమాత ఒట్టి వృద్ధనారిలా
పాతివ్రత్యపు పాత సొళ్లు వాగుతూంటే
వాదించి లాభం లేదని వారించి
డెక్కలు చెక్కి రెక్కలు తగిలించి
గుఱ్ఱపు పిల్లగా మార్చాను.

ఇక ఫరవా లేదు
నా జాతికి చాలొక గీతి
ఈ లోకానికి చాలొక సుశ్లోకం!

ఈ అడవి ముళ్లు చెరిపి
చక్కని దారులు నిర్మించాను
పొగడలూ పొన్నలూ దోసిళ్లెత్తి
పడుచు పూలు కురిసి
పథిశ్రమ బాపుతాయి
సారీ, బాటసారీ, ఎప్పుడు పడితే అప్పుడల్లా
నిద్ర పోవడానికిది సమయం కాదు:
లే ముందుకు నడూ...

ఇక తప్పదు: శాశ్వతంగా మృత్యువుకు
బలాదూర్ చెబుదాం!

వార్ధక్యం వృద్ధికి సంకేతం కాదన్నాను
జడధి జలధికి పర్యాయపదం
కావీలు లేదన్నాను.
రుజ తరువోజలు వల్లించడం
ననేమిరా వల్ల కాదన్నాను
జవం చచ్చి జీవం డుసిక్కిలిన
జరాజర్జితాలు పాత బిస్తీల ముఖాలకు
విద్యుత్తేజంతో దంతపు సరికట్టులమర్చాను

ఇప్పుడు చూడు:
ఎంత ఆరోగ్యంగా కలకల లాడుతోందో
నా దేశం!
నా దేశం శవాసనం మాని
ఉత్తుంగ జీవన తరంగంలా
ఉరక లెత్తుతోంది:
అమృత గంగా స్రోతస్వినిలా పొంగుతోంది.

పురిటి గదికి గమ్యం
శ్మశాన మనుకునే వెఱ్ఱివేదాంతుల్ని
హిమాలయ గుహాలయాలలో
తల దాచుకోమని నిర్బంధించాను.
పరకీయ సుక్షేత్రాల దురాక్రమించిన
పరాన్న భుక్కులకు శ్రీకృష్ణ జన్మస్థలాలు
చూపించాను.

పచ్చని పంట పొలాలకు
చేజేతులా జేగురురంగు పులిమే
మారీచ కీటకాలపై
పెస్టిసైడ్స్ చల్లి మట్టు బెట్టమని
మందుల కంపెనీ వాళ్లను పిలిపించాను

కుటజాల నిటలాలపై
తిలకం దిద్దే పికాలను ఉలూకాలు తరిమాయి
కిలకిలలాడే ఆ రామచిలుకల్ని–నిన్న
క్రూరంగా చంపి తిన్నాయి రాబందులు…
ఇకెంతకాలం ఔదాసీన్యం వహించగలను?

నిన్నటివరకూ నే జూపిన మంచితనం
చేతగాని తనంగా భావించారు నీచులు
ఔదార్యం అసమర్థతగా
అపార్థం చేసుకున్నారు...

అందుకే మొదటిసారిగా నేనెత్తిన చరమాయుధం
శత్రుఘ్నమైన శతఘ్నిగా పేలింది..
రేపటి నవోదయానికి వేలెత్తి చూపింది...

# అభివృద్ధి మహోద్యమంలో అందరం పాల్గొందాం



(ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ నవంబరు 17 వ తేదీన, హైదరాబాదుకు వచ్చిన సందర్భంగా ఏర్పాటు చేయబడిన బ్రహ్మాండమైన బహిరంగ సభలో రాష్ట్రముఖ్య మంత్రి చేసిన ప్రసంగం)

—శ్రీ జలగం వెంగళరావు

ప్రపంచ మహిళాకాశ మహోజ్వల తారగా వెలుగొందుతున్న మన ప్రియతమ ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరా గాంధీ హైదరాబాదు సందర్శించడానికి విచ్చేసిన సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ప్రజల తరఫున హృదయ పూర్వక స్వాగతం పలుకుతున్నాను. ఈ స్టేడియంలో ఇక్కడ చేరిన లక్షలాది ప్రజలను చూస్తే ఆంధ్రప్రదేశ్ ప్రజలకు ఆమె పట్ల గౌరవాభిమానాలు ఎంత ఎక్కువగా ఉన్నవో స్పష్టంగా తెలుస్తుంది. ప్రధాన మంత్రి ఆంధ్రప్రదేశ్ సమైక్యతను రక్షించిన రాజనీతిజ్ఞురాలు. అదే విధంగా ఇప్పుడు యావత్తు భారత దేశాన్ని ఆమె విచ్ఛిన్నకర శక్తుల నుంచి రక్షించి దేశంలో సమైక్యతను పటిష్ఠం చేయడానికి పూనుకొన్నది. అందువల్లనే ఆంధ్రప్రదేశ్ ప్రజలు ఆమె పట్ల ఇంతగా గాఢాభిమానం ప్రదర్శిస్తున్నారు.

## జాతి ముందడుగు వేయడానికి సంసిద్ధంగా వుంది

ఈ సమయంలో మన రాష్ట్రానికి ప్రధాన మంత్రి విచ్చేయడం ఒక ప్రత్యేకమైన విశిష్టమయిన సంఘటన. ఎందుకంటే ఇటీవల కొంతకాలంగా దేశంలో ప్రజల నైతిక బలాన్ని చెదర కొట్టడానికి జాతి విద్రోహకరమైన, సంఘ వ్యతిరేక శక్తులు కొన్ని కలిసి పని చేస్తున్నాయి. ఏ మాత్రం అవకాశం దొరికినా దానిని వినియోగించుకొని దేశంలో అరాజకాన్ని సృష్టించడానికి పూనుకొన్నాయి. ఈ పరిస్థితిని ఎదుర్కొనడంలో గట్టి చర్యలు తీసుకొన్నందుకు భారత జాతి అంతా మన ప్రధాన మంత్రికి ఋణపడి ఉన్నది. ఈ క్లిష్ట పరిస్థితిలో ఆమె దేశానికి నాయకత్వం వహించి మన అందరిని ఆపద నుండి రక్షించారు. అనంతరం జరిగిన అనేక సంఘటనలవల్ల కూడా ప్రధాన మంత్రి తీసుకొన్న చర్యలు సరియైనవేనని స్పష్టంగా రుజువు అయింది. అత్యవసర పరిస్థితి ప్రకటించడం, అనంతరం అనేక చర్యలను తీసుకోవడంవల్ల దేశం అంతటా ఒక్క క్రొత్త ఆశాజనకమైన వాతావరణం ఏర్పడింది. పనిచేయాలనే దీక్ష, క్రమ శిక్షణ, ప్రయోజనాత్మకమైన కృషి, చైతన్యం ప్రజలందరిలో కలిగాయి. జాతిలో ఒక నూతన ఉత్తేజం కలిగింది. ప్రగతి మార్గంలో పయనించడానికి నూతన ఉత్సాహంతో, ఆత్మ విశ్వాసంతో జాతి ముందడుగు వేయడానికి సంసిద్ధంగా ఉంది.

రెండేళ్ళ క్రితం మన రాష్ట్రంలో ఏర్పడిన అతి క్లిష్ట పరిస్థితులు అందరికీ తెలిసినవే. తెలుగు మాట్లాడే ప్రజల సమైక్యత విచ్ఛిన్నం అయిపోయే ప్రమాదం ఆ నాడు ఏర్పడింది. అప్పుడు కూడా మన ప్రధాన మంత్రి చూపిన చొరవ, రాజనీతిజ్ఞత వల్లనే మనం ఆ గండం గడిచి బయట పడ్డాం. ఆ ధంగా రాష్ట్ర సమైక్యత రక్షించబడి ష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో ఏర్పడిన భయాందోళనలు పోవడానికి ప్రధానమంత్రి తీసుకొన్న చర్యలే కారణం.

మన రాష్ట్రంలో 6 సూత్రాల పథకం అనే పేరుతో ప్రధానమంత్రి ప్రకటించిన ప్రణాళికను మనం విజయవంతంగా అమలు పరిచాం. ఒక ఏడాది పైగా మన రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధి వేగంగా సాధించడానికి అనుకూలమైన కార్యక్రమాలు అమలు జరుగుతున్నాయి. స్థానిక ప్రజల ప్రతినిధుల యొక్క తోడ్పాటుతో అమలు జరుగుతున్న ఈ పథకం కేంద్ర ప్రభుత్వం ఉదారంగా ఇచ్చిన 90 కోట్ల రూపాయల సహాయంతో 5వ ప్రణాళికకాలంలో పూర్తిగా అమలు జరుగుతుంది. ఇటీవలనే జంట నగరాల అభివృద్ధి కోసం పట్టణ అభివృద్ధి సంస్థ ఒక దానిని ఏర్పాటు చేయడం జరిగింది. రాష్ట్ర రాజధానీ నగరాన్ని ఒక సక్రమమైన పద్ధతిలో అభివృద్ధి పరచడానికి ఈ చర్య తీసుకున్నాం. రాష్ట్రంలో వివిధ ప్రాంతాలకు సంబంధించిన విద్యార్థులకు తగిన విద్యా వసతి సౌకర్యాలు కల్పించడానికి మనం ఏర్పాట్లు చేసుకున్నాం. వాటిని ఇంకా విస్తృత పరచడం కూడా జరుగుతున్నది. జిల్లాలో క్రొత్తగా విద్యా సంస్థలు ఏర్పాటు చేయడం, ఉన్న వాటిని పైహోదాకు పెంచడం మొదలగు కార్యక్రమాలు జరుగుతున్నాయి, 6- సూత్రాల పథకం ప్రకారం

హైదరాబాదు విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయబడింది. సర్వీసు విషయాలలోకూడా రాష్ట్రపతి యిటీవల ఉత్తర్వు జారీ చేశారు. ఇది ప్రభుత్వోద్యోగులకు సంబంధించి రాష్ట్రములోని వివిధ ప్రాంతాల ప్రజల న్యాయబద్ధమైన కోరికలను నెరవేర్చటానికి తోడ్పడమే గాక ఇప్పటికే ఉద్యోగంలో ఉన్న వారి ఉద్యోగాభివృద్ధి అవకాశాలను కూడా పరిరక్షించడానికి తోడ్పడుతుంది.

ఆరు అంశాల పథకం విజయవంతంగా అమలు జేయుట ద్వారా రాజకీయ సుస్థిరత సాధించటంవల్ల రాష్ట్రంలో సత్వర ఆర్థికాభివృద్ధి, సాంఘిక న్యాయ కల్పన అనే ఈ రెండు లక్ష్యాలతో బృహత్తరమైన కార్యక్రమాన్ని రాష్ట్రంలో పెద్ద ఎత్తున చేపట్టడానికి తగిన వాతావరణం ఏర్పడింది. గడిచిన రెండేండ్ల కాలంలో రాష్ట్రంలో ప్రణాళిక పెట్టుబడులను రెండింతలు చేసుకొన్నాం. ఈ నాడు ప్రణాళిక పెట్టుబడి 190 కోట్ల రూపాయలకు పైగా వుంది. గతంలో బకాయిలు భారీ ఎత్తున వసూలు చేయటం వల్ల ఆర్థిక వనరులను బాగా సేకరించటంవల్ల ఈ విజయం సాధించటం జరిగింది. ఈ నాడు ప్రభుత్వానికి ఏ విధమైన ఓవర్ డ్రాఫ్టులేదు. 1974-75 సంవత్సరంలోనే 37 కోట్ల రూపాయల అదనపు వనరులను సమీకరించటం జరిగింది. ఐదవ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఇప్పటివరకు తీసుకొన్న చర్యల ఫలితంగా 325 కోట్ల రూపాయల వనరులు ఏర్పడుతాయి. అయిదవ ప్రణాళికలో వనరుల సమీకరణ లక్ష్యం 250 కోట్ల రూపాయలు.

ఈ విధంగా భారీఎత్తున వనరులు ఏర్పడటం వల్ల వాటిని నాగార్జునసాగర్, తుంగభద్ర, వంశధార, గోదావరి బ్యారేజిల్లాంటి వ్యవసాయ, విద్యుచ్ఛక్తి, ఉత్పత్తి పథకాల అమలుకు ఎక్కువ మొత్తాలలో పెట్టుబడి పెట్టడానికి అవకాశం కలిగింది. ఇవేగాకుండా అనేక మధ్యతరహా నీటిపారుదల పథకాలను కూడా చేపట్టడం జరిగింది. సహజ నీటి వనరులను వినియోగించుకోవాలంటే, దీర్ఘకాలంగా అపరిష్కృతంగా ఉన్న నదీజలాల పంపిణీ సమస్యను పరిష్కరించుకోవలసి ఉంది. ఈ సమస్య ప్రాముఖ్యాన్ని గుర్తించి గోదావరి నదీజలాల పంపిణీ సమస్యను సమంజసంగా, న్యాయబద్ధంగా పరిష్కరించుకొనటానికి, ఆ సమస్యతో సంబంధం ఉన్న ఇతర రాష్ట్రప్రభుత్వాలతో చర్చలు జరుపుకున్నాం. ఈ విషయంలో కర్ణాటక, మహారాష్ట్ర, మధ్య ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వాలతో ఒక అంగీకారానికి రావటం జరిగింది. దీని ఫలితంగా యీ సమస్య పరిష్కారం కాకుండా ఉండటంవల్ల ఆయారాష్ట్రాలలో ఆగిపోయిన పథకాలను అమలు పరిచే విషయంలో చొరవ తీసుకోవటానికి వీలయింది.

ఈ ఒడంబడికలు అంతర్రాష్ట్ర నదీజలాల తగాదాలను త్వరితగతిని పరిష్కరించటానికి కావలసిన సుహృద్భావ వాతావరణం కలిగించాయి. దీనిఫలితంగా అంతరాష్ట్రీయా నదీ జలాల తగవులు అనతి కాలంలో పరిష్కారమవుతాయనే ఆశావహ వాతావరణం ఏర్పడింది. ఈ ఒడంబడికలకు దేశంలోని ప్రజలంతా హర్షామోదాలను తెలియజేశారు.

## నూతన చైతన్యం

ఈనాడు దేశంలో ఏర్పడిన నూతన చైతన్యానికి ప్రజల హర్షామోదాలు చిహ్నంగా వున్నాయి. సాంఘిక న్యాయం సాధించటం కోసం–ముఖ్యంగా బలహీన వర్గాల ప్రజల అభివృద్ధికి–అభివృద్ధి కార్యక్రమాలు, ఆర్థిక ప్రగతి కృషి చెట్టపట్టాల్ వేసుకొని కొనసాగాలి. ప్రధానమంత్రి 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం దేశంలో అన్ని ప్రభుత్వకార్యక్రమాలకు నూతనోత్సాహాన్నీ, చైతన్యాన్నీ కలిగించింది. మన రాష్ట్ర ప్రజలూ, ప్రభుత్వమూ ప్రధాన మంత్రి పథకానికి పూర్తి మద్దతు ప్రకటించి కృషి చేస్తున్నారు. ఈ 20 సూత్రాలు అమలు పరచటం వల్ల అప్పుడే ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని సత్ఫలితాలు కనిపించాయి. నిత్య జీవితావసర వస్తువులు, ఆహారధాన్యాల ధరలు అదుపులో ఉన్నాయి. గత సంవత్సరంలో ఇదే కాలంలో ఉన్నదానికంటే ఈ నాడు బియ్యం ధర చాలా తక్కువగా ఉంది. 1974-75 సంవత్సరంలో 8.7 లక్షల టన్నుల మేరకు మున్నెన్నడు లేనంత బియ్యం సేకరణ జరిగింది. యిది ధాన్య సేకరణలో రికార్డు. ఈ విధంగా బియ్యం సేకరణ జరగటంవల్ల కేంద్ర నిల్వలకు, రాష్ట్ర ప్రభుత్వం ఐదు లక్షల టన్నుల బియ్యాన్ని సమకూర్చింది. రాష్ట్రంలో పంపిణీ వ్యవస్థను పటిష్ఠంచేసి బీద ప్రజానీకం అవసరాలను తీర్చటంతో పాటు తరుగు రాష్ట్రాలను ఆదుకొనడానికి కూడా వీలుకలిగింది. వచ్చే ఏడాది ఇంతకంటే ఎక్కువగా సేకరించగలమని అనుకుంటున్నాం.

గ్రామీణ బీద ప్రజానీకం సంక్షేమం కోసం అనేక చర్యలు తీసుకున్నాము. భూకమతాల పరిమితి చట్టాన్ని పటిష్ఠంగా అమలు పరచటం జరుగుతున్నది. 1975 జనవరి నుండి మిగులు భూముల పంపిణీ ప్రారంభమవుతుంది. పేద ప్రజానీకానికి ప్రభుత్వ బంజరు భూముల పంపిణీ ఉద్యమం చురుకుగా కొనసాగిస్తున్నాం. గ్రామీణ ప్రాంతంలో ఉన్న హరిజన, గిరిజనులు, ఇళ్లులేని పేద ప్రజానీకానికి ఇళ్ల స్థలాలను ఇచ్చే కార్యక్రమాన్ని ముమ్మర ప్రాతిపదిక పై చేపట్టడం జరిగింది. దీనివల్ల ఈ సంవత్సరం మూడు లక్షల కుటుంబాలకు యిండ్ల స్థలాలు చేకూరుతాయి. దీనికి పది కోట్ల రూపాయల ఖర్చు అవుతుంది. ఈ కార్యక్రమం క్రింద యిప్పటి వరకు రాష్ట్రం మొత్తంమీద లక్ష మందికి ఇళ్ల స్థలాల పట్టాలు పంపిణీ చేయడం జరిగింది.

గ్రామీణ ఋణభార విమోచనం, వెట్టి చాకిరీ రద్దు, వ్యవసాయ కూలీల కనీస వేతనాల పెంపు, గ్రామాలలోని స్థలాలలో యిదివరలో ఇళ్లు నిర్మించుకొని నివసిస్తున్న వారికి ఆ భూములపై హక్కులను దత్తం చేయటం లాంటి చర్యలను కూడా తీసుకొనటం జరిగింది.

## పారిశ్రామిక రంగం

వ్యవసాయం తరువాత మన రాష్ట్రంలో చేనేత పరిశ్రమ మీద ఆధారపడిన వారు ఎక్కువగా ఉన్నారు. చేనేత పరిశ్రమ అభివృద్ధికి కేంద్ర ప్రభుత్వంతో సంప్రదించి అనేక చర్యలు తీసుకొనటం జరిగింది. ఈ చర్యల ఫలితంగా సహకార రంగం పరిధిలో ఉన్న చేనేత పారిశ్రామికులకు, ఇతర చేనేత పారిశ్రామికులకు కూడా ఎంతో ప్రయోజనం కలిగింది.

పారిశ్రామిక సంబంధాల మెరుగుదలకు, పారిశ్రామిక కార్మికుల సంక్షేమానికి తగు ప్రాధాన్యంతో కృషి జరుగుతున్నది. పరిశ్రమల యాజమాన్యంలో–కార్మికులకు ప్రాతినిధ్యం కల్పించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అదే విధంగా అప్రెంటిస్

పథకం క్రింద నిర్ణయింపబడిన లక్ష్యాన్ని అధిగమించే కృషి జరిగింది. మన రాష్ట్రంలో పారిశ్రామిక సంబంధాలు చాలా బాగా ఉన్నాయి. కార్మికులు—యాజమాన్యం సంప్రదింపుల ద్వారా సమస్యలు పరిష్కరించుకొనే సుహృద్భావ వాతావరణం నెలకొని ఉంది.

ఆంధ్రప్రదేశ్ అంతటా యిప్పుడు అశాజనకమైన వాతావరణం నెలకొని ఉంది. ప్రకృతి పరిస్థితులు అనుకూలించటం వల్ల కర్షకులు కష్టపడి పనిచేయటం వల్ల, ఈ సంవత్సరం వ్యవసాయోత్పత్తులను మున్నెన్నడు లేనంతగా సాధించగలిగాం. పారిశ్రామిక ప్రగతికి చక్కని వాతావరణం కూడా ఏర్పడింది. దానితో పాటు బలహీన వర్గాల సంక్షేమం కోసం సాంఘిక, ఆర్థిక కార్యక్రమాలు చేపట్టాం.

ఈ నాడు మనం చేస్తున్న కృషి వల్ల రాష్ట్ర ప్రజల భవిష్యత్తు మహోజ్వలంగా వుంటుందనే విశ్వాసం కలుగుతున్నది. కేంద్ర ప్రభుత్వ సహకారం మనకు ఎల్లప్పుడూ లభిస్తూనే వుంటుంది. దానితో పాటు మనం కూడా మనస్ఫూర్తిగా యీ అభివృద్ధి మహోద్యమంలో పాల్గొని రాష్ట్రాన్ని సుభిక్షం చేసుకుందాం. ×

---

# పల్లెలో సంక్రాంతి

శ్యావాస్య

పల్లెలో సంక్రాంతి
పండు గొచ్చిందిరా!
రైతు యెదలో ముదము
పొంగి పొరలిందిరా!

ధాన్యరాసులతోడ
ధరణి నిండిందిరా!
ధనలక్ష్మి నట్టింట
నాట్యమాడిందిరా!

హరిదాసు గొంతులో
పాటసాగిందిరా!
మెల్ల మెల్లగ పల్లె
నిదురలేచిందిరా!

కుక్కుటము చలిపైని
కేకపెట్టిందిరా!
మిక్కుటముగా భోగి
మంటలేచిందిరా!

ప్రాంగణమ్మునకన్నె
ముగ్గు పెట్టిందిరా
ముగ్గులో గొబ్బెమ్మ
సొగసులొలికిందిరా!

దినకరుని గని వసుధ
మురిసిపోయిందిరా!
మంచు ముత్యాలవిగో
కానుకపెట్టిందిరా!

పడుచు సిగలో ముద్ద
బంతి నవ్విందిరా!
యువక హృదయాలలో
ఉడుకు రేగిందిరా!

పచ్చపచ్చని గరిక
మెరుగు లీనిందిరా!
పాకలో ముసలెద్దు
రంకె వేసిందిరా!

గంగి రెద్దులతోడ
ఆట సాగిందిరా!
సీతమ్మ మురిపాన
అలుక చేసిందిరా!

పసుపు కుంకుమలతో
గృహము శోభించెరా!
తోరణాల వెనుక
పండు వొనలించెరా!

సంపన్నమై పుడమి
ముదుము చిందిందిరా!
భూమాత గుబులంత
తీరి పోయిందిరా!



40–2



## ఉజ్జ్వల భవిష్యత్తు కోసం

# నవసమాజ నిర్మాణం

—శ్రీ పిడతల రంగారెడ్డి

ప్రపంచ ప్రజాస్వామ్య దేశాలన్నింటిలోనూ భారత దేశం పెద్ద రాజ్యం. 50 కోట్ల జనాభాతో ప్రజాస్వామ్య పద్ధతిలో సోషలిజం వైపు పురోగమించడానికి మనం కంకణం కట్టుకుని కృషి చేస్తున్నాం. పూజ్య బాపూజీ దేశ ప్రజల్లో కలిగించిన నూతన చైతన్యం ప్రపంచ చరిత్రలో ఏనాడూ కనీవినీ ఎరుగనట్టిది. ప్రపంచంలో ఎన్నో దేశాలలో ఎన్నో రకాల విప్లవాలు వచ్చాయి. కాని భారత దేశంలో జరిగిన ప్రశాంత విప్లవం చరిత్రలో అపూర్వమైనట్టిది. భారతదేశానికి స్వాతంత్ర్యం లభించిన తరుణంలో ప్రపంచ ప్రఖ్యాత ప్రజ్ఞానిధి అయిన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అధ్వర్యం వహించడం భారతీయుల అదృష్టమని చెప్పాలి. ఆయన ప్రజాస్వామ్య ప్రవక్తగా, పంచశీల కర్తగా, సోషలిస్టు నవసమాజ నిర్మాణ రథ సారథిగా, విశ్వశాంతి ప్రవక్తగా, యింకా బహుముఖాలుగా భారతీయులనేగాక ప్రపంచ ప్రజలందరినీ ప్రభావితం చేసిన మహా నాయకుడు. ఆనాటి నుండి నేటి వరకు పండిట్ నెహ్రూ అడుగు జాడల్లోనే భారత జాతి నడుస్తూ, అనేక ఘన విజయాలను సాధించగలిగింది. పూజ్య బాపూజీ పండిత జవహర్లాల్ నెహ్రూ వీరిద్దరూ ఆధునిక నవభారత నిర్మాణానికి రెండు కండ్ల వంటి వారు. భారతీయుల హృదయ కుహరాలలో వెలిగించిన దివ్య జ్యోతులు యీ నాటికీ ప్రకాశమానంగా వెలుగుతూ ప్రపంచ దేశాలకే వెలుగులను పంచుతున్నవి.

అనాదిగా భారత జాతి తన సంస్కృతి, నాగరికత, కళలు, సాహిత్య, ధర్మ ప్రతిష్ఠాపన మొదలగు రంగాలలో ప్రపంచానికి మార్గదర్శకమై, మానవులలో సత్ప్రవర్తన సాధించడానికి అత్యుత్తమమైనదిగా భారతీయ జీవన విధానం రూపొందించబడింది. ఆ మార్గంలోనే పూజ్య బాపూజీ, పండిట్ నెహ్రూలుకూడా మానవతా దృక్పథంతో ఆధునిక జీవితానికి వ్యాఖ్యానం చేసి ప్రవచించి, బోధలను ఆచరణలో పెట్టి చూపించి ప్రపంచ ప్రజల ఆదరణకు, గౌరవాభిమానాలకు పాత్రులయ్యారు. అట్టి మహనీయుల వారసులుగా మనం మన కర్తవ్యాన్ని నిర్వహించడం మన కనీస ధర్మం.

ఈ నాడు మనం విశ్వసిస్తున్న ప్రజాస్వామ్య వ్యవస్థ మతాతీత రాజ్యాంగ వ్యవస్థ, సోషలిస్టు సమాజం అనేటటువంటి మన రాజ్యాంగం–యివన్నీ భారత జాతికి పండిట్ నెహ్రూ ప్రసాదించిన వరాలు. ఈనాడు మనం ఆయన అడుగు జాడల్లో నడుస్తున్నాం. స్వరాజ్య పోరాటకాలంలో హిందూ, ముస్లిం విభేదాలవల్ల జాతికి ఎంత నష్టం జరిగిందో మనందరికీ తెలిసినదే. అందువల్లనే ఒక మతాతీత రాజ్యాంగ వ్యవస్థను లక్ష్యంగా మనకు ప్రసాదించారు. అదే విధంగా హింసాత్మక విధానాలలో విప్లవాలు సాధించవలసిన అవసరం లేకుండా గాంధీజీ చూపిన అహింసా మార్గంలో పండిట్ నెహ్రూ సోషలిస్టు సమాజ సిద్ధాంతాలను సమన్వయ పరచి మనకు ప్రసాదించారు.

## అలీనరాజ్య సిద్ధాంతం

అన్నిటికంటే ముఖ్యమైన విషయం భారత జాతి గౌరవ ప్రతిష్ఠలు ప్రపంచ వ్యాప్తంగా గుర్తింప బడడానికి ఆయన స్వయంగా నిర్మించి ప్రచారం చేసి ప్రపంచం చేత అంగీకరింపజేసిన అలీన రాజ్యల సిద్ధాంతం ప్రముఖ పాత్ర వహించినది. ఈ నాడు ప్రపంచ రాజకీయ రంగంలో కొత్తగా స్వాతంత్ర్యం పొందుతున్న అనేక రాజ్యాలు అగ్రరాజ్యాల వైరాలకు దూరంగా వుండాలని నిశ్చయించుకుంటూ పండిట్ నెహ్రూ చూపిన అలీన రాజ్య సిద్ధాంతంవైపు మొగ్గుతున్నాయి. ఐక్యరాజ్యసమితిలో ఈ నాడు అగ్రరాజ్యాలను మినహాయిస్తే అభివృద్ధి పొందుతున్న దేశాలలో అధిక సంఖ్యాకమైన రాజ్యాలు ఏ రాజ్యకూటమికీ చెందని వైఖరిని అవలంబిస్తూ ఒక బలవత్తరమైన మెజారిటీవర్గంగా రూపొందాయంటే దానికి పునాదులు వేసిన మహనీయుడు మన పండితనెహ్రూయే. అందువల్లనే భారత

జాతి పండిట్ నెహ్రూకు ఎంతో ఋణపడి వున్నది. ఆయన చేసిన ప్రబోధాలూ, ఆయన సూచించిన మార్గాలూ మనకు తరతరాల వరకు ఆదర్శప్రాయంగా నిలిచి మన జాతి సర్వతోముఖ వికాసానికి దోహదం చేయగలిగినంత శక్తివంతమైనవి.

ఈ నాడు మనం భారత దేశంలో సాంకేతికంగా సాధించామని చెప్పుకుంటున్న అనేక ఘన విజయాలకు ఆనాడు నెహ్రూ చూపించిన దూరదృష్టి, రాజనీతిజ్ఞత మొదలైనవే కారణాలని చెప్పక తప్పదు. సోషలిస్టు సిద్ధాంతాలలో విశ్వాసం కలిగి వున్నప్పటికీ అటు అమెరికావంటి ప్రజాస్వామ్య దేశాలతో కూడా ఆయన చెలిమిని సాధించి దేశాభివృద్ధి కార్యక్రమాలలో పాశ్చాత్య దేశాలవారు మనతో పూర్తిగా సహకరించే సుహృద్భావ వాతావరణాన్ని ఆయన సృష్టించగలిగారు. అదే విధంగా యిటు సోవియట్ రష్యా మొదలైన సోషలిస్టు రాజ్యాలతో కూడా స్నేహ సంబంధాలను పెంపొందించి, వాటి సహాయాన్ని పొందడంలో కూడా కృతకృత్యులయ్యారు. నెహ్రూ ముఖ్యంగా వాస్తవిక వాది అవడం చేత ప్రపంచంలోని అగ్రరాజ్యాల వైరభావాన్ని లెక్కించకుండా ఉభయులతో స్నేహంగా వుంటూ, ప్రపంచ రాజ్యాలన్నిటికీ మధ్యవర్తి నాయకుడిగా గణుతి కెక్కారు. ఈనాటి మన భారత దేశ విదేశాంగ విధానాన్ని సూక్ష్మంగా పరిశీలించినట్లయితే ప్రపంచ దేశాలన్నిటి పట్ల మనం అవలంబిస్తున్న స్నేహ వైఖరి స్పష్టంగా కనిపిస్తుంది. అంటే మనం నూటికి నూరు పాళ్ళ నెహ్రూ అడుగుజాడల్లో నడుస్తున్నామన్న మాట.

## జాతీయ ప్రణాళిక

జవహర్ పండితులు ఒక సందర్భంలో ఇలా అన్నారు: "నేను ఎక్కువగా కలలు కంటూ ఉంటానని నా సహచరులు అంటున్నప్పుడు, నేనెంతో సంతోషిస్తాను. నా స్వప్నాలన్నీ ఈ దేశ ప్రజలను గురించి వారి సౌభాగ్యాన్ని గురించే. భావిభారత దేశంలోని ఏవొక్కరూ దేనికోసమూ బాధపడకూడదు. అందరకూ అన్ని రకాల అవకాశాలూ లభించాలి. అటువంటి నవసమాజాన్ని గురించే నేను కలలు కంటూవుంటాను".

మనకు స్వరాజ్యం రావడానికి ముందే శ్రీ నెహ్రూ జాతీయ ప్రణాళిక పేరుతో ఒక బ్రహ్మాండమైన కార్యక్రమాన్ని రూపొందించారు. ఆ కార్యక్రమాన్ని చూసి ఆర్థికశాస్త్రవేత్తలు ఆశ్చర్యపోయారు. కాని అది అమలులోనికి రాలేదు.

స్వరాజ్యం వచ్చినతరువాత స్వతంత్ర భారత ప్రధానిగా ఈ దేశ ప్రజలందరి సంక్షేమాన్ని శ్రీ నెహ్రూ చూడవలసి వచ్చింది. వారి భాగ్యోదయం కోసమని ప్రణాళికలను ప్రారంభించారు. అమలు జరపడంలో వివిధ దేశాల సహాయ సహకారాలను శ్రీ నెహ్రూ పొందగలిగారు.

తాము చిరకాలంగా కలలుగంటున్న నవసమాజ నిర్మాణానికి ఈ ప్రణాళికలు సోపానముల వంటివని నెహ్రూజీ పదే పదే పేర్కొంటూ ఉండేవారు.

ఇక దేశాభివృద్ధి, ప్రజల జీవన పరిస్థితులు మెరుగు పరచడం, దేశంలో స్వయం సమృద్ధిని సాధించడం, అజ్ఞానంతో నిరక్షరాస్యతతో సంఘంలో పీడితులవుతున్న కోట్లాది ప్రజానీకాన్ని సముద్ధరించడంలో ఒక ముక్కలో చెప్పాలంటే సోషలిస్టు నాయకత్వంలో— మనం కృషి చేస్తున్నాం. పండిట్ నెహ్రూ ప్రవచించి ప్రారంభించిన ప్రజాస్వామ్య సోషలిస్టు వ్యవస్థకు రూపు రేఖలు దిద్దుకుంటున్నాం.

ఇటీవల మన దేశంలో ఏర్పడిన అరాచక ధోరణులు, ఆర్థిక సంక్షోభం మొదలైనవి మనం అందరం కళ్ళారా చూసినవే. మనం చూస్తూవుండగానే అవి పెరిగి దేశ ఆర్థిక వ్యవస్థను ఛిన్నాభిన్నం చేయడానికి తయారైనవి. ఈ అవకాశాన్ని పురస్కరించుకుని ప్రతిపక్షాల వారు చేసిన ఆర్భాటంకూడా మనందరికీ తెలిసినదే. అటువంటి గడ్డు పరిస్థితుల్లో విశేషమైన రాజనీతిజ్ఞతను ప్రదర్శించి మన ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ తగు చర్యలు తీసుకుని మన దేశానికి, ప్రజలకు మహోపకారం చేశారు. శ్రీమతి ఇందిరాగాంధీ ప్రకటించిన 20 సూత్రాల ప్రణాళిక భారత జాతిని అంతటినీ ఉత్తేజ పరిచింది. ప్రధానంగా సంఘంలో వుండే ఆర్థిక వ్యత్యాసాలను తొలగించడానికీ, అట్టడుగునవున్న కోట్లాది సామాన్య ప్రజల జీవన పరిస్థితులను మెరుగు పరచడానికీ ఉద్దేశించిన యీ ప్రణాళిక యీ నాడు దేశం అంతటా చిత్తశుద్ధితో, నిజాయితీతో, క్రమశిక్షణతో అమలు జరుగుతున్నది. పల్లె ప్రాంతాలలో చాలీ చాలని జీవనం చేస్తున్న వ్యవసాయ కూలీలూ, చేతి వృత్తులవారూ, సన్నకారు రైతులూ దీనివల్ల ఎన్నో విధాలుగా ప్రయోజనం పొందుతున్నారు. అదే విధంగా నగర ప్రాంతాలలో ఫ్యాక్టరీ కార్మికులూ, శ్రమ శక్తితో కుటుంబయాత్ర జరుపుతున్న రిక్షవారూ, ఆటోడ్రైవర్లూ మొదలగు వివిధ వర్గాల పేద ప్రజలకు కూడా యీ ప్రణాళిక ప్రయోజనం చేకూరుస్తున్నది. ఈ ప్రణాళిక సత్ఫలితాలు అప్పుడే అనేక రంగాలలో మనకు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అన్నిటికంటే ప్రధానమైన ఫలితం ప్రజల్లో క్రమశిక్షణ పెరగడం. అన్నివర్గాల ప్రజలు తాము భారతీయులమనే చైతన్యంతో కృషి చేసే అవకాశం దీనివల్ల కలిగింది.

## నేటి నూతన ఆర్థిక కార్యక్రమ ప్రభావం

శ్రీమతి ఇందిరాగాంధీ, ప్రకటించిన నూతన ఆర్థిక కార్యక్రమం వల్ల ఆర్థిక వ్యవస్థను తారుమారు చేసే అనేక దుష్టశక్తులకు బలంగా దెబ్బతగిలింది. దొంగవ్యాపారులు, విదేశీ వస్తువుల స్మగ్లర్లు, అక్రమ ద్రవ్యార్జనపరులు, పన్నులు ఎగవేసే అలవాటు కలవారు మొదలగు అనేక రకాలుగా దేశాన్ని మోసం చేస్తున్న వారి ఆటలు కట్టించడానికి 20 సూత్రాల ప్రణాళిక దోహదం చేస్తున్నది. మన దేశంలో ద్రవ్యోల్బణ పరిస్థితి పూర్తిగా తగ్గిపోవడం చూసి అనేక దేశాలవారు విభ్రాంతి చెందుతున్నారు. వారి వారి దేశాలలో వారు యిటువంటి పరిస్థితిని అరికట్టలేకపోయారు. ఇది మనందరికి గర్వకారణమైన విజయం. ఇప్పుడు విదేశాల నుండి దొంగరవాణా వ్యాపారం కూడా బాగా పడిపోయింది. స్మగ్లర్ల ఆస్తులను స్వాధీనం చేసుకోవడానికి యిటీవలే కేంద్ర

ప్రభుత్వం ఒక ఆర్డినెన్సును కూడా జారీ చేసింది. ఈ నాడు మార్కెట్లో నిత్యావసర వస్తువుల కొరత అనేది లేదనే చెప్పవచ్చు. ఆకాశాన్ని అంటుతున్న ధరలు బాగా తగ్గుముఖం పట్టాయి. సామాన్య ప్రజలకు కొంచెం ఊపిరి పీల్చుకోడానికి అవకాశం దొరికింది. ఇప్పుడిప్పుడే 20 సూత్రాల ప్రణాళిక ఫలితాలు అన్ని వర్గాల వారికి అందుబాటులోకి వస్తున్నాయి.

## ప్రజల మద్దతు

మన రాష్ట్రానికి సంబంధించినంతవరకు యీ పథకాన్ని పూర్తిగా అమలు పరచడానికి ప్రభుత్వం దృఢ నిశ్చయంతో కృషి చేస్తున్నది. ప్రజల్లో వివిధ వర్గాల వారు—ముఖ్యంగా విద్యార్థులు, యువజనులు, కార్మికులు, మహిళలు, గ్రామ సీమల్లోని సన్నకారు రైతాంగం, వ్యవసాయ కూలీలు మొదలగు వారు ప్రభుత్వ కృషితో మనస్ఫూర్తిగా సహకరించడానికి సన్నద్ధంగా వున్నారు. మనం పేదరికాన్ని సాధ్యమైనంతవరకు తొలగించాలన్నా, ఆర్థిక వ్యత్యాసాలను తగ్గించి సాంఘిక న్యాయం సమకూర్చాలన్నా యిదే మంచి తరుణం. ప్రజల్లో యీనాడు ఏర్పడివున్న క్రమశిక్షణను సత్ప్రవర్తన లక్షణాలను మనం పూర్తిగా సద్వినియోగం చేసుకో వలసిన అవసరం వుంది. మన రాష్ట్రంలో యిప్పటికే లక్షలాది నిరుపేదలకు భూములను పంచడం, ఇళ్ళ స్థలాలను సమకూర్చడం, గ్రామీణ ప్రాంతాలలో పేదవర్గాల ఋణభారాన్ని తగ్గించడం, వ్యవసాయ పరపతి అధికంగా లభించేటట్టు చర్యలు తీసుకోవడం మొదలగు కార్యక్రమాలు ముమ్మరంగా కొనసాగుతున్నవి. భూసంస్కరణలు అమలు జరిపి, నికరంగా ఎంత భూమి లభిస్తుందో లెక్కలు తేల్చి, దానిని అర్హులైన వారికి పంపిణీ చేసే కృషి వచ్చే జూన్ నెల నాటికి పూర్తి అవుతుందని అంచనా. ఇదే విధంగా వచ్చే మూడేళ్ళ కాలంలో రాష్ట్రంలో అవసరమైన వారందరికీ ఇళ్ళ స్థలాల పంపిణీ కార్యక్రమం పూర్తి అవుతుంది. ఇటీవలనే గాంధీ జయంతి నాడు మన రాజధానీ నగరంలోనూ, జిల్లా కేంద్రాలలోనూ యిళ్ళ స్థలాల పట్టాల పంపిణీ జరిగి లక్షలాది మందికి నిలువ నీడ దొరికే అవకాశం లభించింది. ఈ కార్యక్రమం అంతే-20 సూత్రాల ప్రణాళికలో హరిజనులు, గిరిజనులు, యితర వెనుకబడిన వర్గాల వారి ఆర్థిక సముద్ధరణ కోసం జరిగే వివిధ చర్యలు- నిరంతరంగా జరుగుతూ వుండేవే. మన రాష్ట్రం 20 సూత్రాల ప్రణాళికను అమలు పరచడంలో ఎవ్వరికీ తీసిపోని విధంగా ముందంజవేయగలదని నేను హామీ యిస్తున్నాను. మన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారు యీ కార్యక్రమాల పట్ల ఎంతో శ్రద్ధవహించి కృషి చేస్తూ వుండడం సంతోషకరమైన విషయం. అంతేకాకుండా ఎన్నాళ్ళనుండో వివాదాస్పదమైన నదీజలాల సమస్యను చొరవతో, రాజనీతిజ్ఞతతో చక్కగా పరిష్కరించి మన ముఖ్యమంత్రి గారు ప్రధానమంత్రి మన్ననలను కూడా పొందడం మనకు గర్వకారణం. యిటీవలనే కర్నాటక, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒరిస్సాలతో గోదావరి నదీజలాల వినియోగం విషయంలో మన ముఖ్యమంత్రి కుదుర్చుకున్న ఒడంబడికలవల్ల మనం ప్రారంభించిన, ప్రారంభించదలచిన అనేక సేద్యపు నీటి పారుదల ప్రాజెక్టులను నిరాటంకంగా కొనసాగించే అవకాశం లభించింది. అందువల్ల ప్రధానంగా వ్యవసాయ రాష్ట్రమైన మన రాష్ట్రం అనతి కాలంలోనే సస్యశ్యామలమై, సిరిసంపదలతో తుల తూగ గలదనే విశ్వాసం మనకు యిప్పుడు కలిగింది.

మన ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ నాయకత్వంలో అపూర్వమైన ఒక నవసమాజ నిర్మాణానికి తీవ్రమైన కృషి జరుగుతూ ఉన్నది. ఈ కృషిలో మనం ఇతోధికమైన అభ్యుదయాన్ని సాధించగలమని ఆశిస్తున్నాను.

(జవహర్‌లాల్ నెహ్రూ జన్మదినోత్సవ సందర్భంగా చేసిన రేడియో ప్రసంగం.)

విఘ్నములాపెడు వెనకయ్యా
వేగమె ముందుకు రావయ్యా
రుగ్మ భీతిరహిత స్నిగ్ధ సదాశయ
మగ్నుల గావించి మము నడుపవయ్యా

—ఆరుద్ర

# షెడ్యూలు కులాలకు రాజ్యాంగ రక్షణలు

—శ్రీ జె. వీరాస్వామి

షెడ్యూలు కులాలు అనే పదజాలం, బ్రిటీషు పరిపాలనా కాలంలో సృష్టించబడింది. చాతుర్వర్ణ వ్యవస్థలో ఉన్న కులాలు, ఉప కులాలు కాక, సవర్ణ హిందువులు కాని వారిని ప్రభుత్వ చట్టములో, ఒక షెడ్యూలు లేక జాబితాలో చేర్చి, ఆ కులాలను షెడ్యూలు కులాలుగా నామకరణం చేయడం జరిగింది. వర్ణవ్యవస్థలోనే, అంచెలవారీ హెచ్చు తగ్గులు ఉన్నాయి. బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్ర వర్ణాలు చాతుర్వర్ణాలుగా పరిగణింప బడేవి. క్రమేపి, శూద్రవర్ణము, వృత్తులు చేయు వృత్తినిబట్టి, కొన్ని వందల కులాలుగా రూపొందింది అంటరాని వారుగా పరిగణింపబడే వారిని పంచములని, పిలవడం పరిపాటి. ఊరుకు దూరంగా ఉంచి, గ్రామ కార్యక్రమాలలో పాల్గొనడానికి హక్కు లేకుండాచేసి, చదువు, సంధ్యలు నేర్చుకోవడానికి అనర్హులుగాచేసి, తుదకు, అంటరానితనం అంటకడితే ఎంతటివారైనా దిగజారిపోవడం తథ్యంకదా! వేద కాలములో, అంటరానితనం కనిపించదు. ఆ కాలంలో, గుణకర్మలనుబట్టి వర్ణవ్యవస్థ పాటింపబడేది. అంటరానితనం హిందూ సమాజంలో ఎప్పుడు చోటు చేసుకుందో, మనకు సరియైన ఆధారంలేదు. కాని, బౌద్ధమత ప్రభావం తగ్గిన తర్వాతనే అంటరానితనం విజృంభించి, వీర విహారం చేసినట్లు కనిపిస్తుంది. మన మత గురువులుగాని, పీఠాధిపతులుగాని పంచములనబడేవారిని హిందూ సంఘంలో విలీనం చెయ్యడానికి కృషి చేసినట్లు కనబడదు. మత సంస్కర్తలు ఎవరైనా కొద్ది ప్రయత్నాలు చేసినా వారిని కొత్త మతాలను సృష్టించిన వారుగా ముద్రవేసి, హిందూ మతాన్ని సంస్కరించకుండా జాగ్రత్త పడ్డారు. తోటి మానవులుగా గుర్తింపబడని కారణంగా పంచములు మహమ్మదీయ మతంలోనూ, క్రైస్తవ మతంలోనూ విధి లేక చేరుతూ వచ్చారు. పశ్చిమ దేశాలనుండి వచ్చిన ఆ రెండు మతాలకు వర్ణ విభజన, అంటరాని తనం లేదు. పైగా వృత్తులు చేపట్టడంలో నిషేధంలేదు. వారి వారి శక్తిని ఆసక్తినిబట్టి ఎవరైనా ఏ వృత్తినైనా చేపట్టడానికైనా వీలుంది. అందుచేత, ఈ అవకాశాన్ని వినియోగించుకోవడానికి, అమానుషమైన అంటరానితనం నుండి బయటపడానికి మతం మార్చుకోవడం విరివిగాసాగింది. ఎక్కువమంది హిందువులు పరమత స్వీకారం చేయడంవల్ల, జాతి నిర్వీర్యం కాగలదని మొదట గ్రహించిన వారు గాంధీజీ. ఆయన పంచములనే అంటరానివారికి, కొత్త నామధేయం ఇచ్చారు. వారిని హరిజనులని పిలవడం మొదలు పెట్టారు. జాతి స్వాతంత్ర్యం కొరకు పాటుపడే మహానాయకుడు హరిజనులను తోటి సోదరులుగా చూడడం ప్రారంభించగానే, యావద్భారత దేశంలోనూ క్రొత్త జాగృతి తలయెత్తింది. దేవాలయ ప్రవేశం, విద్యాలయ ప్రవేశం హరిజనులకు అందుబాటులోనికి వచ్చాయి. హరిజనోద్ధరణ స్వాతంత్ర్య సముపార్జన కాలంనాటినుండి కాంగ్రెసు కార్యక్రమాలలో చోటు చేసుకొంది. గాంధీజీ తీసుకొన్న చొరవ, శ్రద్ధ, దీనికి ముఖ్య కారణాలు. రాజ్యాంగ నిర్మాత డాక్టరు అంబేద్కరు రంగంలోనికి ప్రవేశించిన తర్వాత పంచములనబడే వారు తమ హక్కుల కొరకు పోరాటం సాగించారు. సాంఘికమైన హక్కులే కాకుండా రాజకీయమైన హక్కులుకూడా బ్రిటీషు వారు ఉండగానే, నిర్ణయింప బడాలని నిమ్నజాతులవారు, అంబేద్కర్ నాయకత్వంలో ఉద్యమాలు సాగించారు. వారిని కాదనడానికి గాని, అడ్డగించడానికిగాని ఎవరికి సాధ్యం కాలేదు. కాని జాతి ఐక్యతను దృష్టిలో ఉంచుకొని గాంధీజీ, అంబేద్కరులు పూనా ఒడంబడిక చేసుకొన్న తర్వాతనే నిమ్నజాతులవారు నేడు అనుభవిస్తున్న రాజకీయమైన హక్కులు, రక్షణలు, సాధించగలిగారు.

## సాంఘికంగా వెనుకబడ్డ వారికి చేయూత

విద్య, ఆరోగ్యం, నాగరికత, జ్ఞాన సముపార్జన–వీటికి దూరం చెయ్యబడ్డ హరిజనులకు, ప్రత్యేక రక్షణలు రాజ్యాంగ రీత్యా కలుగజేస్తేనేకాని, వారు సమాజంలో, ఇతర వర్గాలవారితో సరిసమానం కాలేరు అని రాజ్యాంగ నిర్మాణ సభవారు భావించారు. అంతకు ముందే గాంధీజీ, అంబేద్కరుల కృషి ఫలితంగా, హరిజనులకు చెయ్యవలసిన సహాయ, సహకారాల విషయమై, ప్రత్యేక అవగాహన ఉంది. ఎన్నికల కొరకు, ప్రత్యేక నియోజకవర్గాలు, షెడ్యూలు కులాల అభ్యర్థులకు ఉన్నా, షెడ్యూలుకులాలకు చెందిన ఓటరులే, ఆ అభ్యర్థులను ఎన్నుకోవాలనే వాదన, దేశం మొత్తం ప్రయోజనాల దృష్ట్యా, స్వస్తి చెప్పబడింది. షెడ్యూలుకులాల అభ్యర్థులు అన్ని వర్గాలకు చెందిన ఓటర్లచేత ఎన్నుకోబడడంచేత, సమాజ బాధ్యతలను, వారు స్వీకరించడానికి వీలుపడింది. రాజ్యాంగంలో షెడ్యూలు కులాలవారికి, లోకసభలో కొన్ని సీట్లు కేటాయింపబడ్డాయి. ఒక్కొక్క రాష్ట్రంలో, జనాభా ప్రాతిపదికపై ఆ రాష్ట్ర లోకసభ సభ్యులసంఖ్య నిర్ణయిస్తారు. అలాగే, రాష్ట్ర అసెంబ్లీలో కూడా, షెడ్యూలు కులాలవారికి, ప్రత్యేకంగా సీట్లు కేటాయింపబడ్డాయి. ఈ ప్రత్యేక ఏర్పాట్లు శాశ్వతమైనవికావు. మొదట్లో 10 సంవత్సరాలపాటు ఉండాలని నిర్ణయించారు. తర్వాత వచ్చిన రాజ్యాంగ సవరణలవల్ల, 30 సంవత్సరాల వరకూ, అంటే రాజ్యాంగం అమలుచెయ్యబడ్డ తేదీనుండి, 30 ఏళ్లపాటు షెడ్యూలు కులాలకు సీట్ల కేటాయింపు అమలులో ఉంటుంది. అందుచేత 1980 వరకూ. షెడ్యూలు కులాలవారికి కేంద్ర, రాష్ట్ర శాసన సభలలో, ప్రత్యేక నియోజక వర్గాలద్వారా ఎన్నిక చెయ్యబడే ఏర్పాటు అమలులో ఉంటుంది.

రాజ్యాంగంలోని 366వ అనుచ్ఛేదం ప్రకారం, ఎవరైతే 341వ అనుచ్ఛేదం క్రింద షెడ్యూలు కులాలుగా నిర్దేశింపబడతారో వారే షెడ్యూలు కులాలని చెప్పబడింది. 341వ అనుచ్ఛేదంక్రింద రాష్ట్రపతి, ఏదైనా రాష్ట్రంలోగాని, కేంద్రపాలిత ప్రాంతంలోగాని, ఉన్న కులాలను, షెడ్యూలు కులాలుగా నిర్ణయిస్తూ బహిరంగ ప్రకటనద్వారా తెలియపర్చవచ్చును. రాష్ట్రాలలో షెడ్యూలు

కులాలను, నిర్ణయించేముందు, గవర్నరును సంప్రతించవలసి వుంటుంది. తర్వాత, భారత పార్లమెంటువారు, రాష్ట్రపతి ప్రకటించిన పట్టికను,చట్టరీత్యా మార్చుటకు అధికారం ఈయబడింది. కాబట్టి, ఏయే కులాలవారు, షెడ్యూలు కులాలుగా పరిగణింపబడాలి అనే విషయంలో మొదటి పట్టికను తయారుచెయ్యడంలో, రాష్ట్రపతికి, తరువాత సవరించడంలో, పార్లమెంటుకు పూర్తి అధికారం ఉంది. ప్రస్తుతం, అలాంటి సవరణచట్టం ఒకటి పార్లమెంటు ముందు ఉన్నట్లు తెలుస్తూంది.

కేంద్ర సర్వీసులలోగాని, రాష్ట్ర సర్వీసులలోగాని, ఉద్యోగ నియామకాల విషయంలో, పరిపాలనా యంత్రాంగంయొక్క సమర్థత దెబ్బతినకుండా ఉండే పద్ధతిలో షెడ్యూలు కులాల హక్కులను లెక్కలోనికి తీసుకొనవలసిఉంటుందని 335వ అనుచ్ఛేదం చెబుతుంది. అయితే, ఈ అంశాన్ని 16 అనుచ్ఛేదం, నాలుగవ క్లాజుతో జతపరచి, చదవవలసి ఉంటుంది. ప్రభుత్వోద్యోగాలలో సరియైన ప్రాతినిధ్యంలేదని ప్రభుత్వం భావించినప్పుడు వెనుకబడిన వర్గాల వారికి, ఉద్యోగ నియామకాల విషయంలో, కొన్ని ఖాళీలను మినహాయింపు చెయ్యడం, పౌరులకు ఇచ్చిన హక్కులకు భిన్నం కాదని, పైన పేర్కొన్న నాలుగవ క్లాజువల్ల మనకు విశదమౌతుంది. ఈ వెనుకబడిన వర్గాలవారు అన్న పదంలో, షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, తదితర వెనుకబడిన తరగతులవారు కూడా ఉన్నారనేది మనం గుర్తించాలి.

## అస్పృశ్యత నిషేధం

ఇకపోతే 17వ అనుచ్ఛేదం క్రింద, అంటరానితనాన్ని రాజ్యాంగరీత్యా నిషేధించారు. అంటరానితనాన్ని, ఏ రూపంలో అనుసరించినా, అట్టి చర్య చట్టపరంగా శిక్షింపబడవచ్చునని, రూఢి చెయ్యబడింది. ఈ అధికారాన్ని పురస్కరించుకొని, 1955లో అంటరానితనపు నేరాల శిక్షా చట్టము, రూపొందింపబడింది. దీనివల్ల, భారతదేశంలో ఎవ్వరు అంటరానితనాన్ని పాటించినా శిక్షార్హమైంది. ఈ చట్టాన్ని, ఇంకా పటిష్ఠంగా అమలుపరచే నిమిత్తం ఈమధ్య, పార్లమెంటు కొత్తసవరణ ఆమోదించింది. అమానుషమైన అంటరానితనాన్ని, దృఢదీక్షతో భారత ప్రజలు ఎదుర్కొంటున్నట్లు దీనివల్ల చెప్పవచ్చు.

ఇవిగాక, భారత రాజ్యాంగంలో ఆదేశిక సూత్రాలలోకూడా షెడ్యూలు కులాల ప్రస్తావన చెయ్యబడ్డది. 46వ అనుచ్ఛేదంలో బలహీనవర్గాల విద్య, ఆర్థిక పరిస్థితులను మెరుగుపరచడానికి ప్రభుత్వం ప్రయత్నించాలని, ఆ ప్రయత్నంలో షెడ్యూలుకులాల ప్రగతి విషయంలో, ప్రత్యేక శ్రద్ధ వహించాలని, పేర్కొనబడింది. సాంఘిక న్యాయం చేకూర్చడం, ఇతరులు షెడ్యూలుకులాల వారిని దోపిడి చెయ్యకుండా కాపాడడం, ప్రభుత్వ కార్యక్రమంగా నిర్దేశింపబడింది.

పైన పేర్కొన్న రాజ్యాంగపరమైన రక్షణలు సరిగా అమలు జరుపుతున్నదీ లేనిదీ పరిశీలించేందుకు షెడ్యూలు కులాల తెగల ప్రత్యేకాధికారిని రాష్ట్రపతి నియమించాలని 338వ అనుచ్ఛేదం ఆదేశిస్తోంది. ఈ ప్రత్యేకాధికారి, రాజ్యాంగపరంగా, షెడ్యూలు కులాలకు ఇచ్చిన ప్రత్యేక రక్షణలు సరిగా అమలు జరుపుతున్నదీ, లేనిదీ క్షుణ్ణంగా పరిశీలించి, రాష్ట్రపతికి నివేదించవలసి ఉంటుంది. ఈ నివేదిక ప్రతులను పార్లమెంటులోకూడా ఉంచవలసివుంది.

## షెడ్యూలు కులాలకు ప్రత్యేక సౌకర్యాలు

రాజ్యాంగం అమలులోకి వచ్చినప్పటి నుండి కూడా, షెడ్యూలు కులాల వారికి, ఉద్యోగాలు ఒక దామాషాలో, అఖిల భారత సర్వీసులలోను, ఇతర కేంద్ర ప్రభుత్వ ఉద్యోగాలలోను, రాష్ట్రప్రభుత్వ ఉద్యోగాలలోనూ ఇవ్వడం మనకు తెలుసు. అదేవిధంగా, 15వ అనుచ్ఛేదం నాల్గవ క్లాజుననుసరించి, విద్యాలయాలలో, కొన్ని సీట్లు ప్రత్యేకంగా కేటాయించడం కూడా ఉంది. షెడ్యూలు కులాలకు, ఆర్థిక బలం తక్కువగా ఉంటుంది కాబట్టి అట్టి వారి సంతానానికి బడులలోనూ, కాలేజీలలోను చెల్లించవలసిన రుసుము కట్టనవసరం లేకుండా సౌకర్యం కలిగిస్తూ స్కాలర్ షిప్పులు కూడా ఇస్తున్నారు, కొందరికి భోజన వసతి సౌకర్యం కూడా చేకూర్చబడుతోంది. ఉచితంగా పుస్తకాలు, దుస్తులు, షెడ్యూలు కులాల వారికి పంచి పెట్టడం మనం చూస్తున్నాము. ముఖ్యంగా, షెడ్యూలు కులాల వారు అనారోగ్యమైన పరిసరాలలో జీవయాత్ర యుగ యుగాలుగా గడపడంచేత చైతన్య రహితంగా వుంటున్నారని ప్రభుత్వం ఈ మధ్య వారికి గృహవసతి కూడా కల్పిస్తుంది. కాని ఇందులో ఒక పొరపాటు జరుగుతోంది. షెడ్యూలు కులాల వారికి ప్రత్యేకంగా కాలనీలు నిర్మిస్తున్నారు. అట్లా నిర్మించడంవల్ల షెడ్యూలు కులాలవారు ఊరుకు దూరంగా నెట్టివేయబడి అంటరాని వారుగా తిరిగి పరిగణింపబడే ప్రమాదం ఉంది. దీనిని అరికట్టాలంటే గ్రామం మధ్యలో ఉన్న ఇళ్ల స్థలాలు షెడ్యూలు కులాల వారికి ఇవ్వడం, కాలనీలు నిర్మించినప్పుడు ఏ కులం వారైనా బీద వారందరికి ఆ కాలనీలలో చోటు ఇవ్వడం చాలా ముఖ్యం. హరిజనులు తాము నిమ్నజాతులమని మరచిపోయే వాతావరణం సృష్టించ గలిగినప్పుడే, రాజ్యాంగ లక్ష్యం, మనం సాధించ కలుగుతామని ప్రభుత్వం ప్రజలుకూడా గుర్తింపవలసి ఉంటుంది.

తర్వాత అంటరానితనం నిర్మూలన కావడానికీ కులరహిత సమాజ నిర్మాణానికీ, కులాంతర వివాహాలను ప్రోత్సహిస్తున్నాయి రాష్ట్రప్రభుత్వాలు. ఈ చర్య చాలా మంచిది. ఆప్యాయత రక్తసంబంధంలోనుండి పుడుతుంది. సంబంధబాంధవ్యాలు కలుపుకొనడం వల్ల, వ్యత్యాసాలు త్వరగా సమసిపోతాయి. షెడ్యూలు కులాలవారు వారిలోఉన్న శాఖలమధ్య, ఉపకులాల మధ్య, శాఖాంతర వివాహాలు విరివిగా జరుపుకొంటూ వ్యత్యాసాలను క్రమంగా తొలగించుకోవాలి. షెడ్యూలు కులాలకు చెందిన యువతీ యువకులను, ఇతర కులాలవారు వివాహం చేసుకొంటే, ఆర్థికంగా వారికి బహుమతులను రాష్ట్రప్రభుత్వాలు ఇస్తున్నాయి. ఇది ఎంతైనా ముదావహం. ఈ దంపతులకు వసతిసౌకర్యం, ఋణసౌకర్యం, విద్యా సౌకర్యం, ఉద్యోగ సౌకర్యం కలిగిస్తే తొందరగా కుల నిర్మూలన జరిగి, అంటరానితనం సమసిపోయి, షెడ్యూలు కులాలవారు హిందూ సమాజంలో అంతర్భాగం కావడానికి వీలు పడుతుంది ఈ కృషిలో, ప్రతి భారతీయుడు భాగస్వామి కావాలి. ఇది జరిగేవరకు రాజ్యాంగ రీత్యా షెడ్యూలు కులాలకు ఇచ్చిన ప్రత్యేక రక్షణలు కట్టు దిట్టంగా అమలు పర్చవలసి ఉంటుంది.

*

# గాంధీజీ నిర్యాణము

## కరుణశ్రీ నిర్వేదము

శతాబ్దాల పర్యంతం దాస్యాన్ననుభవించిన భారత జాతికి 1947, ఆగష్టు 15న స్వాతంత్ర్యం లభించింది. ఈ స్వాతంత్ర్యం ఆకస్మికంగా ఆకాశాన్నుండి ఊడి పడలేదు. ఎందరో దేశభక్తుల త్యాగఫలితంగా భారతావనికి స్వాతంత్ర్యం లభించింది. పరప్రభుత్వ పైశాచిక పాలన నుండి బయట పడి స్వాతంత్ర్యాన్ని సంపాదించు కొన్న దేశాలు ప్రపంచంలో ఎన్నో వున్నాయి. అయినా ప్రపంచ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో భారతస్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర కొక ప్రత్యేకత వుంది. ఏ దేశస్వాతంత్ర్య పుష్పమైనా రక్త కాసారంలో వికసించిందే కాని భారత స్వాతంత్ర్యకుసుమం అహింసాతటాకంలో ఆవిర్భవించింది ఈ అహింసాయుధాన్నెత్తి ఆంగ్లేయులను గడ గడ లాడించిన ఆదర్శమూర్తి గాంధీ మహాత్ముడు.

"అడుగు పెట్టిన చాలు అవనీంద్ర రత్న రం
జిత కిరీటములు హారతు లొసంగు ;
బయలు దేరిన చాలు జయజయ ధ్వనులతో
గ్రామాలు గ్రామాలు కదలి వచ్చు
కొంగు బట్టినచాలు కోటాను కోట్ల హ
స్తములు బంగారు వర్షములు గురియు
పెదవి యొకింత విప్పిన చాలు లక్షల
కొలది తలల్ వచ్చి కొలువు తీర్చు
నవ్వినంజాలు పతిత మానవ సమాజ
మానసమ్ములు దేదీప్య మానములగు
పట్టు పట్టిన చాలు సమ్రాట్టులైన
తలలు వంతురు మా గాంధితాత ముందు"

ఇది పూజ్య బాపూజీ మాహాత్మ్యం. గాంధీ మహాత్మునింత సుందరంగా వ్యక్తీకరించిన కవీంద్రుడు కరుణశ్రీ. తన కలాన్ని పంచదార పానకంతో నింపిన మధురకవి కరుణవీర రసాలను కమనీయంగా వర్ణించ గలిగిన కవి కరుణశ్రీ. కరుణశ్రీ దృష్టిలో బాపూజీ ఒక పవిత్ర ధర్మ దేవాలయం, ఒక విచిత్ర విశ్వవిద్యాలయం, ఒక పెద్ద హిమాలయం. ఆయన మాటను వేదాక్షరమని, ఆయన పిలుపు యుద్ధశంఖా రావమని, ఆయన బతుకు పరమ పావనమని, ఆయనే లోకైక రక్షకుడని భావించి భారతీయులు ఆయన సాగించిన శాంతి సంగ్రామంలో హృదయ పూర్వకంగా పాల్గొన్నారు. చెరసాలను చంద్ర శాలలుగా భావించారు. లాఠీదెబ్బలను పూల చెండ్లుగా ఊహించారు. కష్టాలను సుఖాలుగా తలంచారు. ఎందరో ప్రాణాధికమైన ప్రాణాల్ని దేశస్వాతంత్ర్యం కోసం తృణాల్లా సమర్పించారు. స్వాతంత్ర్యం వచ్చింది. ఎఱ్ఱ కోటపై త్రివర్ణపతాకం రెపరెపలాడటం ఎల్లరకూ ఆనందాన్ని కల్గించింది.

ఈ ఆనంద గీతికలలో అపశృతులు విన్పించ నారంభించాయి. ఇన్నాళ్ళూ నివురు గప్పిన నిప్పులావున్న మతోన్మాదం విజృంభించింది. మతాలన్నీ భగవంతుని, చేరడానికి వివిధ మార్గాలేనని 'ఈశ్వర అల్లా తేరేనామ్ అని బోధించిన మహాత్మునిణ్ణి. అజ్ఞానులు అపార్థం చేసుకొన్నారు. తత్ఫలితమే బాపూజీ హత్య. బాపూజీ మరణ వార్త వినగానే అందరితో పాటు కవీంద్రులు గూడా దుఃఖించారు. వారి కన్నీటి ధారలు కవిత్వరూపంలో దేశాన్ని ముంచెత్తాయి. బాపూజీ మాహాత్మ్యాన్ని వర్ణించి స్వతంత్ర భారతంలో జీవించ గలుగుతున్నందుకు సంతోషిస్తున్న కవి కరుణశ్రీ. బాపూజీ మరణ వార్త వినగానే పిడుగు పాటు పొందినట్లు కలత చెందారు. బాపూజి హత్యాసమయాన్ని విషాదంగా భావించారు. ఎన్నో ఖండికలను రచించారు.

మహాత్ముడైన గాంధీ మరణించిన సమయంలో సర్వ ప్రకృతి గగ్గోలు పడిందని, విచారగ్రస్త అయిందని కరుణశ్రీ భావం. గోడు గోడున నలభై కోట్ల ప్రజలు దుఃఖిస్తున్న ఆ సమయాన్ని విషాద సుందరంగా వర్ణించారీ కవీంద్రుడు.

"ఉయ్యాలలో నూగుచున్న ముద్దుల బిడ్డ
లేచి కెవ్వున కేక వైచె నేమి?
పాకలో లేగకు పాలిచ్చు గోవు అం
బాయంచు గొంతెత్తి యరచెనేమి ?
జలజలప్రవహించు జమున నిస్తబ్దయై
నిలచి కన్నుల నీరు నింపునేమి?
చకచక పొలము దున్నుకొని పోయెడి రైతు
నాగలి ముందుకు సాగదేమి ?
కోటలో ఆరు గంటలు కొట్టబోవు
వాని హస్తాలు గడగడ వణకె నేమి?
ఏ మహాత్ముని గుండెపై కెక్కి చనెనొ
కాలపురుషుని రథరథాంగములు నేడు"

---

శ్రీ గొల్లపూడి ప్రకాశరావు

---




బాపూజీ మరణించిన సంగతి కవిగారికి తెలియకు కాని ప్రకృతిలోని వైపరీత్యమును భావించి కాలపురుషుని రథాంగము లీనాడెవరి గుండెలపై నెక్కినవో అని భావించడం ఒక చమత్కారం. మానవుని మరణం వలన మానవునిలో సంచలనం కలగడంలో ఆశ్చర్యం లేదు. ఉయ్యాలలో పసిపాప, బిడ్డకు పాలిచ్చు గోవు–అంతేకాదు ప్రాణరహితమైన జమునానది–సంచలించినటని చెప్పడం వలన గూడా ఈ విషాద వాతావరణాన్ని గంభీరంగా, సుందరంగా మార్చ గలిగారు కరుణశ్రీ.

గాంధీ మహాత్ముడు నిండుమనస్వి. విశ్రుతవినీత పునీత యశస్వి. సాత్వికాఖండ తపస్వి. శాంత్యహింసలనే శస్త్రాస్త్రాలు ధరించి సత్యకవచం ఒడుల సంతరించి దండు నడిపిన సత్యాగ్రహి. సత్య సహకారాని కహింసాలతల నల్లు వెట్టి స్వాతంత్ర్య పుష్పాలు పూయించిన వనమాలి. ఈ మహామహుని మరణవార్త వినగానే కరుణశ్రీలోని భావనాశక్తి కవిత్వం వ్రాయమని కవిని బలవంతం చేసిందట. ఆ భావనాదేవి నుద్దేశించి కరుణశ్రీ—

"వ్రాయుము వ్రాయుమంచు బలవంతము సేతువు
దేవి ! దేనితో
వ్రాయుదు శాంతి దేవత యురమ్మున చిందెడు రక్తధారతో
నా? యమునా స్రవంతి నయనాంచల కజ్జల బాష్పధారతో
నా? యెటువ్రాతు విశ్వహృదయమ్ము కలంచు విషాద
కావ్యమున్"

అని చెప్పి, బాధ నొంది కూడా ఉప్పొంగి పొరలిన భావనను గుండెలలో బిగబట్టుకోలేక శోక ఖండికలను రచించారు.

కరుణశ్రీ దృష్టిలో ఈ హత్య గాంధీ అనే వ్యక్తిని గోడ్సే అనే వ్యక్తి సంహరించడం కాదు. అహింసపై హింస దాడి చేయడం, నవోదయ శక్తి విధ్వంసక శక్తి కుప్పించి దూకడం ప్రశాంతంగా జీవిస్తున్న హంసను రాక్షస శక్తి వేటాడటం.

" హింసయహింసపై పగ వహించె నవోదయ
శక్తిమీద
విధ్వంసక శక్తి దూకిన దధర్మము ధర్మము
నాక్రమించెదు
ర్మాంస బుభుక్ష రాక్షస కరమ్ము ప్రశాంతమ
రుత్తరంగిణీ
హంసము వేసె, సౌంద్యసమయమ్మున విశ్వము
విహ్వలింపగన్ "

గాంధీ పూర్ణపురుషుడు. తాను సాధించాలను కొన్న స్వరాజ్యాన్ని సాధించాడు. గాంధీ ధన్యజీవి. పురాణ కాలం నుండి భారత దేశంలో దినదిన ప్రవర్ధమానమౌతున్న అహింసాలత గాంధీ సత్యాగ్రహోద్యమ సమయానికి తేనెలు జాలు వార్చే పుష్పాలతో శోభించింది. ఈ భావమే కరుణశ్రీ కవిత్వంలో అత్యంత సుందరమై రూపుదిద్దుకొన్నది.

"ప్రేమార్ద్ర హృదయుడౌ జీమూతవాహను
జాలిగుండెల మధ్య జననమంది
నిరుపమానత్యాగనిధి దధీచిమునీంద్రు
నాశ్రమద్రుమరాజి నల్లువెట్టి,
కరుణారసామృతగంగాలహరి బుద్ధ
భగవాను కన్నీట చిగురుతొడగి
ధర్మరక్షాప్రియదర్శనుండగు అశో
కునిచల్వ నాల్గుదిక్కులకు ప్రాకి
చను నహింసాలతామతల్లిని మహాత్మ
డంచితమ్ముగ పూలు పూయించినాడు
మాలలంగూర్చి భారతమాతకంత
సీమ నర్పించి దివికి వేంచేసెనేడు."

దివికి వేంచేస్తున్న ఈ విశ్వబాంధవుని ఆహ్వానిస్తూ పూల దండలతో దేవతలు మింట బారులుతీర్చారట! ఈ దివ్యమూర్తి గుణగానం చేస్తూ దర్శనకాంక్షతో స్వర్ణసౌధములమీద దేవతలు గుమిగూడారట! ఇది ఈ కవి ఊహ.

గాంధీమహాత్ముణ్ణి పూలరథంమీద దేవతలు ఊరేగించవచ్చు దేవకాంతలు ఈ రథం సాగే పథంలో పుష్పవర్షాన్ని కురిపించవచ్చు. కాని భారతదేశానికి అపారసేవసల్పిన ఒక మహావ్యక్తిని భారతీయుడే హత్యచేశాడన్న అపకీర్తి ఎలా తొలగుతుంది? సిగ్గుతో చితికిపోయే హిందూదేశస్థుల శిరస్సు ఉన్నతమయ్యేదెప్పుడు? ఎంత మంది కవీంద్రులు కురిపించిన కవితాజలం ఈ ఘోరపాపపంకాన్ని క్షాళనం చేయగలదు?

# ప్రజాస్వామ్య సాధనకు సోపానాలు

# పంచాయతీరాజ్ సంస్థలు

శ్రీ ఎన్. యతిరాజరావు

గ్రామరాజ్యాన్ని స్థాపించడంద్వారా మన దేశంలో రామ రాజ్యాన్ని సాధించాలని గాంధీజీ తలచి యున్నారు. స్థానిక స్వపరిపాలనా సంస్థలను స్థాపించి వాటిని పటిష్ఠం చేయాలన్న విధానం మన స్వాతంత్ర్యోద్యమంలో ఒక అంతర్భాగంగా వుండేదన్న విషయం మనందరికీ తెలుసు. దేశ సౌభాగ్యం మన గ్రామ సీమలపై ఎక్కువగా ఆధారపడి వున్నదన్న విషయం మన జాతీయ నాయకులు ఎప్పుడో గుర్తించారు. ఇటీవలి పరిశోధనలలో ఒక ముఖ్య విషయం తెలియవచ్చింది. అదేమంటే 1923 వ సంవత్సరంలో స్వర్గీయ శ్రీ మోతీలాల్ నెహ్రూ, శ్రీ చిత్తరంజన్ దాస్, శ్రీ హకీం అజ్మల్ ఖాన్ ప్రభృతులు స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత భారత దేశానికి పంచాయతీల ప్రాతిపదికపై ఒక రాజ్యాంగాన్ని రచించారు. నవ భారత రాజ్యాంగం ఈ విధంగానే రూపొందవలసి వుంటుందని ఎందరో నాయకులు తలంచారు. అలా జరుగనందుకు రాజ్యాంగ నిర్ణయ సభలో పెక్కుమంది సభ్యులు తమ విచారాన్ని వ్యక్తపరిచారు. దరిమిలా, పంచాయతీలను స్థాపించాలని ఒక నిర్దేశిక సూత్రాన్ని మాత్రం రాజ్యాంగంలో పొందుపరచడం జరిగింది.

నవభారత నిర్మాత, భారతరత్న పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ గారికి గ్రామ సీమలపైన అపారమైన ప్రేమవుండేది. ప్రజాస్వామ్యంపై అచంచల విశ్వాసం వున్న ఆయనకు గ్రామ ప్రజల స్వశక్తిపై ఎంతో నమ్మకం వుండేది. అదీగాక నూటికి ఎనభై వంతుల మంది ప్రజలు నివసించే గ్రామాలు అభివృద్ధి చెందనిదే భారత దేశం ముందుకు పోజాలదని ఆయన గట్టిగా నమ్మారు. ఆ నమ్మక ఫలితమే 1952 లో దేశవ్యాప్తంగా ప్రారంభమైన సమాజ వికాస పథకాలు. వివిధ సాంకేతిక రంగాలలో నిపుణులయిన అధికారులు, ప్రజాప్రతినిధులు సలహాల మేరకు అభివృద్ధి కార్యక్రమాలను రూపొందించి ప్రజల సహకారంతో వాటిని అమలు చేయాలన్నదే ఈ సమాజ వికాస కార్యక్రమాల ధ్యేయం.

## మూడంతస్థుల సంస్థలు

మొదటి ప్రణాళికా కాలంలో అనుకున్న మేరకు ఈ కార్యక్రమాలు విజయాన్ని పొందలేక పోయాయి. ఈ విషయాన్ని దర్యాప్తు చేసిన బల్వంతరాయ్ మెహతా కమిటీవారు ఈ కార్యక్రమాన్ని ప్రజా ప్రతినిధులకు ఒప్పచెప్పాలని సూచించారు. ఈ సిఫార్సులను అనుసరించి గ్రామ స్థాయిలలో పంచాయతీ, బ్లాకు స్థాయిలో పంచాయతీ సమితి, జిల్లా స్థాయిలలో పరిషత్తులనే మూడు అంచల గ్రామీణ స్వపరిపాలనా సంస్థలను మొట్టమొదటి సారిగా స్థాపించిన ఘనత రాజస్థాన్‌తో పాటు మన రాష్ట్రానికే దక్కింది. ఈ నాడు మన గ్రామ పంచాయతీ, ప్రజలు ఎన్నుకున్న సభ్యులతో కూడుకొని వుంటుంది. ఆ సభ్యులందరూ 'సర్పంచ్' అనే తమ నాయకుణ్ణి ఎన్నుకుంటారు. రోడ్లను వీధులను శుభ్రపరచడం, దీపాలను పెట్టడం, మురుగునీటి పారుదల, మంచి నీటి సౌకర్యం వంటి విధులను పంచాయతీలకు అప్పగించడం జరిగింది. ఆర్థిక స్తోమత, వీలున్న చోటల్లా, ఇతర ప్రజా సంక్షేమ కార్యక్రమాలనూ, అభివృద్ధి కార్యక్రమాలనూ కూడా పంచాయతీలు చేపట్టడానికి వీలు కల్పించబడింది. ఇక బ్లాకు స్థాయిలో ఏర్పాటయిన పంచాయతీ సమితికి సమాజ వికాస కార్యక్రమాలనూ, ఇతర అభివృద్ధి కార్యక్రమాలనూ నిర్వహించే అధికారాలు ఇవ్వబడ్డాయి. ఇదిగాక ప్రభుత్వం అప్పజెప్పే ఏ సంస్థను గానీ, కార్యక్రమాన్నిగానీ, ప్రభుత్వ ప్రతినిధిగా పంచాయతీ సమితి చేపట్టడానికి కూడా వీలు కల్పించడం జరిగింది. పంచాయతీ సమితిలో ఆ బ్లాకులోని గ్రామ పంచాయతీల సర్పంచులూ, ఆ ప్రాంతపు శాసనసభ్యులు, మరికొందరు కో ఆప్టెడ్ సభ్యులూ వుంటారు. వారంతా సమితి అధ్యక్షుణ్ణి ఎన్నుకుంటారు.

ఇకపోతే, జిల్లాస్థాయిలలో ఏర్పడ్డ జిల్లాపరిషత్తు సమితి కార్యకలాపాలను పర్యవేక్షిస్తు వాటిని సమన్వయపరుస్తూ వుంటుంది. సెకండరీ విద్యాబోధన పూర్తిగా జిల్లా పరిషత్తులపరం చేయబడినది. ఇవిగాక, సమాజ సంక్షేమ కార్యక్రమాలూ, కొన్ని మధ్యతరహా నీటి పారుదల సౌకర్యాలను కూడా పరిషత్తులు నిర్వహిస్తాయి. పంచాయతీ సమితి అధ్యక్షులూ, జిల్లా కలెక్టరూ ఆ ప్రాంతపు శాసన సభ్యులూ, మరి కొందరు కో ఆప్టెడ్ సభ్యులూ, జిల్లాలోని పార్లమెంటు సభ్యులూ జిలా పరిషత్తులో సభ్యులుగా వుంటారు.

1959 నవంబరు 1 వ తేదీన అమలులోనికి వచ్చిన ఈ సంస్థలు ప్రజోపయోగకరమైన ఎన్నో కార్యక్రమాలను విజయవంతంగా చేపట్టాయి. కొన్ని కొన్ని విషయాలలో అనుకున్న మేరకు విజయాన్ని సాధించలేకపోయిన మాటకూడ వాస్తవమే. ఈ విషయాలను ప్రస్తావించే ముందు వీటినుంచి మనం ఎట్టి ఫలితాలను ఆశించామో ఇపుడు చెప్పుకుందాము.

మొట్టమొదటి విషయం-ప్రజాస్వామ్యపు పునాదులు గట్టిగా వుండాలంటే స్థానిక స్వపరిపాలనా సంస్థలను పటిష్ఠం చెయ్యక తప్పదు. ప్రభుత్వాధికారాన్ని ఏ కొద్దిమందికో అప్పగించక, వివిధ స్థాయిలలో వేలకొలదిమంది ఎన్నికైన ప్రజా ప్రతినిధుల పరంచేస్తే నిరంకుశత్వానికి తిలోదకాలిచ్చినట్లవుతుంది.

## శిక్షణ

రెండవది-ప్రజాస్వామ్యం విజయవంతం కావడానికి సమర్థులైన నాయకులు కావాలి. వారికి పాలనా విషయాలలో తగిన శిక్షణ కావాలి. ఆ విధమైన అనుభవమూ, శిక్షణా వారికి స్థానిక సంస్థల ద్వారా ఎక్కువగా లభిస్తుంది. ఈ నాడు మన ప్రభుత్వంలోవున్న మంత్రులలో సగానికిపైగా పంచాయతీరాజ్య సంస్థలద్వారా శిక్షణ పొందినవారే.

మూడు-స్థానిక ప్రజల అభిరుచులు, వారి అవసరాలు, వారి ప్రతినిధులకు తెలిసినంతగా బయటినుండి వచ్చిన అధికారులకు తెలిసే అవకాశం తక్కువగా వుంటుంది. వారి ప్రతినిధులు విచారించి చర్చించి తీసుకున్న నిర్ణయాలను ఆమోదించినంతగా ప్రభుత్వోద్యోగుల అభిప్రాయాలను వారు స్వీకరించకపోవచ్చు. మరొక ముఖ్యవిషయం-అభివృద్ధి పథకాలను గురించినది. బయట నుండి వచ్చే సహాయంపై ఆధారపడి సౌకర్యాలకై వేచి ఉండటం కన్నా స్వశక్తిమీద ఆధారపడి స్థానిక వనరులను సమీకరించుకుని పురోభివృద్ధిని సాధించాలన్న విధానం సర్వత్రా ఆమోదించబడినది. అనగా సరియైన నాయకత్వంవుండి ప్రభుత్వపు ప్రోత్సాహము అండదండలు వుంటే స్థానిక ప్రజలు ముందుకువచ్చి వనరులను సమీకరించుకుని, పథకాలను తయారుచేసుకుని వాటిని అమలుపరచటం ద్వారా దేశ సౌభాగ్యానికి దోహదం చేయగలరని మన ప్రగాఢ విశ్వాసం.

## ప్రజల పర్యవేక్షణ

అదీకాక, ప్రభుత్వం స్థానికంగా ఏ కార్యక్రమాన్ని చేపట్టినా స్థానిక ప్రజల పర్యవేక్షణ, వారి ప్రమేయం లేనిదే పనులు విజయవంతంగా సాగవనీ, నిధులు సద్వినియోగం కాకపోవచ్చునీ అందరూ అంగీకరించిన విషయమే-నిజానికి బ్రిటిషు వారి హయాములోనే లార్డుమేయో, రిప్పన్ వంటివారు ఈ అభిప్రాయాన్ని వెలిబుచ్చి స్థానిక స్వపరిపాలనా సంస్థల స్థాపనను సమర్థించారు.

వాటిపైవుంచిన విశ్వాసానికి తగినట్టుగా పంచాయతీరాజ్ సంస్థలు మన రాష్ట్రంలో అనేక అభివృద్ధి కార్యక్రమాలను సాధించాయి. వేలకొలది పాఠశాలలు స్థాపించబడ్డాయి. కొన్ని వేల మైళ్ళు రోడ్లు వేయబడినాయి. ప్రజలు చొరవతో ముందుకు వచ్చి విరివిగా విరాళాలిచ్చి ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలను విజయవంతంగా అమలుజరుపుకున్నారు. కాని కొన్నాళ్ళ తర్వాత ప్రభుత్వం నుండి ఆర్థిక సహాయం సన్నగిల్లడంవల్లనూ, చాలా చోట్ల స్థానిక నాయకులు అభివృద్ధి కార్యక్రమాలకన్నా రాజకీయాల పట్ల ఎక్కువగా ఆసక్తి చూపడంవల్లనూ, పంచాయతీరాజ్ సంస్థలు తమ ఉత్సాహాన్ని, శక్తిని కోల్పోయాయి.

తిరిగి 1968వ సంవత్సరం తర్వాత ఈ సంస్థల పునరుద్ధరణకై కొన్ని పరిశీలనలు జరిగాయి. వీటిలో శ్రీ వెంగళరావుగారి నాయకత్వాన నియమించబడిన కమిటీ, శ్రీ నరసింహంగారి నాయకత్వాన ఏర్పరచబడిన కమిటీల సిఫారసులను ఇప్పుడు ప్రస్తావిస్తాను.

## శ్రీ వెంగళరావు కమిటీ సిఫార్సులు

పంచాయతీరాజ్ సంస్థల ఎన్నికలలో ప్రస్తుతం కానవచ్చే అవినీతి చర్యలను ముఠాతత్వాలను అరికట్టే నిమిత్తం ఎన్నికల విధానాన్ని మార్చడం, నియంత్రణా విధానాలను నిర్మాణాత్మకమైనవిగా చేయడం, నిధులను పుష్కలంగా అందించటం, అనధికారులకు అవసరమైన మేరకు పాలనాధికారాలను, స్వేచ్ఛను ఇవ్వడం వంటి విషయాలను గురించి శ్రీ వెంగళరావు కమిటీ నిర్దిష్టమైన సిఫార్సులను చేసినది. అదే విధంగా పాలనా యంత్రాంగాన్ని గురించి, ఆర్థికవనరులకు సంబంధించి నరసింహం కమిటీ వారు చక్కని సూచనలను చేశారు. ఇటీవల మన రాష్ట్రంలో ప్రభుత్వం ఏర్పాటుచేసిన ప్రాంతీయ సమావేశాలన్నింటిలోనూ శ్రీ వెంగళరావు గారి కమిటీ చేసిన సిఫారసులకు సర్వత్రా ఆమోదం లభించింది. ప్రజాభిప్రాయాన్ని సేకరించిన మీదట ప్రభుత్వం వారు పంచాయతీరాజ్ సంస్థలకు సంబంధించిన చట్టాలను సవరించే నిమిత్తం శాసన సభలో బిల్లులను ప్రవేశపెట్టారు. ఈ బిల్లులలో ప్రతిపాదించిన నిర్మాణాత్మకమైన మార్పులను అమలుజరిపినప్పుడు పంచాయతీరాజ్ సంస్థలు ఒక నూతన యుగంలో ప్రవేశిస్తాయని చెప్పటానికి ఎట్టి సందేహమూలేదు.

## రజతోత్సవాలు

మన రాజ్యాంగంలోని పంచాయతీలకు సంబంధించిన నిర్దేశిక సూత్రము అమలులోనికివచ్చి 25 సంవత్సరాలు నిండిన సందర్భంగా దేశవ్యాప్తంగా రజతోత్సవాలు జరుపుకున్న విషయం అందరికీ తెలిసినదే. ఈ ఉత్సవాల నిర్వహణకు ప్రభుత్వంవారు రాష్ట్ర, జిల్లా జిల్లాస్థాయిలలో కమిటీలను ఏర్పాటు చేశారు. మన రాష్ట్ర అవతరణ దినమైన నవంబరు 1 వ తేదీ నుంచి మన దేశనాయకురాలైన శ్రీమతి ఇందిరాగాంధీ జన్మదినమైన 19 వ తేదీ వరకు, ఈ ఉత్సవాలను భారీఎత్తున జరుపడానికి ప్రభుత్వం వారు ఏర్పాట్లు చేశారు. మొదటి పది రోజులలోను రాష్ట్రంలోని పంచాయతీలన్నీ గ్రామ సభలను చేయాలని ఉత్తర్వులను జారీచేయడమైనది. నవంబరు 1వ తేదీన హైదరాబాదులో మన ముఖ్యమంత్రి ఈ ఉత్సవాలను ప్రారంభించారు. ఆ సందర్భంగా రాష్ట్ర పంచాయతీరాజ్య పరిషత్తువారు ప్రచురించే "పంచాయత్" పత్రిక 120 పేజీల ప్రత్యేక సంచికను వేసింది. మన దేశంలో అత్యవసర పరిస్థితి నెలకొల్పవలసిన అవసరం ఎందుకు వచ్చిందో వివరిస్తూ ఈ సందర్భంగా ప్రధాని 20 అంశాల ఆర్థిక కార్యక్రమాన్ని అమలు జరుపడంలో పంచాయతీల కర్తవ్యాన్ని విపులీకరిస్తూ నవంబరు ఒకటవ తేదీ నుంచి పదవ తేదీ వరకు జరిగిన గ్రామ సభలలో విశదీకరించడానికి వీలుగాను ఆ సభలలో ఆమోదించవలసిన తీర్మానం ముసాయిదాతోపాటు-రాష్ట్ర పంచాయతీరాజ్య పరిషత్తు 50,000 కరపత్రాలను ముద్రించి నవంబరు 1 వ తేదీ నాటికి అన్ని పంచాయతీరాజ్ సంస్థలకూ చేరవేసింది. గ్రామ

సభలలో ఈ కరపత్రాన్ని చదివినటూ అందులోని ముసాయిదా తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించినట్లూ పరిషత్తు కార్యాలయానికి అనేకంగా ఉత్తరాలు వస్తున్నాయి. ఇదికాక ప్రధాని 20 అంశాల కార్యక్రమాన్ని వివరించే 50,000 కరపత్రాలను విమానం ద్వారా వేసే కార్యక్రమాన్ని కూడా పంచాయతీరాజ్య పరిషత్తు చేపట్టింది.

మన గ్రామ పంచాయతీలు ప్రజాస్వామ్య భవనానికి పునాదులుగా స్థిరపడాలంటే గ్రామ ప్రజలకు ప్రస్తుత దేశపరిస్థితులు, పైస్థాయిలో వున్న ప్రభుత్వ విధానాలు కార్యక్రమాలు క్షుణ్ణంగా తెలియడం అవసరం అందువల్ల నవంబరు 11వ తేదీన దేశ ప్రజలనుద్దేశించి మన ప్రధానమంత్రి చేసిన రేడియో ప్రసంగం తెలుగు అనువాదాన్ని అరవై వేల ప్రతులను ముద్రించి రాష్ట్రంలోని అన్ని పంచాయతీరాజ్ సంస్థలకూ నవంబరు 19వ తేదీలోగా అందజేసే కార్యక్రమాన్ని కూడా రాష్ట్రపంచాయతీరాజ్ పరిషత్తు చేపట్టింది.

పంచాయతీరాజ్ సంస్థ కార్యక్రమాలను విద్యావేత్తలద్వారా పరిశోధించే కార్యక్రమాన్ని రాష్ట్రపంచాయతీరాజ్య పరిషత్తు గత రెండుసంవత్సరాలుగా నిర్వహిస్తున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయం పరిపాలనా శాస్త్రవిభాగం వారు జరిపిన పరిశోధనా ఫలితాలను ప్రభుత్వం ఆమోదించడం కూడా జరిగింది. నవంబరు 10వ తేదీన ఆంధ్రవిశ్వవిద్యాలయంలో జరిగిన సెమినార్‌లో రాష్ట్ర పంచాయతీ రాజ్య పరిషత్తు కూడా పాల్గొన్నది. పరిషత్తువారు నవంబరు 14వ తేదీన పండిత నెహూ్రు జన్మదినోత్సవాన్ని బాలల మహోత్సవంగా జరుపుతున్నారు. ప్రధాన మంత్రి జన్మదినోత్సవాన్ని కూడా 19న అంతర్జాతీయ మహిళాదినోత్సవంగా పరిషత్తు వారు పెద్ద ఎత్తున నిర్వహించారు.

ప్రస్తుత పరిస్థితులలో పంచాయతీరాజ్ సంస్థకు నిర్మాణాత్మకమైన కార్యక్రమాలను చేపట్టే అవకాశాలను యితోధికంగా కనిపిస్తున్నాయి. వాటిని జారవిడుచుకుంటే తిరిగి లభించకపోవచ్చు. అట్టి ఈ సంస్థలో పని చేసే ప్రతివారూ ప్రజాసేవకు పునరంకితము కావలసివున్నది. మనదేశములో ప్రజాస్వామ్యం నిలిచినన్నాళ్ళు పంచాయతీ రాజ్ సంస్థలకు స్థానం వుంటుంది, పంచాయతీ రాజ్ సంస్థలు వర్ధిల్లినన్నాళ్ల ప్రజాస్వామ్యానికి ఎట్టి ఆపదా రాదు.

---

# ఈ సంచికలో రచయితలు

## శ్రీయుతులు

ఎన్. యతిరాజరావు, శాసనసభ్యుడు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పంచాయతీరాజ్ పరిషత్తు అధ్యక్షులు.

ఎ. సోమసుందర్, కళాకేళి నికేతన్, పిఠాపురం-533450.

జె. వీరాస్వామి, ఆంధ్రప్రదేశ్ సర్వీస్ కమీషన్ సభ్యుడు, హైదరాబాదు.

కె. వి. కె. రావు, ఎకనామిక్సు శాఖాధిపతి, ఎస్. ఎస్ ఆర్. జె. కళాశాల, ఖమ్మం.

ఎం. రామమూర్తి, టి. పి. ఆర్. ఓ. బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా.

తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి, పెన్షన్ ఆఫీసర్, ఎ. జీ. ఆఫీసు హైదరాబాదు

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, 69, ఆదర్శనగర్, హైదరాబాదు.

నండూరి వేంకట సత్యరామారావు, ఆంధ్రోపన్యాసకులు, ప్రభుత్వ కళాశాల, తాడేపల్లిగూడెం, పశ్చిమ గోదావరి జిల్లా.

తిరుమల రామచంద్ర, 69 ఆదర్శనగర్, హైదరాబాదు.

"శ్యావాస్య", వి. మురళీమోహన్, అల్లూరు, నిజాంపట్నం మీదుగా తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా.

ముక్కపాటి నరసింహమూర్తి, "శ్రీసదన్", నరసింహారావుపేట. ఏలూరు-2, పశ్చిమ గోదావరి జిల్లా.

సిద్దాని నాగభూషణం, పి.పి.ఆర్. ఓ. సమాచారశాఖ, హైదరాబాదు

గొల్లపూడి ప్రకాశరావు, తెలుగు లెక్చెరర్, జె. కె సి కళాశాల, గుంటూరు-4.

కె. సంపత్కుమారాచార్య, లెక్చెరర్, ప్రభుత్వ కళాశాల, జగిత్యాల-505327

గుత్తికొండ సుబ్బారావు, 26/162, బుట్టాయిపేట, మచిలీపట్నం-521001.

ఎస్. ఆర్. కోటేశ్వరశర్మ, స్టాటిస్టికల్ డిపార్టుమెంట్, ఎల్.ఐ.సి. ఆఫ్ యిండియా, డివిజనల్ ఆఫీసు, హైదరాబాదు-4

ఆదిభట్ల వేంకటరమణ, ప్రెస్ కరస్పాండెంటు, సారంగదోలవీధి, శ్రీకాకుళం.

కె. ఆర్. కె. మోహన్, అసిస్టెంట్ పోస్టుమాస్టర్, జూబిలీ పోస్టాఫీస్, హైదరాబాదు.

ఎస్. స్వరాజ్యలక్ష్మి, 12-1-764/1, ఆసిఫ్‌నగర్, హైదరాబాదు.

సి. ఆనందారామం, ఎస్. టి. 26, మారేడ్‌పల్లి, సికిందరాబాదు.

కోట కమలాదేవి, 3-4-526/11, బర్కత్‌పురా, హైదరాబాదు.

రావిపాటి మహానంద, కురిచేడు ప్రకాశంజిల్లా.

# జిల్లా సమాచారం

## విశాఖ జిల్లా లేఖ

విశాఖ జిల్లాలో హరిజన, గిరిజన, ఇతర వెనుక బడిన వర్గాల సహాయానికి, ఈ సంవత్సరం గాంధీ జయంతి నాడు పెద్ద పెట్టున కార్యక్రమం చేపట్టబడింది. గోపాల పట్నం వద్ద గాంధ జయంతి నాడు సభ జరిపి, సన్నకారు రైతులకు, వ్యవసాయ కూలి లకు మొత్తం 479 మందికి రూ 3 లక్షల 87 వేల వరకూ అప్పులు మంజూరు చేశారు. ఇదే సందర్భంలో 102 హరిజనులకు ఇళ్ల స్థలాల పట్టాల పంపకం కూడా జరిగింది. విశాఖ జిల్లా షెడ్యూల్డు కాస్టు సర్వీస్ కార్పొరేషన్, మరియు బేక్‌వర్డు క్లాస్ ఫైనాన్స్ కార్పొరేషన్ వారు తలపెట్టిన వివిధ పథకాలకి విజయ నగరం కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు వారు రూ. లక్ష 20 వేలు, యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా వారు రూ. లక్ష 9 వేలు, ఇండియన్ ఓవర్ సీస్ బ్యాంకు వారు రూ. 83 వేలు, స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా వ్యవసాయ అభివృద్ధి శాఖ వారు రూ. 46 వేలూ అప్పులు ఇచ్చారు

అక్టోబరు నెలలోనే ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వయోజన విద్యావిభాగాన్ని ఒక దాన్ని స్థాపించారు. వయోజన విద్యా విషయాలలో విదేశాలలో శిక్షణ పొందిన ప్రొఫెసర్ శ్రీ డి. సుబ్బారావుగారి ఆధ్వర్యాన ఈ వయోజన విద్యా శిక్షణ తరగతులు ప్రారంభం అయ్యాయి. జనాభాలో వివిధ వర్గాలలో వున్న వయోజనుల విద్యాభివృద్ధి అవసరాలను పరిశీలించి, ఈ అవసరాలు తీర్చడానికి విద్యా భోధాన తరగతులు, విద్యా విషయిక సమ్మేళనాలు. సదస్సులు. వేసవి శిక్షణ శిబిరాలు ఈ విభాగం వారు నిర్వహిస్తారని శ్రీ సుబ్బారావు గారు తెలియజేశారు.

ఈ నెలలో రోడ్డు ట్రాన్సుపోర్టు కార్పొరేషన్ వారు కొన్ని భారీ పథకాలను విశాఖ జిల్లాలో ప్రారంభించారు. వీటిలోముఖ్యమయినది విజయనగరంలో నెలకొల్ప నున్న 'రీజినల్ వర్కుషాప్' దీనికి రూ. 1 కోటి 50 లక్షలు వ్యయం అవగలదని ఆర్. టి. సి. ఛైర్మన్ శ్రీ పి. నరసింగరావు గారు తెలియచేశారు. రాష్ట్రంలో నెలకొల్ప నున్న మూడు ప్రాంతీయ వర్కు షాపులలో విజయనగరం ఒక కేంద్రం అని ఆయన అన్నారు. ఇది కాక రూ. 30 లక్షల వ్యయంతో ఒక బస్‌డిపో కూడా విజయనగరంలో ప్రారంభించారు. ఇది కాక అక్టోబరు 1వ తారీకునుండి ఆర్.టి.సి. వారు విశాఖపట్టణం నుండి 'గోదావరి లింక్ ఎక్స్‌ప్రెస్ బస్'ను కూడా ప్రారంభించారు. గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో విశాఖపట్టణం ఉదయం వచ్చిన ప్రయాణీకులకు ఈ ఆర్ టి. సి. బస్సు విజయనగరం, శ్రీకాకుళం తీసుకువెళ్ళి, సాయంత్రం గోదావరి ఎక్స్‌ప్రెస్ అందుకోవలసిన ప్రయాణీకులను శ్రీకాకుళం, విజయనగరం నుంచి విశాఖ రైల్వే స్టేషన్‌కు ఈ బస్సు తీసుకువస్తుంది ఈ కొత్త బస్సు అనేక మంది ప్రయాణీకులను ఆకర్షిస్తున్నది

విశాఖపట్టణంలో ప్రస్తుతం అభివృద్ధిచెందుతున్న "ఇందిరా గాంధీ జూలాజికల్ పార్కు." కి అనుబంధంగా మెరీన్‌లాండ్ కాంప్లెక్సు నెలకొల్పడానికి చురుకుగా కార్యక్రమం ప్రారంభం అయింది ఇందులో సాగర గర్భంలో చిత్ర విచిత్ర జలచరాలను వీటిలో పెంచుతూ ప్రదర్శిస్తారు ఈ ప్రదర్శన కేంద్రంలో ఇతర జలచరాలతో పాటు డాల్ఫిన్సు వంటి అపురూపజలచరాలను కూడా ప్రదర్శిస్తారట దీనికి రూ 10 లక్షలు వ్యయం అవుతుందని, ఈ మెరీన్‌ల్యాండ్ కాంప్లెక్సు విషయంలో సలహా ఈయడానికి కొందరు విదేశ నిపుణులను ఆహ్వానిస్తున్నాం అని అటవీ శాఖ మంత్రి శ్రీ అన్సారి ఇటీవల విశాఖపట్టణంలో తెలియ జేశారు. రాష్ట్ర అటవీ శాఖ అధ్వర్యాన ఈ జూలాజికల్ పార్కు మెరిన్ ల్యాండ్ కాంప్లెక్సు అభివృద్ధి చేయబడుతున్నాయి సాగరగర్భజలచరాల ప్రదర్శన కేంద్రం భారత దేశంలో మరెక్కడా లేదని మంత్రి శ్రీ అన్సారి తెలియ జేశారు

విశాఖ పట్టణంలో భారీ నౌకల రాకకోసం నిర్మాణంలో వున్న ఔటర్ హార్బర్ ఇంకా పూర్తి కాకుండానే, భారీ నౌకల రాక ప్రారంభం అయింది.

ఇటీవల 89,000 టన్నుల భారీ ఆయిల్ టాంకర్ విశాఖ ఔటర్ హార్బర్‌లోకి రావడం విశాఖ రేవు చరిత్రలో ఒక ప్రధాన విజయంగా పరిగణించబడింది. ఇంత భారీనౌక ఇదివరకెప్పుడూ విశాఖ రేవుకు రాలేదు. విశాఖపట్నంలోని కాల్‌టెక్స్ నూనె శుద్ధి కర్మాగారానికి ఈ ఆయిల్ టాంకర్ క్రూడ్ ఆయిల్ తీసుకువచ్చింది.

కుటుంబ నియంత్రణ జిల్లా స్థాయి సలహా సంఘం వారు ఇటీవల జిల్లాకలెక్టర్ అధ్యక్షతన సమావేశం అయి, కొత్తగా పెళ్లి చేసుకున్న వధూవరులకు ఇచ్చే బహుమానాలతో పాటు, కుటుంబనియంత్రణకు సంబంధించిన కరపత్రాల ప్యాకెట్ బహుమానంగా అందించాలని నిర్ణయించారు. వివిధ దేవస్థానాలలో వున్న కళ్యాణమండపాల వద్ద కుటుంబ నియంత్రణ తెలిపే పెద్ద పెద్ద చిత్రాలు ప్రదర్శించాలని కూడా సలహా ఇచ్చారు.

ఈ నెలలో విశాఖ పట్టణంలో జరిగిన వార్షిక సంగీతోత్సవాలు సంగీత రసికులకు వీనులవిందు చేశాయి. దేశంలోని అనేక మంది సంగీత విద్వాంసులు ఈ సంగీతోత్సవంలో పాల్గొన్నారు, విశాఖ మ్యూజిక్ ఎకాడమి ఆధ్వర్యాన జరిగిన ఈ సంగీతోత్సవాలలో ప్రఖ్యాత వీణా విద్వాంసులు శ్రీ ఈమని శంకర శాస్త్రి గారికి సంగీత కళా సాగర అనే బిరుదు ఇచ్చి సత్కరించారు.

శ్రీ జి. ఎస్. ఎన్. మూర్తి.

## నిజామాబాద్ జిల్లా లేఖ

అక్టోబరు నెలలో నిజామాబాద్ జిల్లాకు శుభ సూచకమైన పరిణామాలెన్నో జరిగాయి. పారిశ్రామికాభివృద్ధికి అత్యావశ్యకమైన విద్యుచ్ఛక్తి సరఫరా సౌకర్యాల విస్తరణకు గట్టి పునాదులు పడినవి. కొన్ని ముఖ్యమైన పరిశ్రమల స్థాపనకు సన్నాహాలు ప్రారంభమయినవి.

జిల్లాలోని మూడు ముఖ్యమైన కేంద్రాలు దోమకొండ, బాన్సువాడ, లింగంపేటలలో 33 కిలోవాట్ల శక్తి గల విద్యుచ్ఛక్తి సబ్ స్టేషన్ల నిర్మాణానికి రాష్ట్ర విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ జి. రాజారామ్, తెలంగాణా అభివృద్ధి కమిటీ అధ్యక్షులు శ్రీ సి. జగన్నాథరావు శంకుస్థాపన చేశారు. శ్రీ జి. రాజారామ్ ఈ సందర్భంలో ప్రసంగిస్తూ వచ్చే ఒకటి రెండేళ్లలో ఈ జిల్లాలో పెక్కు సేద్యపు బావులకు విద్యుచ్ఛక్తి సౌకర్యం సమకూర్చగలమని హామీ ఇచ్చారు.

బాన్సువాడలో సబ్ స్టేషన్ నిర్మాణానికి ఆయన శంకుస్థాపన చేస్తూ, బాన్సువాడ పంచాయతి సమితిలోని అన్ని గ్రామాలకు రెండేళ్లలోగా విద్యుచ్ఛక్తి సౌకర్యం సమకూర్చుతామని హామీ ఇచ్చారు.

ఈ మూడు సబ్ స్టేషన్ల నిర్మాణం పూర్తయిన తరువాత ఈ ప్రాంతాల్లో విద్యుచ్ఛక్తి సరఫరా సౌకర్యాలు పెక్కు రెట్లు పెరుగుతాయి.

నిజామాబాద్ పట్టణం శివారులో ఆధునిక సౌకర్యాలు గల ఆటోనగర్ నిర్మాణానికి సన్నాహాలు ప్రారంభమయినవి. వర్క్ షాపుల యజమానులు, మోటారు విడిభాగాల వ్యాపారులు, మోటారు వాహనాల యజమానులు ఇటీవల జిల్లా కలెక్టర్ అధ్యక్షతన సమావేశమై ఈ ఆటోనగర్ స్థాపనకు నిర్ణయం గైకొన్నారు. 190 ప్లాట్లకై దరఖాస్తులు నమోదయినవి.

నిజామాబాద్ జిల్లాలో చెరకు, వరి ధాన్యం తరువాత మొక్కజొన్న పంటది మూడవ స్థానం. మొక్కజొన్న పండించే రైతులు ఇటీవల జిల్లా కలెక్టర్ అధ్యక్షతన సమావేశమై మొక్కజొన్న గింజి ఫ్యాక్టరీని నెలకొల్పాలని నిర్ణయించారు. దీనివల్ల రైతులకు గిట్టుబాటు ధర లభించడానికి అవకాశం ఏర్పడుతుంది.

నిజామ్ షుగర్ ఫ్యాక్టరీలో ఈ నెల 27 వ తేదీన చెఱకు క్రషింగ్ ప్రారంభమయింది. నిరాడంబరంగా జరిగిన ఒక సభలో ఒక సామాన్య కార్మికుడు ఒక సామాన్య రైతు ఈ సంవత్సరానికి చక్కెర ఉత్పత్తి కార్యక్రమాన్ని ప్రారంభించారు. నిరుద్యోగులుగా ఉన్న పెక్కు మంది కార్మికులకు దీనివల్ల పని లభిస్తుంది.

రాష్ట్రంలో ప్రభుత్వ రంగ సంస్థల స్థితి గతులపై దర్యాప్తు జరుపుతున్న విధాన సభ్యుల బృందం ఇటీవల నిజామాబాద్, కామారెడ్డి బస్ డిపోలను తనిఖీ చేసింది. నిజామాబాద్ డిపోలో 91 బస్సులు కలవనీ ఈ బస్సులలో సగటున రోజు 41 వేల మంది ప్రయాణం చేస్తున్నారనీ, ఆర్. టి. సి. అధికారులు ఈ కమిటీ సభ్యులకు తెలియజేశారు.

ఆర్. టి. సి. వారు నిజామాబాద్‌లో అత్యాధునిక సౌకర్యాలతో నిర్మిస్తున్న విశాలమైన బస్సు స్టాండ్‌ను ఈ కమిటీ సభ్యులు తనిఖీ చేశారు. ఈ బస్సు స్టాండ్‌కు త్వరలో ప్రారంభోత్సవం జరుగుతుంది.

నిజామాబాద్ జిల్లా ఈ నెలలో క్రీడారంగంలో అఖిల భారత ఖ్యాతిని గడించింది. కుమారి జయశ్రీ, కుమారి సునీలారెడ్డి పంజాబ్‌లో జరిగిన అఖిల భారత స్థాయి మహిళల పరుగు పందెములో గెలుపొంది బహుమతులను సాధించారు. గుంటూరులో జరిగిన రాష్ట్రస్థాయి పోటీలలో కూడా గెలుపొందారు.

శ్రీ ఎం. ఎ. రషీద్

## ఆదిలాబాదు జిల్లా లేఖ

ఆదిలాబాదు జిల్లా యిరవై సూత్రాల పథకం క్రింద సాధించిన అభివృద్ధిని సమీక్షిస్తూ జిల్లా కలెక్టర్ శ్రీ కె. సి. మిశ్రా పూర్వం సిర్‌పూర్ పేపర్ మిల్లులో అరవై మూడు వేల మెట్రిక్ టన్నుల కాగితం ఉత్పత్తి అయ్యేదని, అత్యవసర పరిస్థితి క్రింద ఎనిమిది వేల మెట్రిక్ టన్నుల కాగితాన్ని అధికంగా ఉత్పత్తి చేసి ప్రస్తుతం 71 మెట్రిక్ టన్నులకు చేరుకుందని తెలియజేశారు.

జిల్లాలోని ఖానాపూర్ తాలూకాలో భూవసతి లేని బీదవారి సహాయ పథకం క్రింద 852 మంది హరిజనులకు, 607 మంది గిరిజనులకు, 1199 మంది వెనుక బడిన వర్గాల వారికి 334 మంది విముక్త జాతుల వారికి మొత్తం 3316 మందికి యిళ్ల స్థలాలను కేటాయించడం జరిగింది.

ఈ స్థలాల సేకరణకు, చదును చేయటానికి గాను 72,954 రూపాయలు ఖర్చయినాయి.

రాష్ట్ర గవర్నర్ శ్రీ ఓబుల రెడ్డిగారు ఆదిలాబాదు జిల్లా పర్యటన సందర్భంగా లక్షా యాభై వేల రూపాయల ఖర్చుతో నిర్మింప బడే నిర్మల్ హాస్టల్ భవనానికి శంఖుస్థాపన చేశారు.

అప్పుడే పది మంది చిన్న తరహా రైతులకు ఆయిల్ యింజన్లు, కరెంటు మోటార్ల కొనుగోలుకై యిరవై ఐదు వేల రూపాయలు పంపిణీ చేశారు.

శ్రీ ఓబుల రెడ్డిగారు ఆదిలాబాదు స్థానిక గిరిజన బాలికల హాస్టల్ భవనానికి ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంగా మాట్లాడుతూ–గిరిజన బాలికలను తమ స్వంత పిల్లలవలే ప్రేమాభిమానాలతో చూడాలని చెప్పుతూ పిల్లలకు రేడియో కొనడానిగ్గాను 250–00 రూపాయలను విరాళంగా యిచ్చారు.

గత మాసం 28వ తేదీన ఆదిలాబాదు కళాశాల ఉపన్యాసకుల సంఘం 'కళా భారతి' తరఫున కాళిదాసు జయంతి ఉత్సవాన్ని పెద్ద యెత్తున జరిపారు. ఆ సందర్భంగా ముఖ్య అతిథిగా ఆహ్వానితులైన శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ ఆంధ్రోపన్యాసకులు శ్రీ తుమ్మపూడి కోటేశ్వరరావు గారు కాళిదాస నాటకాలను, కావ్యాలను గురించి మాట్లాడుతూ ఈ కళాశాల నుండి కూడా కొంత మంది విద్యార్థులు సాహితీస్పృహ గల చక్కటి రచయితలుగా, విమర్శకులుగా రాణించాలని దీవించారు.

మరునాడు స్థానిక విద్యార్థి బృందం వారి 'రసభారతి' తరఫున శ్రీ కోటేశ్వరరావుగారు 'ఆధునిక సాహిత్యం' పై ప్రసంగించారు.

సాహితీ చైతన్యాన్ని, సామాజిక స్పృహగల రచనలను వెలుగులోనికి తేవడమే 'రసభారతి' ఆశయాలుగా పేర్కొనబడినాయి.

ప్రధాని సహాయ నిధికి—మంచిర్యాల గుమాస్తాల సంఘం 201 రూపాయల చెక్కును రాష్ట్ర రెవిన్యూ శాఖా మంత్రి శ్రీ నరసారెడ్డికి అందించారు.

ఆదిలాబాదు జిల్లా గ్రంథాలయ సంస్థ సర్వసభ్య సమావేశం యిటీవల జరిగింది. జిల్లాలోని అన్ని తాలూకా కేంద్రములందు సంచార గ్రంథాలయాలను నెలకొల్పుటకు తీర్మానించబడింది.

మహాత్ముని జయంతి సందర్భంగా ఆదిలాబాదు జిల్లా లక్సెట్టిపేటలోని వేమనూరు, నెంబాల్, ఎల్లారాం గ్రామాలకు చెందిన 156 మంది హరిజనులకు భూమి పట్టాలను పంచిపెట్టారు.

ఆదిలాబాదు తాలూకా బొచ్చెర, రాంపూర్ గ్రామ యువకులు గాంధీ జయంతి సందర్భంగా శ్రమదానంతో, రెండు ఊళ్ళ మధ్య ఒక మైలు పొడవు గల రోడ్డును స్వయంగా నిర్మించుకున్నారు.

పంచాయతీరాజ్ రజతోత్సవ కార్యక్రమం గిమ్మ గ్రామ పంచాయతీలో రాష్ట్ర రెవిన్యూ శాఖా మాత్యులు శ్రీ పి. నరసారెడ్డి గారిచే ప్రారంభించ బడింది.

అంతర్జాతీయ మహిళా సంవత్సరాన్ని పురస్కరించుకొని ఈ నెల 4 వ తేదీ నుండి 6 వ తేదీ వరకు ప్రత్యేక కార్యక్రమాలను ఆదిలాబాదు పంచాయత్ సమితి నిర్వహించింది.

జిల్లా మొత్తంలో అవసరమైన 161 ఆర్. టి. సి. బస్సు కండక్టర్లు, డ్రైవర్లు ఉద్యోగానికి 1,854 మంది అభ్యర్థులు తమ దరఖాస్తులను పంపారు. దీన్నిబట్టి జిల్లాలో నిరుద్యోగ సమస్య ఎంత తీవ్రంగా ఉందో తెలుస్తున్నది. వచ్చిన దరఖాస్తులలో 34 మంది మహిళలు ఉండడం గమనించదగ్గ విషయం.

గ్రామాభివృద్ధి వారోత్సవాల సందర్భంగా ఆదిలాబాదు పంచాయతీ సమితిలోని ఉమ్డమ్ గ్రామంతో చుట్టుప్రక్కల ఐదు గ్రామాలకు చెందిన 114 మందికి యిళ్ళ స్థలాలను పంచిపెట్టారు.

చెన్నూరులో కొత్తగా తెరువబడిన జిల్లా కేంద్ర సహకార బ్యాంకు శాఖను జిల్లా కలెక్టర్ శ్రీ కె. సి. గుప్తా ప్రారంభోత్సవం చేశారు. బ్యాంక్ అధ్యక్షులు శ్రీ విఠల్‌రావు దేశ్‌పాండే ప్రారంభసభలో మాట్లాడుతూ చెన్నూర్‌లో బ్రాంచి తెరవడంతో జిల్లాలోని అన్ని తాలూకాల్లో సహకార బ్యాంకు శాఖలను తెరవడం పూర్తయిందని తెలియజేశారు.

ఆదిలాబాదు జిల్లా కేంద్ర సహకార బ్యాంకు రైతులకోసం కొత్తగా ఒక అక్షయ ఋణ పథకాన్ని ప్రవేశపెట్టింది. రైతులు తమ పంటలను అమ్మగా వచ్చిన మొత్తాన్ని సేవింగ్సు ఖాతాలో జమ చేయడంలో బ్యాంకు ద్వారా సరసమైన వడ్డీ లభించడమే గాక జమ చేసిన మొత్తాన్ని బట్టి వారికి ఋణాల మంజూరీ కూడా లభిస్తుందని బ్యాంకు అధికారి శ్రీ కృష్ణారెడ్డి నూతన పథకం గురించి వివరించారు.

—శ్రీ వసంతరావు దేశపాండే

## అనంతపురం జిల్లా లేఖ

అంతర్జాతీయ మహిళా సంవత్సర వేడుకల సందర్భంలో యిటీవల అనంతపురం పట్టణ ప్రభుత్వ ఆస్పత్రి ఆవరణలో రోగుల సహాయార్థం నిర్మించిన ధర్మశాలకు రూ. 20,000 విరాళమిచ్చినందున కీ. శే. మేడా పార్వతమ్మగారి పేరిట ధర్మశాలను స్థానిక పురపాలక శాఖా మాత్యులు ప్రారంభించడం, మహిళలకు ఒక ప్రత్యేక ఎల్లప్పుడు తినుబండారముల దుకాణమును, జిల్లా మార్కెటింగు సహకార సంస్థపరముగా శ్రీమతి సుధా చక్రవర్తిగారి ఆధ్వర్యాన మహిళా శిశు సంక్షేమ శాఖ మంత్రి శ్రీమతి యం. లక్ష్మీదేవి ప్రారంభోత్సవము చేయడం, ఆంధ్రబ్యాంకువారు 1 లక్ష 25వేల రూపాయల ఋణాన్ని కేశాపల్లి గ్రామంలో నివసించు 66 మంది హరిజన మహిళలకు పాడి పశువులు కొని జీవనము చేసుకోడానికి జిల్లా కలెక్టరు గారి ద్వారా ఋణ మంజూరు పత్రాలను పంపిణీ చేయడం, సిండికేటు బ్యాంకువారు, అల్పవర్గాలు, వెనుకబడిన వారి వృత్తుల అభివృద్ధికై 10,000 రూపాయల చెక్కులను మంత్రిగారి ద్వారా ఇప్పించి చేయించడం, త్వరలోనే అన్నపూర్ణా ఫలహార విక్రయశాలను మహిళా మండలిచే ఏర్పాటు చేయడానికి నిశ్చయించడం, ఈ వేడుకలకు ఎంతో రాణింపు చేసినది.

అనంతపురం, గుత్తి, గుంతకల్లు రైల్వే స్టేషన్లలో రైల్వే ఉద్యోగులకు ఆయా గ్రామ సహకార స్టోర్సు ద్వారా అవసరమైన అన్ని సరకులను తక్కువ ధరలకు విక్రయించు బ్రాంచీలను ప్రారంభించినట్లున్నూ ప్రభుత్వ మాచింగు గ్రాంటు ద్వారా జిల్లాలో 7 తాలూకాలలో సహకార సూపర్ మార్కెట్లు నియామకం జరిగినదని యింక 4 తాలూకాలలో త్వరలో సూపర్ మార్కెట్లు ప్రారంభిస్తారని జిల్లా కో ఆపరేటివ్ ఆఫీసరుగారు తెలియజేశారు.

కేంద్ర ప్రభుత్వం, షేరు ధనం క్రింద యిచ్చిన 2.10 లక్షల రూపాయల మొత్తంతో గుంతకల్లు సహకార సెంట్రలు స్టోర్సులో త్వరలో సేల్ఫ్ సర్వీస్ కౌంటరును సేల్సు మెన్ కాని, హెల్పర్ కాని లేకుండా, పెద్ద వస్తువులను కస్టమర్ స్వయంగా సెలెక్టు చేసుకొని కౌంటర్‌వద్ద బిల్ చేయించుకొని తీసుకొని పోయే నూతన పద్ధతిని ప్రవేశ పెట్టనున్నారు.

జిల్లాలో అల్పవర్గ కార్మికులకు మునుపు యిచ్చిన రిక్షాలు కాక ఈ నెలలో గుంతకల్లులో 15, తాడిపత్రిలో 15, హిందూపురంలో 15, అనంతపురంలో 25 సైకిలు రిక్షాలను, బ్యాటరీతో నడిచే సైకిలు రిక్షాలు 25 పంపిణీ చేయడమవుతుంది. ప్రభుత్వం మంజూరు చేసిన 10% శాతం గ్రాంటు మొత్తము 11,000 రూపాయలు యివ్వ బడినందున. గుంతకల్లు టాక్సీడ్రైవర్ల సహకార సంస్థద్వారా వెనుక బడిన నిరుద్యోగులకు 5 క్రొత్త కార్లును తెప్పించి మిగత మొత్తమును బ్యాంకు ద్వారా పూరించి యిచ్చు ఏర్పాట్లు పూర్తి అయినవి. యిదిగాక జిల్లాలో 75–76 సం॥లో వెనుకబడ్డ చాకలి, నాయీ బ్రాహ్మణ, తాండా సహకార సంస్థలకు ప్రభుత్వమిచ్చిన 28,790 రూపాయలను ఆయా వృత్తుల వారికి ఋణ రూపకముగా పంపిణీ చేయడమైనది.

అనంతపురం సహకార సెంట్రల్ స్టోర్సువారు వినిమయ దార్లకు కంట్రోలు సరుకులు కాక యితర అవసర వస్తువులను తమ సూపర్ మార్కెటుద్వారా తక్కువ ధరలతో ఎక్కువ ప్రజానీకానికి ఉపయోగపడునట్లు 74–75 సం॥రమున 18 లక్షల రూపాయలు విలువ గల సరుకులను, గ్రామీణ ప్రాంతాల సన్నకారు రైతులకు బీద జనులకు కంట్రోలు గుడ్డలను 9 లక్షల రూపాయల వరకు విక్రయం స్వల్ప లాభముతో చేసినారు. ఈ 4 మాసములకే 6 లక్షల రూపాయల వ్యాపారం సాగించారని తెలుస్తోంది.

పట్టణంలో వినియోగదార్లకు జిల్లా మార్కెటింగ్ సహకార సంస్థ కూడా అవసరమైన వస్తువులను, కంట్రోలు గుడ్డలను అమ్మి 74–75 సం.లో 21 లక్షలు వ్యాపారము చేయడమేగాక తమ బ్రాంచీలను ధర్మవరం, కల్యాణ దుర్గములలో ఏర్పాటుచేసి, అక్కడి ప్రజలకు చౌకగా వస్తువులను పంపిణీ చేయుచున్నారు. గత సంవత్సరము ప్రొక్యూరుమెంటును జిల్లాలోనే నిర్వహించి 50 మంది బీద కుటుంబీకులకు వారికి జీవనోపాధి కల్పించి 4,033 టన్నుల వరి ధాన్యమును 39 లక్షలకు కొని, సంఘపు మిల్లులోనే బియ్యము మర చేసి, 2,689 టన్నుల బియ్యమును స్టేటు కోఆపరేటివ్ ఫెడరేషనువారికి డెలివరీ యిచ్చారు. జిల్లాలో వెనుకబడ్డ బీద చేనేత కుటుంబాల సహాయార్థము, మగ్గములు, నూలు కొనడానికి రూ. 1,36 లక్షల ఋణాలకు డైరెక్టర్ ఆఫ్ హాండ్ లూమ్ అండ్ టెక్స్‌టైల్స్ వారికి సిఫారసు చేయడం జరిగింది.

శ్రీ యన్. రామారావు

(ఆకాశ వాణి ప్రాంతీయ వార్తా విభాగం సౌజన్యంతో)

---

# ఆకాంక్ష

## శ్రీ నండూరి వేంకట సత్య రామారావు

ప్రజాసంక్షేమమే ప్రయోజనంగా
అభ్యుదయ సాధనమే గమ్యంగా
పవిత్ర భగీరథీ మందగమనంలా
సాగిపోతూన్న ఈ పంచాయతీ రాజ్యంలో
బంగారుకలలు పండించుకోవాలని
రతనాల పంటలు పండించాలని
మా అందరి ఆశయం! మా అందరి ఆకాంక్ష!

సురుచిర దరహాసంతో విజ్ఞానజ్యోతి వెలిగించి
ప్రజాహృదయాలలో ప్రగతికాంతులు వెదజల్లి
అభివృద్ధి నిరోధక తిమిరాన్ని తొలగించే
నేటి పంచాయతీలు నాటి పంచాయతనాలు కావాలని
మా అందరి ఆశయం! మా అందరి ఆకాంక్ష!

నీరు, నేల, గాలి అందరవీ అన్నదే
సర్వవ్యాపక సత్యం అయితే
అవి అందరికీ అందేలా చెయ్యటమే
పంచాయతీల పరమలక్ష్యం కావాలని
మా అందరి ఆశయం! మా అందరి ఆకాంక్ష!

తనివితీర తినటానికి తిండిలేక
నిరాశా నిస్పృహలు అడుగడుగున దహించివేస్తూంటే
కరాళ కంకాళాలైన వ్యధాపీడిత హృదయాలకు
పుష్టి తుష్టి కలిగించే కల్పవృక్షాలు
ఈ పంచాయతీలు కావాలని
మా అందరి ఆశయం! మా అందరి ఆకాంక్ష!

# తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల్లో పంచాయతీరాజ్ రజతోత్సవాలు

శ్రీ సిద్దాని నాగభూషణం

అది నవంబరు ఒకటవ తేదీ. ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం. పశ్చిమ గోదావరి జిల్లా కేంద్రమైన ఏలూరు పట్టణం సర్వశోభలతో ప్రకాశించింది. పశ్చిమ గోదావరి జిల్లా పరిషత్తు కౌర్యాలయ భవన రంగులు పచ్చిమ్మే విద్యుద్దీపాలతో అలంకరించబడింది. ఒక పశ్చిమ గోదావరి జిల్లా ఏమిటి? తూర్పుగోదావరి జిల్లా ఏమిటి-యావదాంధ్రప్రదేశ్‌లో నూతనోత్తేజం తేజరిల్లింది.

పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు పట్టణానికే గాదు. గ్రామీణ ప్రాంతానికే కొత్త సొగసు వచ్చింది. ఎటు చూసినా ఉత్సాహం పరవళ్ళు త్రొక్కింది. కార్యక్రమాల పట్ల ఆసక్తి కనుపించింది. నవంబరు ఒకటవ తేదీన ఏలూరు జిల్లా పరిషత్తు కార్యలయ భవనం ఆవరణంలో, శ్రీ శంకరంబాడి సుందరాచారి రచించిన "మా తెలుగు తల్లి" పాట పాడి పాడిన పిర్వాత విద్యాశాఖా మాత్యులు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు పతాకావిష్కరణ చేయడంతో కార్యక్రమాలు ప్రారంభింపబడినాయి. నవంబరు ఒకటవ తేదీ నుంచి పందొమ్మిదవ తేదీవరకు అమలు జరిగిన పంచాయతీరాజ్య రజతోత్సవాలలో ప్రజలు, ప్రజాప్రతినిధులు పంచాయతీరాజ్య కార్యకర్తలు, పంచాయతీ సమితి అధ్యక్షులు ఉత్సాహంగా పాల్గొన్నారు. వాడ వాడలా పల్లె ప్రజలు ఉత్సాహంగా పాల్గొన్నారు. ఏ పల్లెలో చూచినా పచ్చని తోరణాలు, స్వాగత ద్వారాలు సాక్షాత్కరించాయి.

ఈ ఉత్సవాలు పురస్కరించుకొని ప్రభుత్వం పంచాయతీ లలో ఉన్న బలహీన వర్గాలకు అనేక సంక్షేమ కార్యక్రమాలు నిర్వహించింది. పశ్చిమ గోదావరి జిల్లాలో ఇళ్ళులేని నిరుపేదలకు, ప్రభుత్వ భూములు ఆక్రమించుకొని ఇళ్ళు వేసుకొన్న నిరుపేదలకు ఆ భూములను దత్తం చేస్తూ యంత్రాంగం పట్టాలు యిచ్చింది. ఈ విధంగా ఐదువేల మందికి పట్టాలు యివ్వటంతో పాటు ఈ ఉత్సవా సమయంలో 3000 మందికి నివేశన స్థలాల పట్టాలు అందచేయడ మయింది.

చింతలపూడిలో 50,000 రూపాయల ఖర్చుతో హరిజన హాస్టల్‌కు ప్రారంభోత్సవం కూడా చేయడం జరిగింది సన్నకారు రైతులకు ఉపయోగపడే కవులూరు, చీపురుగూడెం భూగర్భ జల వినియోగ సహకార సంఘానికి ప్రారంభోత్సవం జరిగింది. పోలవరంలో 3.20 లక్షల రూపాయల ఖర్చుతో అమలు జరిగే ఒక నీటి పారుదల పథకానికి ప్రారంభోత్సవం జరిగింది.

పెదపాడు గాంధీ వనం ఉత్పత్తి పథకం అమలు జరిగిన ప్రాంతంలో కొబ్బరిచెట్ల పెంపక క్షేత్రానికి ప్రారంభోత్సవం చేయటంతో పంచాయతీ ఉత్పత్తి కార్యక్రమాలకు శ్రీకారం చుట్టినట్లు అయింది. చినఎల్లం, పెదమల్లం గ్రామ పంచాయతీలు ఒక్కొక్కటి 400 కౌబ్బరిమొక్కలను నాటి ఆయా పంచాయతీలు ఆదయాభివృద్ధి వనరులు ఏర్పించుకొన్నాయి ఈ విధంగా జిల్లా పంచాయతీలు వేలకొలది కౌబ్బరిమొక్కలు నాటుకొన్నాయి. పశ్చిమ గోదావరి జిల్లాలో రజతోత్సవాల సందర్భంగా పంచాయతీలు ప్రారంభించిన ప్రత్యేక కార్యక్రమం ఇది. గూటాలలో మార్కెట్ భవనానికి ప్రారంభోత్సవం జరిగింది.

బలహీన వర్గాలకు పాడిగేదెలు, కుట్టుమిషన్లు పంపిణీ కూడా ఈ జిల్లాలో విస్తృత ప్రతి పదికపై జరిగింది. ఆకివీడులో హరిజనులకు 45,000 రూపాయల ఖర్చుతో, ఏలిమించిలి పాడులో 70,000 రూపాయల ఖర్చుతో, గుడిపూడిలో హరిజనులకు పాడిగేదెలను అందజేయటం జరిగింది.

రేలంగి, నెగ్గిపూడి, మొదలు గాగల గ్రామాల్లో ప్రాథమిక పాఠశాలలకు ప్రారంభోత్సవాలు జరిగాయి.

కవిటంగ్రామంలో ఎకరానికి ఒక బస్తా ధాన్యాన్ని విరాళంగా ప్రజలు అందజేశారు. ఆ విరాళంలో 40,009 రూపాయల ఖర్చుతో పంచాయతీ కార్యలయ భవనం నిర్మించబడింది. ఈ భవన నిర్మాణం కృషి పశ్చిమ గోదావరి జిల్లాలో విశేషంగా ఆకర్షించినది. వెంకటాపురం గ్రామంలో మహిళా మండలి భవనానికి ప్రజలు 20,000 రూపాయలు విరాళాలు అందజేశారు. ఇదేవిధంగా పంచాయతీ రాజ్య రజతోత్సవాల సందర్భంగా 120 అభివృద్ధ కార్యక్రమాలు అమలు జేయటానికి ఐదులక్షల రూపాయల విరాళాలు అందజేశారని పంచాయతీ రాజ్య శాఖా మాత్యులు శ్రీ ఎల్. లక్ష్మణదాసుగారు ఏలూరులో వెల్లడించారు. ఇదాసు ఒక్కటేచాలు, ప్రజలకు పంచాయతీ రాజ్యంపట్ల ఎంత ఆదరాభిమానాలున్నయో తెలియజెప్పటానికి.

పశ్చిమ గోదావరి జిల్లాలో యింకొక ప్రత్యేక కార్యక్రమం కూడా ప్రారంభించబడింది. అవిద్యపై మహిళలు సమరం ప్రకటించినట్లుగా సమితికి కనీసం రెండు మహిళా మండలులు చొప్పున వయోజన విద్యాకేంద్రాలను మహిళలకు ప్రత్యేకంగా ప్రారంభించుకొన్నాయి.

ఈ ఉత్సవాల సందర్భంగా విద్యా శాఖా మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు ఏలూరు, ఆకివీడు, తణుకు, పాలకొల్లు, నిడదవోలు, నర్సాపురం, తాడేపల్లిగూడెం, చింతలపూడి పట్టణాల్లో ప్రజలను ఉద్దేశాలను ప్రసంగించారు.

నవంబరు 19న తేదిన ఏలూరులో యువజన దినోత్సవం కూడా అతివైభవంగా జరిగింది. ఈ ఉత్సవాల్లో దుర్బలహీన వర్గాల్లో ఒక ఆశారేఖ కన్పించింది. పంచాయతీ రాజ్యం తనస్థితి గతులను బాగు చేసుకొనవచ్చుననే భావన ప్రతివారిలో కన్పించింది. మంత్రులు పర్యటించిన ప్రతిచోట హరిజనులు, వెనుకబడిన వర్గాల ప్రజలు తండోపతండాలుగా రావటం ఈ కార్యక్రమాల పట్ల బడుగువర్గాల ప్రజల్లో ఉత్సాహాన్ని రేకెత్తించడం అనటానికి యింతకంటే ఉదాహరణ ఏంకావాలి?

మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారితో పాటు పశ్చిమ గోదావరి జిల్లా ఇన్‌ఛార్జి ఛైర్మన్ శ్రీ తాడేపల్లి ముసలయ్య, ఛైర్మన్ శ్రీ అల్లూరిబాపినీడు, జిల్లా కలెక్టరు శ్రీ జి. కుమార స్వామిరెడ్డి, జిల్లా రెవెన్యూ ఆఫీసరు శ్రీ ఎస్. కె. పచేరిల్, జిల్లా పరిషత్తు కార్యదర్శి శ్రీ కళా వెంకటరావు, జిల్లా పంచాయతీ ఆఫీసరు శ్రీ ఎస్. సీతారామ రావు, జిల్లా పశుసంవర్ధక అధికారి శ్రీ వింజమూరి కమలాకరరావు, తదితర అధికారులు, అనధికారులు కూడా ఈ ఉత్సవాల్లో పాల్గొన్నారు.

## తూర్పు గోదావరి జిల్లాలో

తూర్పు గోదావరిజిల్లాలో కూడా ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవం, పంచాయతీ రాజ్య రజతోత్సవాలు, నెహ్రూజీ జన్మ దినోత్సవాలు, ప్రియతమ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి జన్మ దినోత్సవం అతివైభవంగా జరుపబడినవి.

బలహీన వర్గాల సంక్షేమానికి తూర్పుగోదావరి జిల్లా కూడా ఎక్కువగా ప్రాముఖ్యం ఇచ్చింది. చీకటి కోణాలుగా ఉన్న హరిజన వాడలు విద్యుద్దీపాల కాంతులతో వెలుగొందటానికి పంచాయతీ రాజ్య సంస్థలైన గ్రామ పంచాయతీలు చొరవతీసుకొన్నాయి. 72 గ్రామాల్లో హరిజన వాడలకు విద్యుద్దీపాలు ఏర్పాటుచేయాలని సంకల్పించబడింది. 61 గ్రామ పంచాయతీలు అప్పుడే హరిజన వాడల విద్యుదీకరణకు మూడు లక్షల రూపాయల మేరకు విరాళాలు చెల్లించాయి. షెడ్యూల్డ్ కులాల, జాతులకు చెందిన బాల బాలికలకు 9 హాస్టల్ భవనాల నిర్మాణానికి శంకుస్థాపనలు జరిగాయి.

తూర్పుగోదావరి జిల్లాలో ఉన్న నాలుగు గిరిజన సమితులైన అడ్డతీగల, రాజవొమ్మంగి, రంపచోడవరం, మారేడుమిల్లి సమితులలో గిరిజనుల అభివృద్ధి కార్యక్రమాలకు 44 లక్షల రూపాయల పథకాలను రూపొందించటం జరిగింది. అప్పుడే ఆ సమితులకు ఎనిమిది లక్షల 78 రూపాయలు నిధులను విడుదల చేయటం జరిగింది.

హరిజనులకు, గిరిజనులకు నివేశన స్థలాలను అందజేయటానికి ప్రత్యేక కార్యక్రమం చేపట్టడమయింది. వారికి రజతోత్సవాల సందర్భంగా ఇరవై వేల నివేశన స్థలాలపట్టాలు అందజేయటం జరిగింది. ఈ సంవత్సరాంతంలోగా ఇంకా అదనంగా 20 వేల మందికి యిళ్ళ పట్టాలివ్వాలని సంకల్పం. ఏడువేల మంది బలహీన వర్గాల ప్రజలకు బంజరు భూములను కూడా ఇవ్వడమయింది. ప్రతివారికి అయిదు ఎకరాల మెట్టభూమిని గాని రెండు ఎకరాల మాగాణిభూమిని గాని యివ్వడమయింది. దీనిని సేద్యంలోకి తీసుకొని రావటానికి వారికి ప్రభుత్వం అన్నివిధాల సహకరిస్తుంది. 15 శాతం నిధుల నుంచి హరిజన వాడలలో రహదారులు, పాఠశాల భవనాలు నిర్మించడానికి దోభీఖానాల ఏర్పాటుకు, నూతుల త్రవ్వకానికి ఏడు లక్షల రూపాయలు నిధులు సమకూర్చటం జరిగింది.

పంచాయతీ రాజ్య రజతోత్సవాలు సందర్భంగా తూర్పు గోదావరి జిల్లాలో మహిళా సంస్థలకు ఆర్థిక సహాయం చేయడం జరుగుతున్నది. జిల్లా పరిషత్తు మిగులు నిధుల నుంచి మహిళా మండలుల భవనాల నిర్మాణానికి, బాలవాడీ కేంద్రాలలో పరికరాలు సరఫరా చేయటానికి కాకినాడలో మహిళా సంక్షేమ కేంద్రంలో హాలు నిర్మాణానికి రెండు లక్షల 94 వేల రూపాయల నిధులు కేటాయించబడినాయి. దోభీఖానాల నిర్మాణానికి 18,000 రూపాయలు నిధులను కేటాయించడం కూడా జరిగింది. జిల్లా పరిషత్తు ఆధీనంలో ఉన్న ఉన్నత పాఠశాలలకు శాశ్వత భవనాలు ఏర్పాటు చేయటానికి పూనుకొనటం జిల్లాలో ఒక ప్రత్యేకత. 14 జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలల భవనాల నిర్మాణానికి ఆరు లక్షల మూడువేల రూపాయలు నిధులు యివ్వడం జరిగింది. ఈ నిధులనుంచి 90 శాతం వరకు గ్రాంటుగా లభిస్తే ప్రజలు పదిశాతం ఆ భవనాల నిర్మాణానికి విరాళం ఇవ్వవలసి ఉంది. ప్రాథమిక పాఠశాలల భవనాల నిర్మాణాలకు 18 లక్షల 49 వేల రూపాయలు కూడా జిల్లా పరిషత్తు ఆయా సమితులకు కేటాయించింది.

బలహీన వర్గాలకు చెందిన వారికి స్వీయ ఉపాధికల్పనకు 26 లక్షల 50 వేల రూపాయలు మంజూరు చేయడం జరిగింది.

పేద ప్రజలను ఈ రజతోత్సవాల సందర్భంగా ఏదో విధంగా ఆదుకొనాలనే ధ్యేయంతో కార్యక్రమాలు అమలు జరుపబడినాయి. బలహీన వర్గాల ప్రజలు పాడిపశువులు, చేపల పెంపకం, కిళ్ళీదుకాణాలు, పాదరక్షల తయారీ, పందుల పెంపకం లాంటి వృత్తులను చేపట్టి జీవనోపాధి పొందేలా చేయటానికి వాణిజ్య బ్యాంకుల ద్వారా ఇరవై లక్షల తొంభైమూడు వేల రూపాయలు ఋణాలుగా యివ్వటానికి నిధులు విడుదలచేయటం జరిగింది. వెనుక బడిన తరగతుల వారుకూడా వివిధ వృత్తులను చేపట్టడానికి ఆర్థికసహాయం అందజేయబడింది. వాటి నిమిత్తం మూడు లక్షల ఏడు వేల రూపాయలు ఈ రజతోత్సవాల సందర్భంగా విడుదల చేయబడింది.

వినియోగ దారుల కోసం సామర్లకోటలో, "శ్యామల" అనే సూపర్ బజార్‌కు సహకార శాఖామాత్యులు శ్రీ బత్తిన సుబ్బారావు గారు ప్రారంభోత్సవం చేశారు. రామచంద్రపురంలో కూడా సూపర్ బజారుకు ప్రారంభోత్సవం జరిగింది.

పిఠాపురం సమితికి చెందిన ఎ. మల్లవరం గ్రామంలో 1972 సంవత్సరం నుంచి నిధుల కొరత కారణంగా ఆగిపోయిన పరిరక్షిత మంచినీటి పథకం పూర్తి చేయటమయింది. దీనికి కూడా మంత్రి శ్రీ బత్తిన సుబ్బారావుగారు ప్రారంభోత్సవం చేశారు. ఆ గ్రామం లోనే 20,000 రూపాయలు విలువగల భవనాన్ని కట్టించి శ్రీ కడింశెట్టి పద్మనాభంగారు పంచాయితీకి యివ్వటం చెప్పుకో తగిన విశేషం.

శ్రీ బత్తిన సుబ్బారావుగారు ప్రతి పంచాయతీ సమితిని సందర్శించి సమితి సభ్యులనుద్దేశించి ప్రసంగించారు. శ్రీమతి ఇందిరాగాంధీ ప్రతిపాదించిన 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమాన్ని గ్రామపంచాయతీల గ్రామసభ్యులు తీర్మానాల ద్వారా సమర్థించడం కూడా ప్రభుత్వ కార్యక్రమాల పట్ల పంచాయతీ రాజ్య సంస్థలు ఏవిధంగా ఉత్సాహం చూపుతున్నాయో చెప్పేందుకు ఇంతకంటే ప్రబల నిదర్శనం ఏంకావాలి? ప్రధాని ఇందిరా గాంధీ జన్మదినోత్సవం నాడు కాకినాడ జిల్లాపరిషత్తు హాలులో శ్రీమతి ఇందిరా గాంధీ చిత్రపటాన్ని ఆవిష్కరించటం జరిగింది.

ఇంకా మహిళలకు కుట్టుమిషన్లలకు కపిలేశ్వరపురం, తుని, పిఠాపురం, ఏలేశ్వరం గ్రామాల్లో పంపిణీ చేయటం జరిగింది.

రాజానగరం, రంగంపేట, పిఠాపురం, తుని, శంఖవరం పంచాయతీ సమితులు తూర్పు గోదావరి జిల్లాలో వెనుకబడినవి. ఈ సమితుల్లో 50 వేల మంది సన్నకారు రైతులకు వ్యవసాయ రంగంలో సహాయపడటానికి ముందుకు వచ్చాయి పంచాయతీ రాజ్య సంస్థలు. ఈ రజతోత్సవాల సందర్భంగా నాలుగు లక్షల అయిదు వేల రూపాయల పథకం అమలు జరిపారు.

ఎల్లవరం తాలూకాలో బూర్నగూడెంలో మంత్రి శ్రీ బత్తిన సుబ్బారావు పేద్దపు నీటిపథకానికి శంఖుస్థాపన చేశారు.

ఈ విధంగా జిల్లా మొత్తంమీద పంచాయతీ రాజ్య రజతోత్సవాలు ఉత్సాహంగా జరిగాయి. జిల్లా మొత్తంమీద ఒకకోటి 71 లక్షల రూపాయల విలువజేసే వివిధ పథకాలు చేపట్టబడినాయి.

ఈ ఉత్సవం సందర్భంగా సహకార శాఖా మాత్యులు శ్రీ బత్తిన సుబ్బారావుగారితో పాటు జిల్లా పరిషత్తు ఛైర్మన్ శ్రీ ఎస్. బి. పి. కె. సత్యనారాయణరావు, పార్లమెంటు సభ్యులు శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు, శ్రీ ఎమ్. ఎస్. సంజీవరావు, జిల్లాలోని శాసన సభ్యులు, సమితి అధ్యక్షులు, జిల్లాలో ప్రముఖులు శ్రీ రేమెళ్ళ తిరుమలరావు, మాజీమంత్రి శ్రీ తోట రామస్వామి మొదలగు అనధికార ప్రముఖులు, జిల్లా కలెక్టర్ శ్రీ వి. గోవిందరాజన్, జిల్లా రెవెన్యూ ఆఫీసరు శ్రీ ఎమ్. వి. ఎస్. ప్రసాద్, జిల్లా పంచాయతీ ఆఫీసరు జి. బి. ఆర్. ఫ్రాంక్లిన్, పరిషత్తు కార్యదర్శి శ్రీ బిక్కిన పాపారావు, జిల్లా పరిషత్తు ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ శ్రీ సీతారామస్వామి గార్లు ఉత్సవాల్లో పాల్గొన్నారు.



# నిరాశలో నిండు గుండె

— సి. ఆనందారామం

## 6

చమ్కీలు కుట్టిన నైలాన్ చీర మాసి పోకుండా పైకి తీసుకుని కింద కూచుని పేలు చూపించు కుంటోంది రాధమ్మ...చెవులకు పెద్ద పెద్ద ఎఱ్ఱరాళ్ళ దుద్దులు — ముక్కుకు రవ్వ బేసరి, మెడలో నాలుగు వరుసల చంద్రహారం. పలక సరులు, ఆ పైన జిగినీ గొలుసు — కాళ్ళకు మువ్వల పట్టాలు, ఆ పైన వెండి కడియాలు-నడుముకు వడ్డాణం - ఆ వడ్డాణం కింద వేలాడే మువ్వలు, మధ్యగా రాళ్ళు పొదిగిన రెండు నాగుపాములు — —

రాధమ్మ పచ్చని పసిమి - పెద్ద కళ్ళూ, చక్కని ముక్కూ - అందమైన వాళ్ళలో లెక్క — — కానీ, ఆ అందంలో ఏదో పశుత్వం ఉంది, నవ్వినా మాట్లాడినా, మూర్ఖత్వమూ, ఒకదాని నొకటి తరుముకుంటూ కనిపిస్తాయి. పేలు చూస్తోన్న రత్తమ్మ లోకాభి రామాయణమంతా విని పిస్తోంది.

ఎవరు ఎవరితో లేచి పోయారో, — — ఎవరు ఎవరిని ఉంచుకున్నారో — — ఎవరు ఏయే కొత్తనగలు చేయించు కున్నారో వగైరా, వగైరా — —

ఎప్పుడూ చూసే దృశ్యమే అయినా ఆనాడు భరించలేక పోయింది ప్రసూన — — తల్లి అలంకరణ, ఆ సంస్కారము — — ఎప్పుడు చికాకునే కలిగించినా, ఏమీ అనలేక పోయేది. ఆరోజు రత్తమ్మ సీసాడు ఊరగాయ, డబ్బాడు పంచదార, రెండు పాత చీరెలు, పట్టుకుని వెళ్ళిపోయాక తల్లిని అడిగేసింది. "ఎందుకమ్మా ఈ అలగా వాళ్ళందరినీ చేరదీస్తావ్ ?" ప్రసూన ప్రశ్నకు కోపం తెచ్చుకుంది రాధమ్మ. "ఎవరేంటి అలగా వాళ్ళు ? రత్తమ్మ నాకు పింతల్లి తెలుసా "

రాధమ్మ ఎంత ప్రయత్నించినా యాసలేకుండా మాట్లాడలేదు'

"ఆ రత్తమ్మ నీకు పినతల్లా ? స్వయంగా నేనా ? "

"ఆః సొయనా !, నాతల్లికి తోడబుట్టినది. ఈ నాడు నాలుగు డబ్బులొచ్చినయ్యని అయినోల్లని కాదు పొమ్మనడం నాయమేనా ? నువ్వే సెప్పు — —"

ప్రసూనకు తల తిరుగుతోంది — — ఓపిక కూడదీసుకుని అడిగింది, — —

"అయితే మనింటికి వచ్చే ఆ అలగా — — అదే వాళ్ళంతా నీకు- మనకు బంధువులేనా ?"

"అందరూ అయినోళ్ళా ! ఒకప్పుడు మంచికీ చెడ్డకు ఒకరి కొకరికి అయినోల్లం కామా ! ఇప్పుడు మన రోజులు బాగుండయి-మనం పైకొచ్చినాం ! మనోళ్ళకి కూసింత ఇదిపితే ఏంపోద్ది ? ఏమో ! ఏటయిమ్‌లో ఏ అవుసరం వస్తదో ?"

"ఎక్కడుంటారు వీళ్ళంతా ? — — "

"కూలిపేటలోనే ఉంటారు...ఈ యిషయాలన్నీ పొంబిశివం గోరికి సెప్పబోకు ! ఆయనకి గిట్టదు ఈల్లంటే....నేనే పీనం ఒప్పక ......"

ప్రసూన మాట్లాడలేదు.

తన ఇంటి వాతావరణాన్ని మరోసారి తలచుకోవటానికి కూడా కంపరంతోచింది.

తల్లిని మించి పోయిన వాడు తండ్రి ... ఏ రోజూ తప్ప త్రాగి కాని ఇంటికి రాడు. పన్నెండు గంటలకి ముందు రాడు.... పగటి వేళయినా తనకానాడు ఆప్యాయంగా పలకరించడు. ముఖంలో మొరటు తనం—నవ్వులో మొరటు తనం — మాటలో మొరటు తనం — — ఒకసారి ఎందుకో తండ్రికి తన మీద కోపమొచ్చింది. చెయ్యెత్తాడు — ఎక్కడ్నించి వచ్చిందో, తల్లి భద్రకాళిలా విరుచుకు పడింది.

"దొంగ సచ్చినాడా ! దానిమీద చెయ్యేసినవంటే మక్కెలిరగదన్నిస్తా — — "

తండ్రి పిల్లిలా జారుకు పోయాడు — —

ఆనాటి తండ్రి కళ్ళలో క్రౌర్యమూ. తల్లి కసి — — ఆ మాటలూ — — ఆ సంఘటన — — చాలా రోజులవరకూ మరిచిపోలేక పోయింది ప్రసూన — —

ఛీ ! ఛీ ! అనుకునేది తనలో తానే — —

సాధ్యమయినంత వరకు తండ్రిని తప్పుకు తిరిగేది ప్రసూన హరి కూడా తనంతటతను ప్రసూనను పలకరించే వాడు కాదు-తండ్రీ

పోటుకోసి మధ్య ప్రేమాపరాగాలు "పంపి"ంచటానికి రాధమ్మ ఏ విధంగానూ ప్రయత్నించేది కాదు, సరికదా హరి ప్రసూన ఛాయలకు రాకుండా అడ్డుపడేది.

సాంబశివంగారు తన తండ్రి స్నేహితులనీ, ఆయన సహాయం వల్లనే తన కుటుంబం బాగు పడిందనీ ప్రసూనకు తెలుసు.

కాని సాంబశివంగారూ తన తండ్రి ఎలా స్నేహితులయ్యారు? ఎంత స్నేహితులయితే మాత్రం ఆయన తమ కుటుంబానికి ఇంత సహాయం ఎందుకు చేస్తున్నారు? ఈ ప్రశ్నలకు సమాధానాలు మాత్రం తనకు తెలియవు. తల్లినడిగింది.

"ఏమో! ఆల్లకీ, ఆల్లకీ, ఏలావ'దేవిలున్నాయో. నాకే టెలు?" అని విసుక్కుంది.

తండ్రిని అడగలేదు— అడిగేసాహసం లేదు—సాంబశివంగారి వ్యాపారం గురించి తనకేంతెలియదంటే మోహన్ నమ్మలేదు. 'కామన్ సెన్స్ ఉన్నవాళ్ళెవరు నమ్మరు' అన్నాడు పైగా.

ఒక్క సారి ఏదో సందర్భంలో సాంబశివాన్ని "ఎవరా వచ్చి నాయన? పేరు చెప్పనంటున్నాడు?" అని అడిగింది. సాంబశివం ముఖంచిట్లించుకుని "ఎవరి పరిధిలో వారుండటంమంచిది. అనవసరపువిషయాల్లో కలిగించుకోవద్దు—" అన్నాడు.

ప్రసూన అభిమానం గాయపడింది. ఆతరువాత ఎన్నడూ ఏ విషయంలోను కలిగించుకోలేదు— తెలుసుకోవాలన్నకుతూహలమూ కలగలేదు.

ఒక్క సారి కూలి పేట కెళ్ళి తల్లి బంధువులను—అదే—తన బంధువులను కలుసుకోవాలి—వాళ్ళ ద్వారా ఏమైనా విషయాలు తెలుస్తాయేమో!

ప్రసూన కూలి పేటకు వెళ్ళేసరికి అక్కడున్న ఒకే ఒక్క కొళాయి చుట్టూ చేరి ఆడవాళ్ళు గోలగా అరుచు కుంటున్నారు. ఒక నడివయసు మనిషి పన్నెండేళ్ళ చిన్న పిల్లని పట్టుకుని బాదుతోంది. చుట్టు పక్కలవాళ్ళు చోద్యంచుస్తున్నారే కాని కల్పించు కోవటం లేదు.

ప్రసూన కల్పించుకుంది.

"పాపం! ఆచిన్న పిల్ల నెందుకు కొడుతున్నావ్?"

ఒక పెద్దింటి మనిషి తమ మధ్యకు రావటం, తమ విషయల్లో కల్పించుకుని మాట్లాడటం అందరికీ చిత్రంగా తోచింది. ఒకక్షణం అందరు బొమ్మల్లా నిలబడి పోయారు. చిన్న పిల్లని కొడుతోన్న నడివయసు మనిషి కొట్టడం ఆపింది.

"చూడండి. నా నీల్లన్నీ చెయ్యేట్టింది."

ఆచిన్నపిల్ల ఏడుస్తు చెప్పింది.

"నాగమ్మ నల్లా కింద బిందె పెట్టివెళ్ళి పోయింది. నీళ్ళు బిందెనిండి కారిపోతున్నాయి. నాకు స్కూల్ టైమవుతోంది— ఆ బిందె పక్కన పెట్టి నా బిందె పట్టుకున్నాను."

చనువుతీసుకుంటున్నందుకుపట్ల కాకోలం ఆపిల్ల మాటలో యాస గాలేదు.

"ఓలమ్మో, మా నచ్చు! సవిటే స్తుందా! దాని రాత. అందుకే తెగనీలుగు. దాని నీలుగుడు ... ఇంకా ఆగలేవా! బిందె ముట్టుకుంటావు, మదపొస్తపుదానా!"

ఆచిన్న పిల్ల మాట్లాడ లేక ఏడుస్తోంది. ప్రసూనకంతా చిత్రంగా ఉంది.

"ఆ బిందె పక్కకు పెట్టినందుకు ఇంత రాద్ధాంతమా? ... నీకేం నష్టం?"

ఆ ప్రశ్నకి అక్కడున్న అందరు ఉలిక్కి పడారు—ప్రసూనను చిత్రంగా చూశారు. అచూపుల్లో నిరసన కూడా ఉంది.

"మాలది...నాబిందెట్టా ముట్టుకుంటాదండీ!" నాగమ్మ సంజాయిషీ అడుగుతున్నట్టే అడిగింది. "ఇంకా ఈ రోజుల్లోకూడా కులం పట్టింపులా?" "ఏంచాందోయ్! కావాలంటే ఆ మాలకూడు మీరు తినండి...కూటికి పేదలయితే కులానికి పేదోళ్ళం కాము..."

మూతి ముక్కు విరిచింది నాగమ్మ...వెనకనుండి పకాలున నవ్వు వినిపిస్తే వెనక్కి తిరిగింది ప్రసూన...

చిరంజీవి గట్టిగా నవ్వుతున్నాడు. "చిరంజీవి! నువ్వు ఇక్కడ..."

ఆశ్చర్యంగా అడిగింది ప్రసూన...

"ఇదే ప్రశ్న నేను మిమ్మల్ని అడగవచ్చు...ఆశ్చర్యపోయే హక్కు మీకంటె నాకే ఎక్కువ ఉంది...ఇక్కడివాళ్ళు ఎంత గొప్పవాళ్ళో చూడాలని వచ్చారా? తెలిసిందా? ఇంకా గొప్ప గొప్పవాళ్ళున్నారు. చూపించనా?"

"అందుకుకాదు—ఇక్కడ నా...నా బంధువులున్నారు. అందుకని..."

"మీ బంధువులా?..."

తెల్లబోయి చూశాడు చిరంజీవి. "నిజంగా ఆశ్చర్యపోతున్నాను" అన్నాడు నవ్వుతూ...

"రత్తమ్మ అని..."

ప్రసూన మాట పూర్తి చేసే లోపలే కొళాయిదగ్గిర వేడుక చూడటానికి వచ్చిన రత్తమ్మ ప్రసూనను గుర్తించింది.

"ఏటమ్మా! మవ్విద కెందుకొచ్చినారు?" అంది గాభరా పడిపోతూ...

నీకోసమే...?

"అయ్యో...అయ్యో...కాకితో కబురంపితే వచ్చి వాలక పోదునేటి? నువ్వే వచ్చినావు..."

"యెవరే అప్పా?" అంటూ మరో ఇద్దరు రత్తమ్మ పక్క చేరారు...

"రాదమ్మ కూతురు..." గర్వంగా చెప్పింది రత్తమ్మ...

"మన రాదమ్మకూతురే!"

ఒక నడివయసు మనిషి వింతగా అడిగింది...మిగిలిన వాళ్ళు ప్రసూనను కుతూహలంగా చూశారు...

తమ లోకానికి సంబంధించని మరోలోకంనుండి దిగివచ్చిన ఈ దేవత తమ మనిషే! తమలో ఒక వ్యక్తే...సంభవమేనా?

"నెత్తిన పిడకలెట్టుకుని ఇల్లిల్లూ తిరిగి అమ్మేది. అదృష్టం..."

ఈసుగా అంది మరొక మనిషి...

"రా అమ్మా" మనిల్లు సూద్దుగాని...నీలాంటోరు కూకునే ఇల్లుకాదు కాని..."

రత్తమ్మ ప్రసూన చెయ్యి పట్టుకుని తీసికెళ్ళింది...పూరి పాకలు ఉన్న తాటాకుల చాప దులిపి పరిచింది. ప్రసూన కూచుంది. ఎన్నో అడగాలనుకుని వచ్చింది...కానీ ఆ వాతావరణంలో గొంతు తడారిపోతున్నట్లు అనిపించింది...

"ఏటమ్మా? ఇట్టా వచ్చావ్?" నొచ్చుకుంటున్నట్టుగా అడిగింది రత్తమ్మ...

ప్రసూన తల వంచుకుని అడిగింది...

"మా అమ్మ...మీ మధ్యలో ఉన్న మనిషి అయితే... ఎలా..." ఆగిపోయింది ఎలా అడగాలి...

తెలియక...

"మీకు సరిగా తెల్వదమ్మా! ఏడనుండొచ్చిందో మీ అయ్య వచ్చిండు. పిల్లనియ్యమన్నాడు. అల్లిచ్చినం. ఆడు డబ్బున్నాడు కావాల! ఏటో మరి..."

"మానాన్నగారికి డబ్బుకాదు-సాంబశివంగారు సహాయం చేస్తున్నారు. ఆయినకీ మానాన్నగారికీ స్నేహంట..."

ఆశ్చర్యంగా వింది రత్తమ్మ.

"ఆడి జిమ్మడ, ఆడి కందరితోను సేయితాలే" తెల్లబోయిన ప్రసూనను చూసి సర్దుకొంటున్నట్లు "మీ అయ్య సంగతి కాదులే అమ్మా, ఆ సాంబయ్య సంగతి..." అంది.

"ఆయన మీకు తెలుసా?"

"ఆడివి తెలవని దెవరికి? మిద్దింటోళ్ళ రామనాధయ్య యెలచ్చన్లో నిలబడితే ఈడు ఎనకే తిరిగి ఆయిన్ని గెలిపించాడు. ఇద్దరి చక్రాలు తిరిగినయ్యి. కొండలెక్కి కూసున్నారు. పచ్చి పోరంబోకు సచ్చినోడు మీ అయ్యకీ ఆడికీ మద్దెనే వుందోమరి..."

కాసేపు కూచుని ప్రసూన లేచింది.

బిలబిలలాడు బోలెడు మంది పిల్లలు ప్రసూనను చుట్టుము ట్టారు. ఆచింకిరి తలలూ, చిరుగుబట్టలూ, జిడ్డుముఖాలూ చూడలేక పోయింది. ప్రసూనబ్యాగ్ తెరిచి వాళ్ళ చేతుల్లో డబ్బులు పెట్టబో యింది. వాళ్ళు ప్రసూన మీదకు ఎగబడ్డారు. ఆ సందట్లో ఎవరో వెనకనుండి ప్రసూనబ్యాగ్ లాక్కుని పారిపోయారు......

పిండిబొమ్మలా నిలబడ్డ ప్రసూననుచూచి నవ్వాడు చిరంజీవి...

"భయపడకండి మేడం! వీళ్ళింతే, పాపం. ఏమీతెలియదు... ముందు ఇక్కడనుంచి నడవండి......"

"నువ్వు......"

"పరవాలేదు నేను వీళ్ళలో వాణ్ణి! అయినా అదృష్టం బాగుండి బళ్ళోపడ్డాను. చదువు వంటబట్టింది. వీళ్ళకు నాకుఒక్కటే తేడా...వీళ్ళకు తెలియదు. తెలుసు కోవాలనికూడా లేదు...నాకుతెలు స్తోంది. ఇంకా ఇంకా తెలుసు కోవాలని పిస్తోంది...వీళ్ళలో అలా తెలుసుకోవాలనే కుతూహలం రగిలించే నాధుడులేడు...అందుకే వీళ్ళకు మోక్షంలేదు...మీరు నడవండి..."

"నువ్వు ఇక్కడే ఉంటున్నావా?"

"ఎక్కడికెళతాను? ఇక్కడ అందరూ నాకేదో విధంగా సాయపడ్డవారే; నేను ఏదోవిధంగా వీళ్ళకు సాయపడుతూనే ఉంటాను. మాలోమేంకాక బయటి వాళ్ళు మమ్మల్నెందుకు ఆదుకుంటారు?"

ఆ మాలపేటదాటి ప్రసూన టాక్సీలో కూచున్నాక చిరంజీవి చిరునవ్వుతో చెయ్యిఊపాడు...

తనుచూసిన దృశ్యాలు ప్రసూన మనసును వదలటంలేదు. తనుకూడా వాళ్ళమధ్య అలాగ బ్రతకవలసి వచ్చేది! ఈఊహ రాగానే భయంతో గడ్డకట్టుకు పోయింది...వాళ్ళకు, తనకు ఏమిటి తేడా? డబ్బేనా? కాదు...తన తల్లికి డబ్బుంది...కానీ తనతల్లికి రత్తమ్మకు పెద్ద తేడా లేదు...

చిరంజీవి మాటలు గుర్తొచ్చాయి

"నాకు తెలుస్తోంది......ఇంకా......ఇంకా తెలుసుకోవాలని పిస్తోంది......"...అవును. ఇదే తేడా...కేవలం డబ్బుకాదు.. చిరంజీవికి డబ్బులేదు...అయినా తనూ చిరంజీవీ ఒకటి!

(సశేషం)



యాంత్రిక శాఖ మంత్రి డా. సి. హెచ్. దేవానందరావు 21 మంది సభ్యులున్న రష్యన్ సాంస్కృతిక బృందం రవీంద్రభారతిలో యిచ్చిన ప్రదర్శనను ప్రారంభించారు. ఆరోగ్యశాఖామాత్యులు శ్రీ కె. రాజమల్లు కళాకారులకు మెమెంటోలను అందజేశారు.




నీటిపారుదల శాఖ మంత్రి శ్రీ వి. కృష్ణమూర్తినాయుడు ఆంధ్రప్రదేశ్ యింజనీర్లు నవంబరు 8 న రవీంద్రభారతిలో జరుపుకొన్న ఉత్సవాన్ని ప్రారంభించి, యీ సందర్భంగా ఒక సావనీర్‌ను విడుదల చేశారు. ప్రభుత్వ ప్రధానకార్యదర్శి శ్రీ యస్. భగవాన్‌దాస్, సినీనటుడు శ్రీ ఎ. నాగేశ్వరరావు ప్రభృతులు హాజరయ్యారు.

# నగరంలో



రష్యన్ కళాకారుల సాంస్కృతిక బృందం నవంబరు 3న రవీంద్రభారతిలో ఆకర్షణీయమైన ప్రదర్శన ఇస్తోన్న చిత్రం.



ప్రాంతీయ సైనిక దినోత్సవం సందర్భంగా సికిందరాబాదు పుర వీధుల్లో ఊరేగింపు జరిగింది.

## రాజధాని విశేషాలు

### గవర్నర్ హెచ్చరిక

గవర్నర్ శ్రీ ఓబుల రెడ్డి నవంబర్ 8వ తేదీన రొమ్ము వ్యాధులకు సంబంధించిన 30 వ జాతీయ మహాసభను ప్రారంభిస్తూ, మందులలో కల్తీ చేసేవారు మరణ శిక్షకు పాత్రులని, అలాంటివారికి అలాటి శిక్ష విధించాలని అన్నారు. కల్తీ మందుల విషయంగో జాగ్రత్త అవసరమని వైద్యులకు, ప్రజలకు హెచ్చరిక చేశారు. కల్తీ మందులను అమ్మేవారిని మనం ఏమనాలో తెలియదు. గవర్నర్ అన్నట్లు వారు మరణ శిక్షకు తప్ప మరొకదానికి పాత్రులుకారు.

### దీక్షితుల జయంతి

కర్నాటక సంగీతవిస్తరణకు మూలపురుషులైన వారిలోఒకరైన ముత్తుస్వామి దీక్షితులవారి ద్విశతజయంత్యుత్సవం నవంబర్ 2వ తేదీన సంగీత నాటక అకాడెమీ కళాభవన్‌లో ఏర్పాటు చేసినప్పుడు, పలువురు వక్తలు ముత్తుస్వామి దీక్షితులవారి కృతుల విషయమై పరిశోధనలు జరగాలని సూచించారు. ఈ ఉత్సవానికి అధ్యక్షత వహించిన సంగీత నాటక అకాడెమీ ఉపాధ్యక్షులు శ్రీ మామిడిపూడి ఆనందం తమ ప్రసంగంలో ముత్తుస్వామి దీక్షితుల కృతుల పరిశోధన విషయంలో అకాడెమీ తగినట్లు తోడ్పడగలదన్నారు. ముఖ్య అతిథిగావున్న జవహర్ లాల్ నెహ్రూ టెక్నలాజికల్ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ శ్రీ ఎం. వి. రాజగోపాల్ తన ప్రసంగంలో దీక్షితులవారు గొప్ప వాగ్గేయకారులని, ఆయన చిదంబరనాథ యోగితోపాటు కాశీకి వెళ్లినారని అప్పటినుంచి ఆయన జీవితం ఒక మలుపుతిరిగిందని, కాశీవాసం వల్ల హిందూస్తానీ సంగీతం ప్రభావం ఆయన రచనలపైపడి ఎంతో మేలే కలిగిందని అన్నారు. "ఆయన కృతులలో గొప్పదనం ఆలాపన. ఆయన 72 మేళరాగాలలోను కృతులురచించారు. ఆయన సకల శాస్త్ర విద్వాంసులు, సంస్కృత భాషా కోవిదులు కనుక సంస్కృత భాషలోనే మంత్రశాస్త్ర రహస్యాలు, ఇతర రహస్యాలు తెలిపే కృతులు రచించారు". అని శ్రీ రాజగోపాల్ అన్నారు. శ్రీ మంచాళ్ల జగన్నాధరావు ప్రసంగిస్తూ, దీక్షితులవారి రాగ ప్రస్తారం రసదృశమని, ప్రాచీన సంగీత సంప్రదాయ వైభవంతో ఆయన కృతులు శోభిస్తుంటాయని, అన్నారు. శ్రీ నూకల చిన సత్యనారాయణ "దీక్షితుల వారి శైలి మౌలికం, త్యాగరాజకృతులను త్యాగరాజులవారు నిర్ణయించిన రాగాలతో పాడడం సులభంగాని, దీక్షితులవారి కృతులు వారు నిర్ణయించిన రాగాలకు భిన్నరాగాలలో పాడడం సాధ్యంకాదు," అంటూ దీక్షితుల వారి కృతులను గానంచేశారు. ఉత్సవ ప్రారంభంలో సంగీత నాటక అకాడెమీ కార్యదర్శి శ్రీ కె.వి. సుబ్బారావు స్వాగతం చెప్పారు. ఉత్సవ సమాప్తిలో సంయుక్త కార్యదర్శి శ్రీ బి. కృష్ణంరాజు ధన్యవాదాలు చెప్పారు.



### శ్రీమతి శతపథి హితవు

ఒరిస్సా ముఖ్య మంత్రిణి శ్రీమతి నందినీ శతపథి నవంబరు 8వ తేదీన సరోజినీ నగరంలో విద్యార్థినుల మహాసభను ప్రారంభిస్తూ, మహిళలలో విద్యావ్యాప్తి జరుగకపోతే, దేశభవిష్యత్తు వుండదని అన్నారు. మహిళల్లో విద్యావ్యాప్తి నిమిత్తం తగిన పథకాలలో శ్రద్ధతో అమలు పరచకపోతే సంఘంలో మహిళల ప్రతిపత్తిని గురించి, పాత్రను గురించి చెప్పే కబుర్లు నిరర్థకమని ఆమె నొక్కి వక్కాణించారు. ఈ సందర్భంలో అనాడు మూడు గోష్ఠులు జరిగాయి. పలువురు విదుషీమణులు స్త్రీవిద్యను గురించిన వివిధాంశాలపై పరిశోధన వ్యాసాలు చదివారు.

### ఆంధ్ర ధాతు కథాసాగరం

స్వామి వివేకానంద విద్యాసమితి తెలుగుకళాశాల నవంబరు 6 వ తేదీన "ఆంధ్రధాతు కథా సాగరం" అనే నూతన భాషా పరిశోధన ప్రణాళికను ప్రారంభించారు. ప్రారంభోత్సవానికి న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామి అధ్యక్షత వహించారు. సాహిత్య అకాడెమీ అధ్యక్షుడు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ప్రారంభోత్సవం జరిపారు. ప్రారంభంలో కళాశాల ప్రిన్సిపాలు శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యం స్వాగతం చెప్పారు. శ్రీ అల్లాడి కుప్పుస్వామి తొలిసారిగా తెలుగులో మాట్లాడుతూ, "భారతీయులు ప్రతి విషయంలోను మూలంచూచే అలవాటు కలవారు. కనుక తెలుగు ధాతువుల మూలంకోసం ఈ విద్యాసమితి పూనుకోవడం ప్రశంసనీయం, గణితశాస్త్రంలాగే వ్యాకరణ శాస్త్రమంటేకూడా కొందరికి భయం; కొందరికి ఎగతాళి. కాని, వాటి అవసరం నిరంతరం వుండనే వుంటుంది. శ్రీ లక్ష్మీరంజనంగారు ఇలాటి పథకాలను నిర్వహించడంలో నిపుణులు గనుక, ఈ సాగరాన్ని ఈదగలరని నమ్మినాను" అన్నారు. డాక్టర్ గోపాలరెడ్డి తమప్రసంగంలో ప్రతి విషయానికి క్రియ ముఖ్యమయినట్టే, భాషకూ క్రియ ముఖ్యం కనుక దాని కథ మనకు తెలియడం అవసరం. నేడు మనకు వివిధ భాషల సంస్కరణ ఏర్పడింది, ఏర్పడుతున్నది. దానితోపాటు

భాషలో కొత్త పదబంధాలు, ప్రయోగాలు చేరుతున్నాయి. ప్రిసైడెడ్ అన్నట్లే అధ్యక్షించెను, జీప్ అన్నదానికి జీపించెను మొదలయిన క్రియా రూపాలు ప్రయోగిస్తే, అడ్డగించలేము. వాటిని గూడ పండితులు పరిశీలించాలి. పండితులు ప్రయోగాన్ని అనుసరించి పోవాలేగాని, అడ్డుకట్టు వేస్తే భాష ఆగదు" అన్నారు. ఆంధ్ర ప్రదేశ్‌లోని అన్ని ప్రాంతాల వ్యవహార క్రియారూపాలు దీనిలో చేరాలన్నారు. శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, ఈ విద్యా సమితి ఛైర్మన్ ఆచార్య లక్ష్మీరంజనం ఈ ప్రణాళిక ఉద్దేశాలు వివరించారు. ఈ ప్రణాళిక ఛైర్మన్, సమితి ఆంధ్రకళాశాల తెలుగు శాఖాధ్యక్షులు డాక్టర్ కె. రామశర్మ నివేదిక చదివిన మీదట సమితి ప్రాచ్య కళాశాల ఉపన్యాసకులు శ్రీ ఎన్. ఎల్. నరసింహం ఈ ధాతు కథాసాగరానికి తోడ్పడగల ఆకర గ్రంథాలను వివరించారు. ఈ ఆంధ్ర ధాతు కథాసాగరంలో కూర్పుస్థూలంగా ఇది : 1. ధాతువులు, శబ్ద పల్లవాలు, ధాతుజన్య పదజాలం—ఈ ప్రణాళికలోనికి వస్తుంది. ధాతు కుటుంబమంతా ఈ ప్రమేయమే. 2. ధాతువులు అన్నప్పుడు తత్సమ, తద్భవ, దేశ్య, అన్యదేశ్య ధాతువులూ గ్రహించబడతాయి. 3. తెలుగు ధాతువుల చర్చలో కన్నడ, తమిళ, మళయాళాది సజాతీయ భాషల రూపాలు, వాటి అర్థాలు తెలుపబడతాయి. 4. శైవ వైష్ణవాదిమతాల ప్రాబల్యంతో తెలుగులో ప్రవేశించిన ధాతు రూపార్థాలు వివరించబడుతాయి. 5. రాజకీయ సంబంధంతో తెలుగులో ప్రవేశించిన పర్షియన్, ఉర్దూ, ఆంగ్ల, రష్యన్ మొదలయిన ధాతు రూపార్థాలు వ్యాఖ్యానించబడుతాయి. 6. ప్రాచీన శాసనాల ధాతు రూపాలు. 7. ఆధునిక వ్యవహార భాషలోను, జానపద భాషా సాహిత్యాల్లోను ఉన్న ధాతువులు. శబ్దపల్లవాలు గ్రహించబడుతాయి. 8. ధాత్వర్థ పరిణామం, కృదంత రూప తదర్థ పరిణామం శబ్ద పల్లవార్థ పరిణామ విభేదాలు వివరించబడుతాయి. ఈ ఆంధ్ర ధాతుకథాసాగరానికి ఆంగ్ల పర్యాయం "ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ వర్బల్ రూట్స్"

## ఎన్. సి. సి. శ్రమదానం

నవంబరు 23 వ తేదీన ఎన్. సి. సి. 27 వ వార్షికోత్సవాలను పురస్కరించుకొని వేయిమంది ఎన్. సి. సి. సీనియర్ డివిజన్ కేడెట్లు హుసేన్‌సాగర్‌లో వికారంగా వ్యాపించిన నాచు మొక్కను తొలిగించారు. కేడెట్లు ఈ నాచును తీసి వేయడం వల్ల హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌కు ఐదు వేల రూపాయల ఆదా కలుగుతుందని కార్పొరేషన్ ప్రత్యేకాధికారి శ్రీ నరేంద్ర లూథర్ తెలిపారు. హుసేన్ సాగర్‌లో మహామారిలాగవ్యాపించిన ఈ నాచు మొక్కను గుర్రపుడెక్క మొక్క అంటారు. దీనిని తొలగించడానికి కార్పొరేషన్ ఎన్ని సార్లో ప్రయత్నించింది. ఒకసారి స్థానిక సైనిక దళం సహకారమూ పొందింది. కాని ఆ సైనిక దళం కూడా ఈ మొక్కను తొలగించలేక పోయింది. ఈ మొక్కను పూర్వపు గవర్నర్ జనరల్ వారన్‌హేస్టింగ్స్ భార్య 1867 లో కొలనుల అలంకరణార్థం భారత దేశానికి తెచ్చిందట. హైదరాబాద్‌కు ఇది 1900 లో వచ్చింది.

## ఆదిరాజు వీరభద్రరావు సంస్మరణ

ఆంధ్రజాతి అభ్యుత్థానానికి జీవితం అంకితం చేసిన మహాపురుషులలో ఒకరైన ఆదిరాజు వీరభద్రరావుగారి సంస్మరణార్థం నవంబరు 24 వ తేదీన ఆంధ్రసారస్వత పరిషత్తు ఆవరణలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ఏర్పాటు చేసిన సభలో పలువురు వీరభద్రరావుగారు భాషా సాహిత్య చరిత్ర లకు చేసిన సేవను కొనియాడినారు. అధ్యక్షత వహించిన డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి తమ తొలిపలుకులలో మహాపురుషుల సంస్మరణం ఉత్తమ కార్యనిర్వహణకు ఉత్తేజం కలిగిస్తుందన్నారు. అకాడెమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు స్వాగతం చెబుతూ తమకు వీరభద్రరావుకు గల అనుభవాన్ని వివరించారు. శ్రీ గడియారం రామకృష్ణశర్మ వీరభద్రరావు గారి జీవితం భాషాసేవలను వివరిస్తూ, తెలుగంటేనే భాషాదేశాభిమానమంటేనే ఎంతో ప్రతిఘటన వున్న నిజాంపరిపాలన కాలంలో వీరభద్రరావు గారు సర్కారు నౌకరీలో వుండి తెలుగుకు, జాతికి ఎలా సేవచేసిందీ ఎన్నికష్టాలు పడిందీ వివరించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులు డాక్టర్ బిరుదురాజు రామరాజు వీరభద్రరావుగారి రచనలు, పరిశోధన అన్న అంశముపై ప్రసంగిస్తూ, తెలంగాణా ప్రాచీన నగరాలను గురించి షితాబుఖానును గురించి వీరభద్రరావుగారు చేసిన అపూర్వ పరిశోధనను తెలిపారు. ఆయన లక్ష్మణరావుగారి వద్ద పనిచేసిన అనుభవంతో తెలంగాణా శాసన సంపుటాలను ప్రచురించారని, సంగ్రహాంధ్ర విజ్ఞానకోశానికి మౌలికమైన పెక్కు వ్యాసాలు వ్రాశారని తెలిపారు. అకాడెమీ సంయుక్త కార్యదర్శి శ్రీ బోయి భీమన్న కృతజ్ఞతా వందనంతో సంస్మరణ సభ సమాప్తమైంది.

## పాత ఇళ్లు కూల్చివేత

హైదరాబాద్ నగరంలోని పాతబస్తీలో దాదాపు మూడు నాలుగు శతాబ్దాలుగావున్న పాత ఇళ్లను పడగొట్టే కార్యక్రమాన్ని మునిసిపల్ కార్పొరషన్ చేపట్టింది. ఇటీవల భారీ వర్షాలు కారణంగా 500 ఇళ్లు కూల్చివేయబడ్డాయి. ఇప్పుడు మరొక వెయ్యి ఇళ్లు కూల్చివేయబడ్డాయి. ఈ పాత ఇళ్ళు వర్షాలకు కూలి పోతు పరిసరాలకు చాల నష్టంకలిగిస్తున్నాయి. ఈ ప్రాంతంలోని పాత భవనాలు మట్టితోను, కర్రతోను నిర్మించినట్టివి. కుతుబ్‌షాహీల కాలంనాటివి.

—శ్రీ తిరుమల రామచంద్ర

ప్రగతి పథంలో

# బుచ్చిరెడ్డిపాలెం పంచాయతీ

శ్రీ ఎం. రామమూర్తి

నెల్లూరుకు పడమటిగా పదునెనిమిది కిలో మీటర్లలో ఉంది బుచ్చిరెడ్డిపాలెం. ఈ గ్రామం సంపన్నతకు, వితరణకు గణుతికెక్కింది. డా॥ బెజవాడ గోపాలరెడ్డి, శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి ఇదితర ప్రముఖులు జన్మించారిచట. ఈ గ్రామస్థులు పలువురు గాంధీజీ పిలుపునందుకొని స్వాతంత్ర్యోద్యమ సమరంలో దుమికి కారాగార శిక్షలుకూడా అనుభవించారు. ఆంధ్రదేశ పర్యటనలో పూజ్య బాపూజీ యీ గ్రామంలో విడిదిచేయగా అశేష ప్రజ భక్తి పూర్వకంగా ఉద్యమ నిధికి ధన, కనక, వస్తువులను సమర్పించారు.

బుచ్చిరెడ్డిపాలెం పంచాయతీ 1904 సం॥ లో ఏర్పడింది. 1945 సం॥ లో నోటిఫైడ్ పంచాయతీగా మారింది. 1971 లెక్కల ప్రకారం యీ గ్రామ జనాభా 10094. ఈ గ్రామంలో పంచాయతీ సమితి కార్యాలయం కూడా గలదు. 70 యేండ్లు నిండిన యీ పంచాయతీ చరిత్రగతిలో మొదటి యాభై సంవత్సరాలు సాధారణంగా సాగిపోయాయి. జాతినేత నెహ్రూజీ వెల్గించిన సమాజ వికాస పథక జ్యోతి ప్రభావం, పంచాయతీరాజ్యవ్యవస్థ ప్రాబల్యం యీ పంచాయతీ పై ప్రసరించడంతో గతరెండు దశాబ్దాల కాలంలో ప్రశంసనీయమైన కృషి జరిగింది. ఆదర్శప్రాయమైన ప్రగతి సాధించబడింది. పంచాయతీ అధ్యక్షుడుగా శ్రీ మేనకూరు గోపాలకృష్ణారెడ్డి (నేటి జిల్లాపరిషత్తు ఛైర్మెన్) 1953–56, 1959–64 సం॥ లలో నిరుపమాన గ్రామాభ్యున్నతిని సాధించారు. 1972–73 సం॥ రానికి రాష్ట్ర స్థాయిలో ద్వితీయ ఉత్తమ పంచాయతీగా ఎన్నికై బహుమతి నందుకొన్నదీ పంచాయతీ.

## సుందరోద్యానం

30 వేలతో గ్రామం నడిబొడ్డున 160 సెంట్ల భూమిని సేకరించి పంచాయతీ భవనాన్ని 23 వేలు వెచ్చించి నిర్మించారు. పలు వృక్షజాతులతో, సుందరశిల్పాలతో, క్రీడాస్థలాలతో, లాన్సు (Lawns) ఫౌంటెన్సు (Fountains) తో రమణీయమైన పార్కును రూపకల్పన చేశారు. ఇది బెజవాడ గోపాలరెడ్డి పార్కుగా నేడు పిలవబడుచున్నది. కేరింతలుకొట్టే బాలబాలికలతో, హాయిగా విశ్రాంతి తీసుకుంటూ సామాజిక రేడియోను వినే వార్తలు–విశేషాలు వినే పెద్దలు, యువకులతో సాయం సమయాలలో యీ సుందరోద్యానం సందడి గొల్పుతూ ఉంటుంది. ఈ పార్కులో ఓపన్ యెయిర్ థియేటర్ కూడా నిర్మించారు. సభలు, సమావేశాలు, నాటకోత్సవాలతో తరచూ యీ స్థలం కిటకిటలాడుతూ ఉంటుంది.

## వ్యవసాయం, పశుపోషణ

నెల్లూరు జిల్లాకు కోవూరు తాలూకా ధాన్యాగారంవంటిది. అందు నా బుచ్చి యేరియా నాణ్యమైన మొలగొలుకుల ధాన్యానికి రాణికెక్కింది. పూర్వం రైస్ రీసెర్చి కేంద్రం బుచ్చిలోఉండేది. $BCP_1$, $BCP_2$ తదితర వరి వంగడాలను యీ కేంద్రంలో రూపొందించారు. కనిగిరి రిజర్వాయరు, ఫిల్టరు పాయింట్ల ద్వారా సమృద్ధిగా జలం లభ్యం కావడంతో రైతులు మూడు పైర్లుపండిస్తున్నారు. IR8, IR2, IET1991, తదితర అధిక దిగుబడు వంగడాలు సంకరజాతి సజ్జ, మొక్కజొన్నరకాలు కృష్ణ, H4, ప్రత్తి విశేష ప్రచారంలో ఉన్నాయి. ఎరువుల వాడకం, సస్యరక్షణచర్యలు, శాస్త్రీయవిజ్ఞానం యీ గ్రామకర్షకాళికి కొట్టిన పిండి. సన్నకారు రైతుల ఉపయోగార్థం గ్రామపంచాయతీ ఒక పవర్ స్ప్రేయరు, నాల్గుచేతిస్ప్రేయర్లు, కొన్నది. సమితి కార్యాలయం యీగ్రామంలో ఉండడంతో వ్యవసాయరంగంలో బహుముఖాభివృద్ధి జరుగుచున్నది. గ్రామంలో గల రెండు సహకార రూరల్ బ్యాంకులు, ఒక మార్కెటింగ్ సొసైటి, సిండికేట్, ఆంధ్ర బ్యాంకులు వ్యవసాయం, పాడి కుటీరపరిశ్రమల స్థాపనకు దోహదంచేస్తున్నాయి.

పశువైద్యం, కృత్రిమ పిండోత్పత్తి కార్యక్రమాలను స్థానిక పశువైద్యశాల నిర్వహిస్తున్నది. యీవైద్యశాల భవన నిర్మాణనికి శ్రీ మేనకూరు వీరరాఘవ రెడ్డి విరాళమిచ్చారు. పాడిపరిశ్రమ గ్రామంలో యిపుడిపుడే పుంజుకుంటున్నది. ముర్రాజాతి గేదలను రైతులు పెంచుతున్నారు. రోజు 150 లీటర్ల పాలు నెల్లూరులోని పాశ్చరైజేషన్ ప్లాంటుకు యిక్కడ నుండి చేరుతున్నాయి. పాల సేకరణ కేంద్రానికి భవనాన్ని పంచాయతీ నిర్మిస్తున్నది.

## రోడ్లు, కాజ్ వే నిర్మాణం

ఇరవై యేండ్ల క్రితం రోడ్ల పరిస్థితి అధ్వాన్నంగా ఉండేది. నాటికి నేటికి పొంతనే లేదు. కాల్వలు, గుంటలు, యిరుకుదారులతో నిండి యున్న గ్రామవీధులు క్రొత్తరూపు సంతరించుకున్నవి. శివాలయం మంగలివీధి, సబ్‌రిజిష్ట్రారు ఆఫీసు, గ్రామచావడి, కొత్త కాశీ పాలెం తదితర ప్రాంతాలలో రాకపోకలు ప్రాణాంతకంగా ఉండేవట! నేడిచట విశాలమయిన, నిరపాయమయిన వీధులు వెలిశాయి. సంయుక్త మద్రాసు రాష్ట్ర పాలనలో నెల్లూరినుండి బుచ్చికి సిమెంటురోడ్డు వేశారు. దరిమిలా గ్రామంలో కొన్ని రోడ్లు తారుపూయబడ్డాయి. నేడు గ్రామవీధులు 90 వంతులు

కంకర చేయబడినవి. గ్రామం మధ్యగా పారుతున్న మలిదేవి వాగుపై 1961 సం॥ లో వారధి నిర్మించి మొలలోతు నీళ్ళలో దిగి అవస్థలు పడుతూ వెన్నాలకై కాశీపాలెం వెళ్ళే ప్రజలను గట్టెక్కించారు.

## సంరక్షిత మంచినీటి పథకం

ఇరవై యేండ్ల క్రితం పబ్లిక్ మరియు ప్రైవేటు బావుల నుండి మంచినీరు తెచ్చుకునేవారట! వీధుల్లో బోర్స్ వేయించి 1953 సం॥ లో మొట్టమొదటగా పంచాయతీ పబ్లిక్ కుళాయిలను ఏర్పాటు చేసింది. పలువురు గృహస్తులనుండి విరాళాలు ప్రోగు చేసి వీధి వీధినా యీ కార్యక్రమాన్ని ఒక ఉద్యమంగా చేపట్టింది. యీనాడు 30 హాండ్ బోర్స్ పని చేస్తున్నవి. 1963 సం॥ లో ప్రెషర్ పథకం ప్రారంభించి క్రొత్త కాశీపాలెపు నీటి కరువును తీర్చింది. ప్రభుత్వం యీ పథకానికి 15 వేలు మంజూరు చేసింది. 1970–71 సం॥ లో సంరక్షిత మంచినీటి పథకం శాంక్షన్ అయింది. పంచాయతీరాజ్ శాఖ రూ. 1,60,000 లు గ్రాంటు యిచ్చింది. సర్పంచ్ శ్రీ దొడ్ల అన్నారెడ్డి యీ పథకాన్ని ప్రారంభించారు. తదనంతరం మరో 15 వేలు గ్రాంటు వచ్చింది. 20 వేల గాలన్ల శక్తిగల ఓవర్ హెడ్ టాంక్ నిర్మించబడింది. 46 పబ్లిక్ కుళాయిలు బిగించబడ్డాయి. 126 ఇండ్లకు కనెక్షన్ ఇవ్వబడింది. గ్రామస్తులనుండి రూ. 25,200 లు విరాళాన్ని ప్రోగుచేశారు.

1953 సం॥ లో గ్రామానికి కరెంటు వచ్చింది. నేడు 200 పైగా వీధి విద్యుత్ దీపాలు వెలుగుతున్నాయి. పంచాయతీ నెల నెల 1400 రూ. ల దాకా కరెంటుబిల్లు చెల్లిస్తున్నది. పార్కులో ఏర్పాటుచేసిన సైరన్ పాటక జనానికి నిత్యం మేలుకొలుపు పలుకుతూ ఉంటుంది.

## విద్యాలయాలు

గ్రామంలో సమితి మరియు ప్రైవేట్ యాజమాన్యం క్రింద పది ప్రాథమిక పాఠశాలలు పనిచేస్తున్నాయి. సుమారు 2,000 మంది బాల బాలికలు యీ పాఠశాలకు హాజరౌతున్నారు. అల్ప సంఖ్యాక వర్గీయులయిన ముస్లిమ్ బాలబాలికలకు ప్రత్యేకంగా రెండు ఉర్దూ భాషాబోధనా పాఠశాలలున్నాయి. బాల బాలికలకు వేర్వేరుగా రెండు ఉన్నత పాఠశాలలు గలవు. వీటిలో సుమారు వేయి మంది చదువుతున్నారు. 17000 రూ. లు విరాళం శ్రీమతి మెట్టా శంకరమ్మ యివ్వడంతో జిల్లా పరిషత్ బాలికల ఉన్నత పాఠశాలను ప్రారంభించింది. సమితి ప్రాథమిక పాఠశాలలు నాల్గింటికి స్వంత భవనాలున్నాయి. 1972 సం॥ లో పాత కాశీపాలెంలో నిర్మించిన పాఠశాల భవనానికి సమితి 20,000 రూ. లు, పంచాయతీ 1,600లు శ్రీమతి గ్రంధి ఆదెమ్మ 3,400 లు సమకూర్చగా సర్పంచ్ శ్రీ మేనకూరు బాలకృష్ణారెడ్డి స్థలాన్ని ఉచితంగా యిచ్చారు. బాలుర ఉన్నత పాఠశాలకు లక్షరూపాయల విరాళమిచ్చి మాజీ సమితి అధ్యక్షులు శ్రీ దొడ్ల లక్ష్మీనర్సారెడ్డి 1959 సం॥ లో ఉన్నత భవన రాజాన్ని నిర్మించి యిచ్చారు. గ్రామంలో నూటికి 44 మంది అక్షరాస్యులు. విద్యా పురోభివృద్ధికి గ్రామంలో జూనియర్ కళాశాలను వెంటనే ఏర్పాటు చేయవలసిన అగత్యం యెంతైనా ఉంది.

## గ్రంథాలయాలు, పఠనాలయాలు

సాహితీరంగంలో అనాదినుండి బుచ్చి ముందడుగు వేసింది. 'వర్ధమాన తరంగిణి', 'శారద' బుచ్చినుండి వెలువడిన తొలి పత్రికా కుసుమాలు. చాలా రోజులు స్వచ్ఛందంగా శ్రీ బెజవాడ శివకోటారెడ్డి గ్రామంలో ఒక పఠనాలయాన్ని నడిపేరు. 1964 లో పంచాయతీ ఆఫీసు ఆవరణలో 16 వేల విరాళంతో అత్తిపలి సుందర రామిరెడ్డి గ్రంథాలయం, పచ్చలపల్లి పేరారెడ్డి పఠనాలయాలకు భవనాలు నిర్మించారు. యీ సంస్థలు 1972 సం. లో జిల్లా గ్రంథాలయ సంస్థకు బదిలీ చేయబడినవి. కాశీపాలెంలో శ్రీ దుగ్గిశెట్టి ఉమా మహేశ్వరరావు 1,500 రూ. ల తో ఒక రీడింగ్ రూమ్ నిర్మించి యిచ్చారు.

## వైద్యం, ఆరోగ్యం, పారిశుధ్యం

గ్రామంలో ఒక లోకల్ ఫండ్ డిస్పెన్సరీ పనిచేస్తున్నది. ఈ డిస్పెన్సరీ నిర్వహణకు పంచాయతీ సమితి యేటా సుమారు 30 వేలు ఖర్చుచేస్తున్నా, నిధుల కొరతమూలంగా ప్రజల వైద్యావసరాలు సరిగా తీరడంలేదు. ఈ డిస్పెన్సరీని ప్రభుత్వ ఆసుపత్రిగా మార్చడం చాలా అవసరం. శ్రీమతి దొడ్ల రుక్మిణమ్మ అత్తిపల్లి సోదరులు తదితర దాతలు యిప్పటికే ప్రసూతి వగైరా వసతులకు అదనపు భవనాలు నిర్మించి యిచ్చారు. దీన్ని ప్రభుత్వ ఆసుపత్రిగా మార్చితే అవసరమయిన నిర్మాణాలు చేసేందుకు దాతలెందరో ముందుకు వస్తారు.

గ్రామంలో డ్రైనేజీ కాల్వల నిర్మాణం చాలవరకు జరిగింది తొమ్మిదిమంది స్వీపర్లు,ముగ్గురుతోటీలు, నల్గురు డ్రైన్‌క్లీనర్లు, ఒక సెప్‌ఫూల్‌క్లీనర్ పంచాయతీలో పనిచేస్తున్నారు. వీధుల్లో చెత్త కుండీలు అమర్చబడినవి. పంచాయతీ ట్రాక్టరుతో చెత్తను కంపోస్టు యార్డుకు చేరుస్తారు. 1973–74సం॥ కంపోస్టు వేలం వేయగా 3,444/లు లభించింది. 1962సం॥ కంపోస్టు తయారీలో బుచ్చి పంచాయతీ జిల్లాస్థాయి ఉత్తమ బహుమతి పొందింది. బేబాదారి పాలెంలో స్త్రీలకు ప్రత్యేకంగా అరు సీట్ల సెప్టిక్ టాంక్ పాయిఖానాను 5,464/రూ. లతో నిర్మించారు. పబ్లిక్ కుళాయి కూడా అమర్చారు. పబ్లిక్ బావులను యథావిధిగా క్లోరినేట్ చేస్తున్నారు.

## బలహీన వర్గాల సంక్షేమం

1940సం॥ లోనే శ్రీ జూగుంట. బోడెయ్య అను హరిజనుని పంచాయతీ అధ్యక్షునిగా ఎన్నుకొన్న ఘన కీర్తి బుచ్చిపంచాయతికి దక్కింది. బడుగువర్గాల సంక్షేమం పట్ల పంచాయతీ ప్రత్యేక శ్రద్ధవహిస్తున్నది. హరిజన వాడలో రూ 3,310లతో రేడియో రూము–పఠనాలయాన్ని నిర్మించింది. రూ 1,914లతో హరిజన వాడ స్త్రీలకు పాయిఖానా దొడ్డిని ఏర్పాటు చేసింది. హరిజన వాడలో డ్రైనేజి కాల్వలు కట్టించింది. 12వేలు ఖర్చుచేసి సంరక్షిత మంచినీటి పథకాన్ని హరిజనవాడకు విస్తరింపజేసి, 8 పబ్లిక్ కుళా

యిటను ఏర్పరిచింది. హరిజనవాడలో పాఠశాల ఉంది. విద్యుత్ కూడా విస్తరించ బడింది.

14 గిరిజన కుటుంబాలకు యిండ్లు నిర్మాణంలో ఉన్నవి. సాంఘిక సంక్షేమశాఖ, వ్యవసాయశాఖ బ్యాంకుల ద్వారా వ్యవసాయం, పాడిపశువులకు గ్రాంట్లు, ఋణాలు మంజూరైనవి. రిక్షా కార్మికులు, చేనేత పనివారికి, మంగలి పనివారికి సహకార సంఘాలు స్థాపించబడ్డాయి. ఋణాలు మంజూరైనాయి. గ్రామంలో గల ఐదు ప్రభుత్వహాస్టళ్లలో 1[illegible]6 బాలికలకు, 166 బాలురకు ఉచిత భోజన, వసతిసదుపాయాలు కల్పించబడుతున్నాయి.

## స్త్రీ, శిశు సంక్షేమం

శ్రీమతి దొడ్డ వెంకటశేషమ్మ అధ్యక్షతన గల బుచ్చి [illegible] మహిళామండలి పేరెన్నికగ్గ కృషి సల్పుతున్నది. 15వేలతో మహిళా మండలి స్వంత భవనం నిర్మించుకున్నది. ఇందులో ప్రభుత్వం 5 వేలు యివ్వగా మిగతా ధనాన్ని విరాళాలద్వారా సేకరించారు. సమితి గుడ్డల తయారీ కేంద్రం యీభవనంలో నడుస్తున్నది. గ్రామంలో బాల్వాడీ, శిశు విహార్‌లు గలవు. బలవర్ధకాహార పథకం(ANP) అమలు జరుగు చున్నది. గిరిజన పోషకాహారం పథకం (SNP) క్రింద 115 మంది గిరిజనులకు ప్రత్యేక పౌష్టికాహారంఅందు చున్నది.

140 మంది బడి పిల్లలకు CARE మధ్యాహ్న భోజనం సప్లయి చేయుటకు పంచాయతీ తన వాటా విరాళాన్ని చెల్లిస్తున్నది. బాల్వాడీ కేంద్రభవనానికి 40 రూ.లు నెల బాడుగ చెల్లిస్తున్నది.

## పౌర సంబంధాలు

విజయవాడ రేడియో కేంద్రంవారు గ్రామంలోని రైతుల, మహిళల, సర్పంచ్, సమితి అధ్యక్షుడు అధికార్ల అనుభవాలను రికార్డుచేసి ప్రసారం చేశారు. పౌర సంబంధ, మహిళాశాఖలు సంయుక్తంగా విజ్ఞాన విహారయాత్రలను నిర్వహించాయి. ఉగాది సమ్మేళనాలు, కవితా గోష్ఠులు, కవి సన్మానాలు జరిగేయి. సమితి కార్యాలయంలో సమాచార కేంద్రం ఏర్పాటు చేయబడింది. బుచ్చి యువజన సంఘం యేటా చెడు గుడు పోటీలు నిర్వహిస్తూ ఉంటుంది. కళాసమితి నాటకోత్సవమును భారీ యెత్తున జరుపుతూ ఉంటుంది. హిందూ–ముస్లిమ్ ఐక్యతకు ముస్లిమ్ పేటలో జరిగే గంధోత్సవ సంబరాలు ఒక చక్కని నిదర్శనం. మంత్రులు తదితర నాయకులు తరుచూ యీ గ్రామానికి వచ్చి సందేశాలు వినిపించి వెళ్తూ ఉంటారు. సమితి అధ్యక్షుడు శ్రీ మేనకూరు బాలకృష్ణా రెడ్డిగారి అండదండలతో పంచాయతీ ప్రజలకు సన్నిహితమై యెన్నో ప్రజోపయోగ కార్యాలను నిర్వహిస్తూ ఉన్నది.

ఇరవై యేళ్ల క్రితం పంచాయతీ ఆదాయ వ్యయాలు 40వేలకు పరిమితంగా ఉండేవి. పంచాయతీల బరువు బాధ్యత పెరగడంతో, పంచాయతీ వ్యవస్థ పరిపుష్టంకావడంతో పంచాయతీ ఆదాయం లక్ష 20వేలకు చేరింది. నేడు పన్నుల వసూలులో విలంబన లేదు. పంచాయతీ స్వంత ఆస్తులను ఏర్పరచు కొంటున్నది. 71–72స॥లో 20 వేలు ఖర్చు చేసి అంగళ్ల మార్కెట్లను నిర్మించింది.

గ్రామంలో బస్‌స్టాండ్ నిర్మాణం, తారు రోడ్లు వేయడం, సంరక్షిత మంచినీటి పథకాన్ని గ్రామమంతటికీ విస్తరింప జేయడం సామాజిక భవనాన్ని నిర్మించడం–తాము తలపెట్టిన కొన్ని పనులని సర్పంచ్ శ్రీ మేనకూరు రాధాకృష్ణారెడ్డి తెలియజేశారు. తమ పదవీకాలంలో ఉత్తమ పంచాయతీ బహుమతిని పొందడం సంతోష కారణమని, యీవిశిష్టతను సాధించడానికి అందరి సహాయ, సహకారాలేకారణమని కూడా అన్నారు

పలు ప్రభుత్వ కార్యాలయాలు, దాదాపు 350 మంది ఉద్యోగులు పనిచేస్తూ అన్ని హంగులతో అలరారుతున్న యీ గ్రామం సబ్ తాలూకా కేంద్రంగా ఏర్పడాలని గ్రామస్థులు వాంఛిస్తున్నారు.

---

"మన ఇరవై సూత్రాల ప్రణాళిక పూర్తిగా కొత్తదేమీ కాదు. కాని అది మళ్ళీ ఒకసారి ఒక ప్రాథమిక విషయాన్ని గురించి–అంటే ప్రజల్లో అతి నిరుపేదలైనవారిని గురించి, అతి కష్ట నష్టాలకు గురి అవుతున్నవారి గురించి–ప్రాధాన్యతను ప్రకటించింది."

ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ

---



# జిల్లా వార్తా చిత్రాలు

1. పంచాయతీరాజ్య రజతోత్సవాల సందర్భంగా నెల్లూరు జిల్లా గుండవోలు గ్రామ పంచాయతీ కార్యాలయ భవనానికి చిన్నతరహా నీటిపారుదల మంత్రి శ్రీ ఆనం వెంకటరెడ్డి ప్రారంభోత్సవం చేశారు.

2. శ్రీకాళహస్తి పంచాయతీ రజతోత్సవాల సందర్భంగానూ, యువజనోత్సవం సందర్భంగానూ యానాది కాలనీలో సాంఘిక సేవా కార్యక్రమం జరుపుతున్న బృందం.

3. కపిలేశ్వరపురం సమితిలో సహకార మంత్రి శ్రీ బత్తిన సుబ్బారావుగారు మహిళలకు కుట్టుమిషన్లు పంచి పెట్టారు.

4. పశ్చిమ గోదావరి జిల్లా మునమర్రు గ్రామంలో గ్రామ ప్రజలు శ్రమదానం చేస్తున్న దృశ్యం.

5. నల్గొండలో సాంఘిక సంక్షేమ శాఖామాత్యులు శ్రీ కొట్టం శ్రీరామమూర్తి గారు ప్రసంగిస్తున్న దృశ్యం. ఈ చిత్రంలో జిల్లా కలెక్టర్ శ్రీ. పి. విలియమ్స్‌ను చూడ వచ్చును.

6. పశ్చిమ గోదావరి జిల్లా కవిటంలో 40,000 రూపాయల ఖర్చుతో పూర్తిగా ప్రజల విరాళాలతో కట్టిన పంచాయతీ భవనానికి విద్యా శాఖామాత్యులు శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు నవంబరు 16 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

7. కపిలేశ్వర పురంలో ముగ్గుల పోటీలో పాల్గొన్న మహిళలు.

8. ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు పంచాయతీరాజ్య రజతోత్సవాలను ప్రారంభోత్సవం చేస్తున్న దృశ్యం.

9. ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరా గాంధీ ప్రతిపాదించిన ఇరవై సూత్రాల ఆర్థిక కార్యక్రమానికి మద్దతు ప్రకటిస్తూ నల్గొండలో జరిగిన బ్రహ్మాండమైన ఊరేగింపు దృశ్యం.









10. పశ్చిమ గోదావరి జిల్లా వెంకటాపురం గ్రామంలో భారీ ఎత్తున ప్రజావిరాళంతో నిర్మించిన మహిళామండలి భవనం.

11. పంచాయతీరాజ్య రజతోత్సవాల సందర్భంగా అనంతపురం సమితిలో సజ్జార వెన్నె గ్రామంలో రక్షిత మంచినీటి పథకానికి మునిసిపల్ వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ దళ్వా సుబ్బారాయుడు గారు ప్రారంభోత్సవం చేశారు.

12. ఆర్థిక, సమాచార శాఖ మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డిగారు నెల్లూరు టౌన్ హాలులో ప్రసంగిస్తున్న దృశ్యం.



# నవ చైతన్యంతో ముందడుగు వేస్తున్న

# భద్రాచలం తాలూకా

శ్రీ తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి

భద్రాచలము పావన గోదావరీ తీరమున ఆంధ్రప్రదేశ్‌లోని ఖమ్మం జిల్లాలో ఉన్నది. ఇది పూర్వము తూర్పు గోదావరి జిల్లాలో నుండెడిది. పరిపాలనా సౌలభ్యము కొరకు 1959 నవంబరు 30న ఖమ్మం జిల్లాలో కలిపిరి. ఈ గ్రామము మహా పుణ్యక్షేత్రములలో నొకటి. శ్రీ సీతారామచంద్రుల నిలయం.

ఈ గ్రామమునకు ఒకవైపు గోదావరి, ఒకవైపు శబరి, మరొకవైపు తాలిపేరు ప్రవహించుచున్నవి. దాదాపు ద్వీపకల్పమని చెప్పవచ్చును.

## రాయలనాటి కళా వైభవం

ఆనాడు భక్తురాలైన పోకల దమ్మక్క శ్రీరామచంద్రుని ఆరాధించెడిది. ఆమెకు నిత్యనూతన విగ్రహములు అడవిలో ఒక తాడి చెట్టు సమీపమున కనిపించెను. స్వామి స్వప్నమున కనబడి శ్రీ కంచర్ల గోపన్నను గూర్చి చెప్పెను. ఆమె గోపన్నను చూచి ఆలయ నిర్మాణావశ్యకతను వివరించెను. గోలకొండ ప్రభుత్వములో తహసిల్దారుగా నున్న శ్రీ గోపన్న ఆ స్థితిని గమనించి 1674లో ఆలయ నిర్మాణము చేసెను. ఆనాడు కట్టిన దేవళము భక్తుల పాలిటి పెన్నిధియై నిలచినది. కాని కాలక్రమేణా అది జీర్ణమైనది. జీర్ణస్థితిని గమనించి ఆంధ్ర ప్రభుత్వము పునరుద్ధరణ జేయ సంకల్పించినది. అప్పటి దేవాదాయ ధర్మాదాయ శాఖామాత్యులు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు 1[illegible]6 లో పునరుద్ధరణ సంఘము నేర్పరచి పునరుద్ధరణ కార్యక్రమమునకు నాంది పలికినారు. శిల్పులను దక్షిణ భారతము నుండి రప్పించి కళ్యాణ మంటపము నిర్మించిరి. ఇరుకుగానున్న గర్భగుడి వెడల్పు చేయించిరి. గణపతి స్థపతి శిల్పులు అపురూప శిల్పములను స్థంభములపై చెక్కిరి. అవి చూపరులకు ఆ నాటి కృష్ణదేవరాయ ఆస్థాన శిల్ప కళా వైభవమును జ్ఞప్తికి తెచ్చును. చిత్రకూట నిర్మాణము జరుగుచున్నది. పునర్నిర్మాణ కార్యక్రమమునకు సుమారు ఇరువది నాలుగు లక్షలు ఖర్చుపెట్టిరి. ఊరిలో రామదాసు ప్రతిష్ఠించిన కాశీవిశ్వనాథుని శివాలయము పునరుద్ధరణ చేసిరి.

గోదావరికి ముప్పది ఐదు కిలోమీటర్ల ఎగువన పర్ణశాలకలదు. అచట దండకారణ్యమున తిరుగాడుచూ శ్రీ రామచంద్రుడు సీతా సమేతముగా నివసించెనని పురాణములు చెప్పుచున్నవి. అచట నున్న రాముని ఆలయము 1969 ఏప్రియల్ 14 వ తేదిన భూకంపము వలన విధ్వస్తమైనది. ఆ ఆలయ పునర్నిర్మాణము నేడు ప్రభుత్వము చేపట్టి పూర్తి చేసినది. ఎటపాక వద్ద జటాయు మంటపము కట్టించిరి. పూర్వము యీ గ్రామములో ఎచ్చటను యాత్రికుల సౌకర్యముకై కేవలము మూడు సత్రములుండెడివి. అవి అంబ సత్రము, గూంటూరు సత్రము, ఖమ్మంమెట్టు సత్రము. అంబ సత్రమును కీ॥ శే॥ పండిత ఘంటి వెంకటరమణయ్య హరిదాసుగారు నిర్మించిరి. వారి తదనంతరము వరంగల్లులోని హనుమకొండ వాస్తవ్యులైన కీ॥ శే॥ తుంగతుర్తి నరసింహారావుగారు పోషకులైరి. శ్రీ నరసింహారావు గారు ఆ సత్ర పోషణకు భూములనిచ్చిరి. ఇది నిరతాన్నదాన సత్రము. ఇటీవల దీనిని గూడ పునరుద్ధరించి అన్నదానము సవ్యముగా జరుగునటుల ప్రభుత్వము శ్రద్ధవహించినది. ఆ సత్రమున పునరుద్ధరణ పిమ్మట త్యాగరాజ ఉత్సవములు ప్రతియేట జరుగుచున్నవి. ఈ సత్రము ఆధ్యాత్మిక చింతన కలిగిన భక్తులకు చాలా ఉపయోగపడుచున్నది. ఈ సత్ర మంటపమున అనేక సాహిత్య సాంస్కృతిక కార్యక్రమములు నిర్వహింపబడుట ముదావహము. ప్రభుత్వము వారు కొండపైన, కొండ మొగదల అనేక సత్రములను క్రొత్తగా యాత్రికుల సౌకర్యార్థము కట్టించిరి. ఇచట ముఖ్యముగా పేర్కొనదగినది రంగనాథస్వామి కొండపై కట్టిన రామదాసు ధ్యాన మందిరము. ఇందు రామదాసు కీర్తనల కనుగుణముగా చిత్రఫలకములను, త్యాగరాజు నిలువెత్తు చిత్రపటములను ఉంచిరి. దాదాపు వెయ్యి మంది భక్తులు కూర్చొని ధ్యానము చేసికొనుట కవకాశము గలదు. ఇది యాత్రికుల సేద మందిరముగా కూడ నుపయోగపడుచున్నది. ఇంకను ప్రభుత్వము వారు రెండు టూరిస్టు మందిరములు నిర్మించిరి. భద్రుని కొండ ప్రక్కనేవున్న రంగనాయకుల కొండపై మంచి నీటి ట్యాంకు పెట్టించి, పంపులద్వారా నీటి సప్లై ఏర్పాటు చేసిరి. దీనివలన పౌరులు, యాత్రికులు ఎండాకాలమున గోదావరికి యిసుకలో నడచి వెళ్ళి మంచినీరు తెచ్చుకొను యిబ్బంది లేకుండా పోయినది. ఇట్టి సంక్షేమ పథకములనెన్నటినో ప్రభుత్వము శ్రద్ధ వహించి పూర్తి చేసినది. స్థానిక ఆసుపత్రిని అభివృద్ధిపరచి సంచార చికిత్సాలయము ఏర్పాటుచేసి వైద్య సౌకర్యముల నెక్కువ జేసినది.

ఇది ద్వీప కల్పమై తూర్పు కనుమలలో దండకారణ్యములో రవాణా సౌకర్యములులేని కుగ్రామముగా నుండెడిది. భక్తులు శ్రీరామ దర్శనము చేసికొనుటకు రాజమండ్రినుండి లాంచి పైననో,

ఇటు రైలుపై కొత్తగూడెము వరకు వచ్చి, బస్సుపై ముప్పది రెండు కిలోమీటర్లు ప్రయాణించి బూర్గంపాడు వద్ద గౌతమి పడవపై దాటియో వచ్చెడివారు.

## వంతెన నిర్మాణం

గోదావరికి వరదలు వచ్చినపుడు యీ గ్రామము జలమయమై పోవును. ప్రజలు కొండపైకి తమ చరాస్తులతో చేరి గోదావరి తీసిన పిదప తమ నివాసములకు వచ్చెదరు. 1957 ఏప్రిల్ 10 వ తేదీన గోదావరిని యాత్రికులు జంట పడవలపై ఆవలి ఒడ్డుకు దాటుచుండగా పడవ మునక జరిగినది. జంట పడవలు రెండును మునిగి ఆలుచిప్పలవలె మూసుకొని పోయినవి. చాలా మంది యాత్రికులు మరణించిరి. ఆ హృదయ విదారక సంఘటన ప్రభుత్వమును కదిలించినది. అప్పటి ప్రభుత్వం భారత ప్రభుత్వముతో సంప్రదించి వంతెన నిర్మాణమునకు నిధులు కేటాయించెను. 1960 లో వంతెనకు శంకుస్థాపన జరిగినది. వంతెన నిర్మాణమునకు 70 లక్షలు ఖర్చైనవి. మాజీ రాష్ట్రపతియైన శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణయ్య యీ వంతెనను 1966 లో రాకపోకలకు తెరిచెను. నాటితో యాత్రికుల కష్టములు గట్టెక్కినవి. ఆనాటినుండి ప్రగతి పథంలో భద్రాచలము నడుస్తున్నదని చెప్పవచ్చును. ఇటీవల భద్రాచలం నుండి రాజమహేంద్రము వరకు రోడ్డు మంజూరైనది. ఇది తూర్పు కనుములగుండా పోవు ఘాటు రోడ్డు. శబరిపై బ్రిడ్జి నిర్మించిరి. రోడ్డు దాదాపు పూర్తి కావచ్చినది. భద్రాచలము నుండి కూనవరము వరకు ఉన్న చిన్నవాగులకు శాశ్వత వంతెనలకు కూడ ప్రభుత్వము 30 లక్షలు మంజూరు చేసినది. ఈ ఘాటు రోడ్డు నిర్మాణము వలన భద్రాచలం నుండి విశాఖ పట్టణమునకు సరాసరి రోడ్డు సౌకర్యము ఏర్పడి ఉత్తరాంధ్ర యాత్రికులకు యిబ్బందులు తొలగుటయేగాక హైదరాబాదు విశాఖ పట్టణముల మధ్య దూరము కొన్ని వందల కిలోమీటర్లు తగ్గి ప్రయాణ సౌలభ్యం లభించును. ఇది గిరిజన ప్రాంతములకు రోడ్డు సౌకర్యము కలుగజేసి ఆ ప్రాంత అభివృద్ధికి తోడ్పడును.

భద్రాచలమునకు భారత ప్రభుత్వము తంతి తపాలా సౌకర్యములు మెరుగు పరచిరి. కొన్ని లక్షల ఖర్చుతో స్వంతభవనములు నిర్మించిరి. టెలిఫోను సౌకర్యమును కలుగజేసిరి. ఇచ్చట ఒక రేడియో కేంద్రము భారత సమాచార శాఖచే నిర్వహింపబడుచున్నది. ఇందుండి ప్రతియేట జరుగు శ్రీరామనవమి ఉత్సవ కార్యక్రమములు ప్రసారమగుచున్నవి. ప్రభుత్వము వారు ఒక జూనియర్ కళాశాల ఏర్పాటు చేసిరి. ఇది గిరిజన ప్రాంతములో విద్యాభివృద్ధికి తోడ్పడుచున్నది. గిరిజన విద్యార్థి వసతి గృహము ఒకటి నిర్మించిరి. వడ్డీవ్యాపారుల నుండి రైతులను కాపాడుటకు బ్యాంకిని ఏర్పాటు చేసిరి.

భద్రాచలం నుండి అన్ని ప్రాంతములకు రాష్ట్ర రవాణా కార్పొరేషను వారిచే ఎక్స్‌ప్రెస్, డీలక్స్ బస్సులు నడుపబడుచున్నవి. ఒక బస్సు డిపో నిర్మాణముచేయు సంకల్పముతో స్థల సేకరణ జరిగినది. ఇది పూర్తి అగుటతో యాత్రికులకు యింకను రవాణా సౌకర్యములు యినుమడించును. భద్రాచలమునకు సరాసరి పోవు రైలు మార్గము వేయుటకు భారత రైల్వే శాఖ వారు సర్వే చేసిరి. గోదావరికి ఒక రైలు వంతెన నిర్మాణము ఆలోచనలో నున్నది. ఈ వంతెన ఆ వూరికి ఐదు కిలోమీటర్ల ఎగువన కల మోతెగడ్డ వద్ద నిర్మించుదద్దేశ్యము కలదు. గోదావరికి మధ్యలో నుండుటచే యీకొండ వంతెన నిర్మాణమునకు వుపయోగపడునని రైల్వే వారు భావించిరి. ఈ వంతెన పూర్తై భద్రాచలము నుండి బస్తరు అడవుల ద్వారా విశాఖ పట్టణమునకు రైలు మార్గమేర్పడినపుడు యాత్రికులకు పర్యాటకులకు సౌలభ్యము చేకూరును. రవాణా సౌకర్యములు లేని గిరిజన ప్రాంతము అన్ని విధముల అభివృద్ధి చెందును. అచ్చట ముడి సరుకుల వినియోగమునకు తోడ్పడును.

ఇక యీప్రాంత పారిశ్రామిక అభివృద్ధిని గూర్చి కొంత చెప్ప వలసియున్నది. దగ్గరగానున్న అడవులలో తునికి ఆకులు విరివిగా దొరకును. ఇవి బీడీ పరిశ్రమకు పనికి వచ్చును. ఈ పరిశ్రమ గిరిజనులకు ఉపాధి సౌకర్యము కల్పించుచున్నది. బీడీ ఫ్యాక్టరీ యిచ్చట నేర్పరచు అవకాశము గలదు. తర్వాత వెదురు కలప గూడ యిచ్చట నున్న అడవులలో ఎక్కువగా లభించును కాగితము తయారీకి యీ వెదురు ఉపయోగపడును. ప్రభుత్వము యిచ్చట ఒక కాగితపు కర్మాగారము నెలకొల్ప నిశ్చయించి స్థల పరిశీలన చేయుచున్నది.

ఈ డివిజన్‌లో 50 కోట్ల ఖర్చుతో నిర్మిస్తున్న 'లోయర్ సీలేరు ఎలక్ట్రిసిటీ ప్రాజెక్టు' పూర్తికాగానే విద్యుచ్ఛక్తి వ్యవసాయమునకు గ్రామీణ విద్యుదీకరణకు అందుబాటుకాగలదు. పారిశ్రామికాభివృద్ధికి యీప్రాజెక్టు దోహదకారి కాగలదు. భద్రాచలమునకు 16 కిలోమీటర్ల దిగువన గల త్రిపుర వెంటపీడు గ్రామమున భూగర్భములో బొగ్గు లభించునని భారత భూగర్భ గనుల శాఖ వారు కనుగొన్నారు. డ్రిలింగ్ చేశారు. ఇది ఫలించి పెద్ద యెత్తున బొగ్గుత్రవ్వకం జరిగిన యెడల యీ ప్రాంతం మరొక సింగరేణి కాగలదనుటలో అతిశయోక్తి లేదు.

ఇక వ్యవసాయ పరిస్థితి. భద్రాచలమునకు గోదావరి ఎగువన 15 కిలో మీటర దూరమున దుమ్ము గూడెం గ్రామము ఉన్నది. ఇచ్చట బ్రిటిష్ వారు నిర్మించిన అనకట్ట ఉన్నది దీని మూలమున కొంత భూమి సాగులోకి వచ్చుచున్నది. అయితే యీ ఆనకట్ట ఆశించినంతగా ఫలితమునీయ లేదు. కట్ట ఎత్తు తక్కువగుట కారణము కావచ్చును. కావున వ్యవసాయాభివృద్ధికి ప్రభుత్వము నీటి పారుదల పథకములనేకము చేపట్టి నిర్వహించుచున్నది. ఇటీవల కొన్ని లిఫ్ట్ ఇరిగేషను స్కీములు మంజూరు చేసినది. అయితే చిన్న చెఱువులు, వానలపై ఎక్కువగా ఆధారపడి ఉన్న యీప్రాంత వ్యవసాయాభివృద్ధికి యింకను చేయవలసినది చాలా కలదు. ఈ విషయమున ప్రభుత్వము శ్రద్ధచూపు చుండుట ముదావహము ఈ కృషిలో శబరి ప్రాజెక్టు మంజూరు తొలిమెట్టు కాగలదు. ఈ విధముగా భద్రాచల పట్టణము, తాలూకా ప్రగతి పథములో ఒక మలుపు తిరిగినదని చెప్ప వచ్చును.

ఐదవ పంచవర్ష ప్రణాళికాంతమునకు యీ తాలూకా సర్వతో ముఖాభివృద్ధి నొందునని ఆశింపవచ్చును.

# పాఠకుల లేఖలు

నవంబరు నెల ప్రత్యేకసంచిక అత్యంతాకర్షణీయంగా ఉన్నది. 'ప్రగతిపందెంలో పరుగు' ముఖ్యమంత్రి సందేశం అత్యుత్తమంగా ఉన్నది. 'చలన చిత్ర సీమలో ఉత్తమ ప్రమాణాలు' పిడతల రంగారెడ్డి గారి వ్యాసం అనుసరించే విధంగా ఉన్నది. 'మహావీరుని ఉత్సవ కార్యక్రమాలు' చిత్రాలు ఆనంద దాయకంగా ఉన్నాయి. 'నిరాశలో నిండుగుండె' సీరియల్ అత్యంతా సక్తిదాయకంగా ఉన్నది.

—మందలపు రోశయ్య,
బండ్లవారి పాలెం,
గుంటూరు (జిల్లా) 522112.



నవంబరు నెల రాష్ట్ర అవతరణోత్సవ ప్రత్యేక సంచిక "ఆంధ్రప్రదేశ్"—"ప్రగతి పుష్ప పరిమళాలు" ముఖచిత్రంతో వెలువడి మా హృదయాలను దోచుకుంది! ప్రచురించిన కవితలు చాలా ఆకర్షణీయంగా వున్నవి! "ప్రగతి పందెంలో పరుగు" ముఖ్యమంత్రిగారి సందేశం చాలాబాగుంది! "చలన చిత్ర సీమలో ఉత్తమ ప్రమాణాలు" వ్యాసం ఎంతో విజ్ఞానదాయకంగా వుంది! మహావీరుని ఉత్సవ కార్యక్రమాలను గూర్చి చక్కని విషయాలను తెల్పిన పి. యల్. భండారి గార్కి మా ధన్యవాదములు!......... చివరి కవరుపై గల "విజయేందిర" కవిత సంచికకే హైలెట్!...

అరువపల్లి లక్ష్మీరాజము,
"కామన్‌పూర్."

ఆర్యా:

వచ్చే "ఆంధ్రప్రదేశ్" సంచికలలో ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి జీవిత విశేషాలు ప్రచురించమని మనవి. తెలుగు భాష, సంస్కృతులను ప్రతిబింబించే వ్యాసాలు, తెలుగునాట అపూర్వ కృషిచేసి పేరొందిన సర్ ఆర్థర్ కాటన్ వంటి ప్రముఖుల గాథలు ప్రచురిస్తారని ఆశిస్తాను.

గోవిందరాజుల ముఖ్య ప్రాణరావు,
లక్ష్మీ పోలవరం.



నవంబరు "ఆంధ్రప్రదేశ్" అందింది. ముఖచిత్రం ముద్దులు మూటగట్టేటట్టుగానూ, ఆకర్షణీయంగానూ పాశ్చాత్య పత్రికలమీది ముఖచిత్రంలా, చూడముచ్చటగా ఉంది.

శీర్షికలన్నీ చాలాబావున్నాయి. నాకు నచ్చినవి చలన చిత్ర సీమలో ఉత్తమ ప్రమాణాలు, మహా వీరుడు, చేనేత రంగాన్ని... తెలుగు నాటక సాంఘికోద్యమాలు, శ్రీ మహావీరస్వామి, మోటుపల్లి ఓడరేవు, ప్రాచీనాంధ్ర కవయిత్రులు, తెలుగు సాహిత్య చరిత్ర, మహావీర ఉత్సవ కార్యక్రమాలు, ఆరోగ్యవరం శానిటోరియం; పద్యం, గద్యం, వచనపద్యం వగైరా; మహాభారతం, గ్రంథ సమీక్ష, వార్తాచిత్రాలు. కలం స్నేహితుల కొరకు శీర్షిక ప్రవేశపెడ్తే పత్రిక యింకా బావుంటుంది.

అప్పలయ్యభట్ల నాగరాజశర్మ,
పీలేరు –517214.



నమస్కారములు.

నవంబరు మాసపు "ఆంధ్రప్రదేశ్" రాష్ట్ర అవతరణోత్సవ ప్రత్యేక సంచికగా, మొదటి కవరు పేజీ ప్రగతి పుష్ప పరిమళాలతో, చక్కని వ్యాసాలతో వెలువరించినందులకు మీకు నా అభినందనలు. ముఖ్యంగా మన ప్రియతమ నాయకురాలు శ్రీమతి ఇందిరాగాంధీ పై వ్రాసిన గేయము "విజయేందిర" చాలా బాగున్నది. ఈ విధంగా జనాదరణ పొందిన "ఆంధ్రప్రదేశ్" త్వరలోనే యింకను ఎక్కువ జనాదరణ పొందగలదని ఆశిస్తూ

ఎం. బషీర్ అహమద్,
శ్రీ కాళహస్తి

## శ్రీకాకుళం జిల్లాలో

# పారిశ్రామిక అవకాశాలు

శ్రీకాకుళంజిల్లాలో ఎన్ని వనరులు ఉన్నా ఆ జిల్లా అనాదిగా పరిశ్రమలకు నోచుకోలేదు. అందువల్ల చరిత్ర గతిని పరిశీలిస్తే ఈ జిల్లాలో జరిగినన్ని వలసపోవడాలు ఇంకే జిల్లాలోను లేవు. 1951 సంవత్సరాంతానికి ముందు పూటకు కూలికూడా లేక పనిచేయ గలిగినయువకులు రిక్షాలు లాగుకొనేందుకు ఖరగ్‌పూరు, ఖుర్దా, పూరీ ప్రాంతాలకు కార్మిక ఉపాధులు కోసం వలసపోయేరు. వనరులున్నా వాడుకోలేని దుర్గతి యీ జిల్లా ప్రజలకు కలిగింది. నదీజలాలున్నా పారుదలవసతులు లేవు. రవాణాసౌకర్యాలు చాలినన్ని లేవు. ఇవి ఆనాడు అభివృద్ధికాలేదు. ప్రభుత్వం ఎంతగా ప్రోత్సాహం ఇస్తున్నా పెట్టుబడిదారులు పరిశ్రమలు నెలకొల్పడానికి ముందుకు రాలేదు.

### పెద్ద పరిశ్రమలు

జిల్లాలో పెద్దపరిశ్రమలు ఏవీ లేవు. గరివిడిలో ఫెర్రో-మాంగనీసు పరిశ్రమ ప్రైవేటు రంగంలో కొంచెం పెద్దది. మాంగనీసు ముడిసరుకు ఈ జిల్లాలో ఎక్కువ లభిస్తుంది. 1, 13, 816 టన్నులంటే చిన్నమాట కాదు. రాష్ట్రంలో అన్ని జిల్లాలకంటె ఎక్కువ. 90 శాతం ఉక్కు ఉత్పత్తికి ఇది ఉపకరిస్తుంది. అందుకే మాంగనీసు ముడిసరుకును శుద్ధిచేయడానికి గరివిడి పనిచేస్తున్నాది. రెండు కొలిములలో 46వేల టన్నులు శుద్ధి అవుతున్నాది. ఇందులో 3,600 టన్నులు ఎగుమతి చేయడంవల్ల రూ. 217 లక్షలు విదేశమారకద్రవ్యం లభిస్తున్నాది. 1969లో విదేశాలకిఎగుమతిచేసిన మాంగనీసు విలువ రూ 2కోట్లు. 1970లో 4కోట్లు మాంగనీసు ముడిసరుకు. ఈ జిల్లాలో మాంగనీసు ముడిసరుకు పుష్కలంగా లభించే చిన్నాపెద్దా గనులు 130 ఉన్నాయి. అయితే ఇందులో బెడ్డ ఎక్కువగా లభించదు. గుండ ఎక్కువ అయిపోతుంది. దీనికి ఖరీదు తక్కువ వస్తుంది. ఫ్యాక్టరీవారికి ఉన్న పరికరాలుచాలక ఈ ముడిసరుకును ఇంకా సవ్యంగా ఉపయోగించుకోలేకపోతున్నారు.

ఈ పరిశ్రమ 1958 లో ఉత్పత్తి ప్రారంభించింది. 15 వందల మంది పైగా ఇందులో ఉపాధి సౌకర్యం పొందుచున్నారు. ఒక కొలిమి ఉత్పత్తి శక్తి సంవత్సరానికి 65 వేల టన్నులు. ఈ పరిశ్రమకి మూల ధనం రూ. 684.20 లక్షలు.

ఈ జిల్లాలో మొట్టమొదట 1934 లో బొబ్బిలి రాజావారు శ్రీ రామ్ సుగర్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ పేరుతో పంచదార పరిశ్రమ నెలకొల్పారు. దాని మూలధనం రూ. 43.62 లక్షలు. ఇందులో 680 మందికి ఉపాధి లభించింది 850 టన్నుల పంచదార రోజుకి ఉత్పత్తి అవుతున్నది. తరువాత బొబ్బిలి రాజావారే సీతానగరంలోకూడా 1940 లో మరొక పంచదార మిల్లు రూ. 27.99 లక్షల మూలధనంతో స్థాపించారు. 608 మందికి పైగా దానిమీద జీవిస్తున్నారు. సహకార రంగంలో 1962 లో ఆముదాలవలసలో చక్కెర పరిశ్రమ రూ. 139.03 లక్షల మూలధనంతో ప్రారంభం అయింది. పెద్దపెట్టుబడితో ప్రారంభం అయినా బొబ్బిలి పంచదార ఫ్యాక్టరీకంటె సగానికి తక్కువగా జనానికే జీవనోపాధి ఉంది. కారణం ఆధునిక యంత్రాల ప్రభావమే. ఉత్పత్తి శక్తి మాత్రం రోజుకి 1200 టన్నులు. ఈ జిల్లాలో 1968-69 సంవత్సరంలో 31,030 టన్నులు. అంటే రాష్ట్రంలో 4 వ స్థానం అన్నమాట. ఇవికాక 19 ఖండసారి చక్కెర పరిశ్రమలు పనిచేస్తున్నాయి. వీటిమీద సుమారు వెయ్యిమంది బ్రతుకుతున్నారు.

దేవుడు మేలుచేస్తే మందసాలోకూడా చక్కెర ఫ్యాక్టరీ రావచ్చు. కేంద్రం సుముఖంగా ఉంది. ఇదికూడా సహకార రంగంలోనే పనిచేస్తుంది. దీని ఉత్పాదకశక్తికూడా 1200 టన్నులు. 400 మంది జీవిస్తారు. అయితే విదేశమారకద్రవ్యం లభించే పంచదార మిల్లు ఈ జిల్లాలో యింకొకటి నెలకొల్పాలని పెద్దలు ప్రయత్నిస్తున్నారు. దానికి పాలకొండ అనువైన ప్రాంతం అనడంలో సందేహం లేదు. ఇక్కడ చెఱకు ఎక్కువ పండుతుంది.

### జనపనార

ఈ జిల్లాలో గోగు బాగా పండుతున్నాది. శ్రీకాకుళం, సాలూరు ప్రాంతాలలో జనపనార మిల్లులు ఇంకా పెట్టడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇంత జనుము పంట ఉన్నా ఇప్పటికీ పరిశ్రమలు వృద్ధి కాలేదు. 125 మంది మాత్రం దీనిమీద బ్రతుకుతున్నారంటే ఈ వనరుని బాగా ఉపయోగించుకోలేకపోతున్నారన్నమాట. దీని ఫలితంగా కలకత్తాకు జూటు ఎగుమతిచేసి, నార వస్తువులు దిగుమతి చేసికొనవలసిన దుర్గతి మనకు పట్టింది. అనుకొన్న ప్రకారం ఈ జిల్లా సాలూరు, శ్రీకాకుళం ప్రాంతాలలో జూటు మిల్లులువస్తే 7000 మందికి ఉపాధి సౌకర్యం లభిస్తుంది.

శ్రీ ఆదిభట్ల వేంకటరమణ

అయితే ప్రస్తుతం బొబ్బిలిలో జూటు మిల్లు ఒకటి ప్రైవేటు రంగంలో పనిచేస్తున్నది. దాని పెట్టుబడి 16.30 లక్షలు. 1972 లో స్థాపింపబడిన దీనిలో 270 మంది పనిచేస్తున్నారు. 3600 టన్నుల జనుపనార గోనెలు, త్రాళ్ళు తయారవుతున్నాయి.

సాలూరులో గిరిజనుల సౌకర్యార్థం సహకార రంగంలో జూటు మిల్లు స్థాపించడానికి కేంద్రం అంగీకరించింది. "శ్రీకాకుళం జిల్లా గిరిజన జూటు ప్రొడక్ట్సు ఇండస్ట్రియల్ కో-ఆపరేటివ్ సొసైటీ" అనే పేరుతో రిజిస్ట్రేషనుకూడా అయింది. న్యూఢిల్లీలో జాతీయ సహకార అభివృద్ధి సంస్థవారు రాష్ట్ర గిరిజన కార్పొరేషన్ వారికి ఈ మిల్లు స్థాపనకు 15 లక్షలు షేర్ ధనంగా ఇచ్చారు. రాష్ట్ర ప్రభుత్వంకూడా ఈ పరిశ్రమస్థాపనకు 25 లక్షలు మూలధనంగా ఇస్తుంది. దీనివల్ల 2143 మందికి ఉపాధి లభిస్తుంది.

## టైపురైటర్ల ఫ్యాక్టరీ

బొబ్బిలిలో టైపురైటర్ల పరిశ్రమ నెలకొల్పడానికి కేంద్రం ఉద్దేశించింది. కేలిక్యులేటర్ల తయారీ కూడా ఈ పరిశ్రమ చేపడుతుంది. దీనికి మూలధనం 1.50 కోట్లు. ఈ పరిశ్రమ నెలకొంటే 400 మందికి ఉపాధి లభిస్తుంది. 750 మంది పరోక్షంగా జీవిస్తారు. 1974 లో ఈ పరిశ్రమ ఉత్పత్తిని ప్రారంభిస్తుందని, కాగలవని తెలియ వచ్చింది. సంవత్సరానికి 12000 స్టేండర్డు టైపురైటర్లు 600 పోర్టబుల్ టైపురైటర్లు, 6000 డస్కు-కేలిక్యులేటర్లు ఈ పరిశ్రమలో ఉత్పత్తి.

జనుపనార పరిశ్రమ జిల్లాలో నెల కొల్పబడ వచ్చు. జనుప నార గుజ్జుతో న్యూస్ ప్రింటు పేపరు తయారు చేయవచ్చు. తమిళ నాడు ప్రభుత్వం మిల్లులను అప్పుడే స్థాపించి ఉత్పత్తి చేయిస్తున్నాది. న్యూసుప్రింటు పరిశ్రమల మీద సుమారు 35 కోట్లు ఖర్చు చేయవలసి వుంటుంది. పెద్ద పరిశ్రమ కావడం వల్ల పెద్ద పెట్టుబడికి ఎవరూ ముందుకి రాలేదు రాష్ట్ర పారిశ్రామిక సంస్థయే ఆలోచన చేస్తున్నది.

చిన్నతరహా పేపరుమిల్లు పెట్టడానికి ఎవరో ముందుకు వస్తున్నారు. దీనిని మినీక్రెఫ్టు పేపరు ప్లాంటు అంటారు. ఉత్పాదక శక్తి 10 టన్నులు రోజుకి ఉంటుంది. దీని మూలధనం ఒక కోటి, దీనిమీద సులభంగా 5 వందల మంది బ్రతక వచ్చు. పరోక్షంగా మరొక 5 వందల మందికి జీవనోపాధి ఉంటుంది. వ్రాసికొనేందుకి, అచ్చుకి ఉపయోగించే కాగితం, పేపరు బోర్డుల తయారీకి సంవత్సరానికి 15 వందల మెట్రిక్ టన్నుల ఉత్పాదక శక్తిగల ప్లాంటు నెలకొల్పడానికి, 200 మెట్రిక్ టన్నుల ఉత్పాదక శక్తిగల మినీప్లాంటు నెలకొల్పడానికి కొందరు ముందుకు వచ్చేరు.

జిల్లాలో నౌపాద ప్రాంతంలో 5ఉప్పు పరిశ్రమలు ఉన్నాయి. సంవత్సరానికి 74వేల మెట్రిక్ టన్నుల ఉప్పు ఉత్పత్తి అవుతున్నాది. వీటికి అనుబంధంగా 40 సంస్థలుపని చేస్తున్నాయి. ఇవి చిన్నతరహా పరిశ్రమలు. ఇంకా కొన్ని వేల ఎకరాల నేలలో ఉప్పు ఉత్పత్తి చేయవచ్చు.

నౌపాదవద్ద భారీ ఉప్పుపరిశ్రమ నెలకొల్పడానికి ప్రతిపాదనలు ఉన్నాయి. కాకరాపలి వద్ద ఉప్పునీటి కయ్యాలు 3470 ఎకరాలు ఉన్నాయి. ఈ బృహత్పారిశ్రామిక పథకానికి మూలధనం 20 లక్షలు చాలు, ఈ పథకం అమలు జరుపుతే సంవత్సరానికి 75 వేల మెట్రిక్ టన్నుల ఉప్పు ఉత్పత్తి పెరగవచ్చు. దీనికి అనుబంధంగా సోడా ఏష్ ఫ్యాక్టరీ లేక కాస్టిక్ సోడా పరిశ్రమ పెంపొందుతుంది. దానివల్ల బలహీన వర్గాల ప్రజలకు ఎక్కువ ఉపాధి సౌకర్యం లభిస్తుంది.

తవుడు, చిట్టు మున్నగు పదార్థాలనుండి ద్రావణీయ తైలాలు తీసే పరిశ్రమ ఇది 47 లక్షల మూలధనంతో శ్రీకాకుళం వద్ద కుశాల పురం సమీపంలో ఈ పరిశ్రమ నెలకొల్పుతారు. దీనికి ఆర్థికాభివృద్ధి సంస్థ 27.80 లక్షలు సహాయం మంజూరు చేసింది. ఈ పరిశ్రమపై ప్రత్యేక్షంగా 56 గురు, పరోక్షంగా 200 మంది బ్రతక వచ్చు.

పెద్దవి మధ్య తరగతి పరిశ్రమలు ఇంకా నెలకొల్ప వచ్చు. మెరైన్ బేసిడు పరిశ్రమగా 7 లక్షల మూలధనంతో 5 వందల మందికి ఉపాధిగా సోడా ఏష్ పరిశ్రమ నౌపడావద్ద, మినరల్ బేసిడ్ పరిశ్రమగా వంద మంది ఉపాధికి పార్వతీపురం, సాలూరు ప్రాంతాలలో గ్రాఫైట్, మేగ్నసైట్ పరిశ్రమలు నెల కొల్పవచ్చు.

## చిన్నతరహా పరిశ్రమలు

పైవి కొన్ని పెద్ద పెట్టుబడులతో నెలకొల్పవలసిన పరిశ్రమలు, చిన్న పెట్టుబడులతో నెలకొల్ప వలసిన పరిశ్రమలు ఎన్నో ఉన్నాయి. అత్యవసర ప్రజోపయోగపరిశ్రమగా 12,475 లక్షల పెట్టుబడితో 367 మందికి ఉపాధిగా ఆముదాల వలస దగ్గర సహకార రంగంలో బట్టల నేత మిల్లు పెట్టవచ్చు. రాజాం దగ్గర బూర్జిల్లు బట్టల నేతమిల్లు నుండి ఉత్పత్తి అయ్యే బట్టలు గరివిడిలో ఫెర్రో-ఎల్లాయ్ కార్పొరేషన్ పనివారికి, ఇతర పారిశ్రామికులకు సప్లై చేయవచ్చు. దీని పెట్టు బడి 1.62 లక్షలు.

శ్రీకాకుళం జిల్లా వెనుకబడిన ప్రాంతంగా కేంద్ర ప్రభుత్వం గుర్తించి దాని అభివృద్ధికి తీసికొంటున్న చర్యలలో పారిశ్రామికాభివృద్ధి ఒకటి, ఆరు సూత్రాల పథకం క్రింద జిల్లాలో వివిధ పథకాలకు ఆరు ఏండ్లలో ఖర్చు చేయడానికి 9 లక్షల, 61 వేల, 150 రూపాయలు కేంద్రం కేటాయించింది. ఈ మొత్తం చిన్నతరహా పరిశ్రమలమీదనే ఖర్చు చెయ్యాలి.

దీనికి రాష్ట్ర పరిశ్రమలశాఖ ఒక పథకం రూపొందించింది. మొత్తం జిల్లాలో 7 తాలూకాలలో బలహీన వర్గాల అభివృద్ధికి పరిశ్రమలు పెట్టుకొందుకి ఈ డబ్బు సహాయం చెయ్యాలి. మత్స్య పారిశ్రామికులకు నైలాన్ దారాలతయారీకి వెదురు పనికి, కొబ్బరి పీచు, నూనె పరిశ్రమ కుట్టు మిషన్ల వారికి ఈ సహాయం లభించాలి. విశాఖపట్నం గిరిజన కార్పొరేషన్ ద్వారా గిరిజన ప్రాంతాలలో అటవీ పరిశ్రమల క్రింద చింత పిక్కలద్వారా పిండి తయారీకి, సీతం పేటలో సగ్గుబియ్యం పరిశ్రమకు, ఈ మొత్తం ఖర్చు చెయ్యాలి. [తరువాయి 46 వ పేజీలో]

సీరియల్ :

# సంక్షిప్త తెలుగు సాహిత్య చరిత్ర

## శ్రీ కె. ఆర్. కె. మోహన్

"ఆ చెప్తాను. అతని తిట్టు కవిత్వంలోని దిట్ట దనాన్ని చెప్పే కథని, ఆ చాటువులలో చెప్తాను.

భీమకవి చొక్క నృపాలుని చూడటానికి వెళ్ళాడట. తాను ఎంతటి గట్టి తిట్టుకవో ఈ విధంగా చెప్పాడట.

"గడియలోపల దాడికడిగి ముత్తునియగా
దిట్టిన మేధావి భట్టుకంటె
రెండు గడెల బ్రహ్మదండి ముండ్లన్నియు
డుల్ల దిట్టిన కవి మల్లుకంటె
మూడు గడియలకు మొనసి యత్తిన గండి
పగులదిట్టిన కవి భానుకంటె
నరజాములోపల జెరువు నీళ్ళింకంగ
దిట్టిన బడబాగ్ని భట్టుకంటె
నుగ్రకోపినేను నోపుదు శపియింప
గ్రమ్మరింప శక్తి కలదు నాకు
వట్టి మ్రాన జిగురు పుట్టింప గిట్టింప
బిరుదు వేములాడ భీమకవిని."

మేధావి భట్టు, కవి మల్లుడు, కవిభానుడు, బడబానలభట్టు మొదలైనవారు మహా వాక్శుద్ధిగల తిట్టు కవులు. వారు అన్నది అయి తీరవలసిందే. వాళ్ళు తిట్టి చెరువులు ఎండేటట్లు, కట్టలో గండి పడేటట్లు — ఈ విధంగా చేయగలిగిన సమర్థులు. తాను వారికంటె అమితమైన కోపంగలవాడననీ, ఎవరినైనా శపింప గలననీ, తన శక్తితో ఎండిన మ్రానుకికూడా చిగురు తెప్పించగల ననీ చెప్పాడు.

భీమకవి శక్తిని పరీక్షించాలనుకున్నాడు చొక్క భూపాలుడు. మల్లె పందిరి కున్న స్తంభాన్ని చూపించి "ఈ కర్రను చెట్టుగా మార్చగలరా ?" అని అడిగాడట. 'అదెంత పని' అంటూ భీమకవి ఈ పద్యం చదివాడట.

"ఆనీతాభ్యవదాన శృంఖల పదాభ్యాలంచిత స్తంభమా !
నేనే వేములవాడ భీమకవినేనిం జిత్ర కూటంబులో
ఘనవ్యాపిత పల్లవోద్భవ మహా పుష్పోప గుచ్ఛంబులన్
నానాపక్వ ఫలప్రదాయివగుమా నాకల్పవృక్షాకృతిన్ !"

అంటే "ఓ స్తంభమా... నేనే కనుక వేములవాడ భీమ కవినైతే నీవు చక్కని పూల గుత్తులతోను, పండిన పళ్ళతోనూ ఉన్నట్టి మహా వృక్షంగా మారుము" అనిన వెంటనే ఆ స్తంభం మహా వృక్షంగా మారిపోయిందట. అయితే రాజుగారు పరాకుగా వుండి ఆ స్తంభానికి తన కాలు ఆనించి కూర్చుని ఉండడంతో ఆ కాలు చెట్టులో ఇరుక్కుపోయి ఊడిరాలేదట. వెంటనే ఆ చెట్టుని తిరిగి కర్రగా మార్చమని ప్రార్థించాడట. తిరిగి భీమ కవి ఈ పద్యం చదివాడట.

"శంభువరప్రసాదకవి సంభవరేణ్యుడనైన నా వచో
గుంభన చేయనెంతో యనుకూలత నొంది తనూన భావనన్
గుంభిని జొక్కనామ నృప కుంజరుపందిటి మల్లెసాలెకున్
స్తంభము రీతి నీ తనువు దాలిచి యెప్పటియట్ల యుండుమా !"

అంటే నేను శివుని వరప్రసాదంగలవాడిని. కవిని. నా మాటచొప్పున నీవు చెట్టుగా మారావు. తిరిగి నీవు ఎప్పటిలాగ స్తంభముగా మారు" అని.

ఈ పద్యం చెప్పగానే ఆ చెట్టు తిరిగి కర్రగా మారిందట.

ఇంతటి మహామహిమాన్వితుడైన భీమకవి యొక్క గ్రంథాలేవీ మనకు దొరక్కపోవడం నిజంగా మన ఆంధ్రుల దురదృష్టం."

"ఇందాకా నువ్వు భీమకవిగురించి చెపూ 'కవిజనాశ్రయం' అనే గ్రంథం భీమకవిదని కొందరూ, కాదని కొందరూ అభిప్రాయ పడుతున్నారన్నావు. ఇంతకీ దానిని ఎవరు రచించినట్లు ?" అని అడిగాడు.

అనేకమైన పండితుల పరిశోధనవలన ఈ 'కవిజనాశ్రయం' అనే లక్షణగ్రంథం భీమకవిది కాదనీ, మల్లియరేచన అనే పండితుడు రచించినదనీ నిరూపితమైంది.

"లక్షణగ్రంథం అంటే ఏమిటి మామయ్యా" అంది విమల.

"పద్యలక్షణాలు ఎల్లా ఉండాలో, వాటిలోని ఛందోరీతులు, వ్యాకరణం మొదలైన వాటినిగురించి తెలిపే గ్రంథమన్న మాట" అన్నాడు మామయ్య.

"మరి తాను వ్రాయని గ్రంథానికి వ్రాసినట్లు భీమకవికి పేరెందుకువచ్చింది మామయ్యా ?" అని అడిగింది మాధవి.

"చెప్తాను" ఈ మల్లియరేచన వైశ్యుడు. ఆ పైన జైన మతస్థుడు. అందుచేత ఇతనిని కవిగా గుర్తించడానికి

ఆనాటి పండితులకి మనస్సు ఒప్పుకోలేదు. కనుక అతని పేరు పైకి రాకుండా ఆ గ్రంథ రచన భీమకవిదైనట్లుగా ప్రచారం చేశారు.

ఈ మల్లియ రేచన నన్నెచోడునికి సమకాలికుడు. అంటే పదకొండు పన్నెండు శతాబ్దాల మధ్య వాడు ఈ రేచన పేరు పండితులకు పనికి రాకపోయినా. అతని గ్రంథం మాత్రం వారు వదులుకోలేదు. ఎందుకంటే ఈ 'కవి జనాశ్రయం' అనేది తెలుగులో మొదటి లక్షణ గ్రంథం. అంతేకాక చాలా విలువైన ప్రామాణిక గ్రంథం అందుకే రేచన తర్వాత లక్షణ గ్రంథాలు రచించిన అనంతుడు, విన్నకోట పెద్దన, వెల్లంకి తాతం భట్టు. లింగమగుంట తిమ్మన, అప్పకవి, కస్తూరి రంగకవి మొదలైన వాళ్ళు ఈ గ్రంథాన్ని తమ గ్రంథాల రచనలో ఎంతగానో వాడుకున్నారు. కొందరు ఇందులోని కొన్ని పద్యాలకు పద్యాలను తమ స్వంతం చేసుకున్నారు.

"ఆ రోజుల్లో కూడా కొందరు అంత సంకుచితంగా ప్రవర్తించే వారన్నమాట" అన్నాడు భాస్కరరావు.

"సంకుచితత్వానికి స్థలం, కాలంతో నిమిత్తం లేదు. కాకపోతే ఒకప్పుడు తక్కువ, ఇంకొకప్పుడు ఎక్కువ: ఒకచోట ఎక్కువ–ఇంకొకచోట తక్కువ అంతే తేడా'' అన్నాడు ప్రసాదం మామ.

"ఊ" అని బరువుగా నిట్టూర్చాడు భాస్కరరావు.

"ఇంక 12 వ శతాబ్దపు చివరి భాగానికి చెందిన మల్లికార్జున పండితారాధ్యుడనే కవిని గురించి చెప్తాను. దాక్షారామంలో భీమేశర్వ స్వామి ఆలయ పూజారి అయిన వానస భీమన్నగారికి ఈ మల్లికార్జునుడు పుట్టాడు. ఈతడు దగ్గర్లో నున్న కోటిపల్లి గ్రామంలోని అవాంకరం అనే ఆరాధ్యునివద్ద వీరశైవ మతదీక్ష పుచ్చుకున్నాడు. ఈతడు తెలుగుదేశంలో వీరశైవ మత ప్రచారానికి విశేషంగా పాటుపడ్డాడు. తన ప్రచారంలో అనేక మంది బౌద్ధులను ఓడిస్తూ ఉండేవాడు. ఈతడు వీరశైవ మతప్రవక్త అయిన బసవేశ్వరుని బోధలచే బాగా ప్రభావితు డయ్యాడు. ఆ బసవేశ్వరుని చూసే ఉద్దేశంతో అతడు కల్యాణ కటకానికి బయలుదేరాడు. దారిలో ఇతనికి బసవేశ్వరుని మరణవార్త తెలిసింది. దానితో ఇతని నెత్తిన పిడుగు పడినట్లయింది ఇంక ముందుకు వెళ్ళలేక శ్రీశైలం చేరుకుని అక్కడే ప్రాణం వదిలాడు.

ఈ పండితారాధ్యుడు చాలా గ్రంథాలు వ్రాశాడట. కాని మనకి అందుబాటులో నున్నది కేవలం 'శివతత్వసారం' అనే శతకం మాత్రమే. వీరశైవుల పద్ధతులు ఎంతటి రౌద్రంగా ఉంటాయో ఇందులోని భావాలుకూడా అంత రౌద్రంగా ఉంటాయి. అయితే వీరశైవం బాగా ప్రచారం పొందడానికి ముఖ్యకారణం అది కుల తత్వాన్ని ఎదిరించి, పంచములతో సహా అందర్నీ సమానంగా చూడడమే. కన్నడ దేశంలో బసవేశ్వరుడు 'శివపసాయితం' అనే ఖడ్గాన్ని పట్టుకుని తనని ఎదిరించిన వారిని అతి దారుణంగా హింసిస్తూ మత ప్రచారం చేశాడు. ఫలితంగా ఈ నాటికికూడా ఆ దేశంలో సగానికి సగం మంది లింగాయితులనబడే వీరశైవులే ఉన్నారు. పండితారాధ్యుడు కూడా తన ప్రచారాన్ని ఇంతటి దీక్షతోనూ సాగించాడు కాని తెలుగుదేశంలో వీరశైవం అంతచోటు చేసుకోలేకపోయింది.

పండితారాధ్యుడు తన కవిత్వంలో ఒక కొత్త పద్ధతిని ప్రవేశ పెట్టాడు. అదేమిటంటే సంస్కృత ఉదాహరణలనీ, సమాసాలనీ యథాతథంగా తన పద్యాలలో పొందుపరచడం. దీనివల్ల ఈతని పద్యాలు తెలుగు–సంస్కృతపు కలనేతగా రూపొందాయి, ఈ పద్ధతినే పాల్కురికి సోమనాథుడు వంటి అనేకమంది తర్వాత కవులు అవలంబించారు.

"ఎన్ని విషయాలు చెప్పావు బావా!" అన్నాడు భాస్కరరావు.

"ఇంక ఈ రోజుకి ఆపుదాం. ఇప్పటివరకు 12 వ శతాబ్దం వరకు వచ్చిన కవులను గురించీ, వారి రచనల గురించీ తెలుసుకున్నాం. రేపు 13 వ శతాబ్దం నుంచీ వచ్చిన కవులను గురించీ తెలుసుకుందాం. ఇంక పోయి పడుకొందాం. పిల్లలు జోగుతున్నారు. అంటూ లేచాడు ప్రసాదం మామయ్య.

అందరూలేచి ఎవరిమంచాలపై వారు జేరారు.

( సశేషం )

---

"అసాధారణమైన బృహత్కార్యాలు మనం చెయ్యవలసిందే, దాంతోపాటు మామూలు పనులు కూడా ఒక పద్ధతిలో మనం చేసుకోవాలి. అప్పుడే మనలో ప్రతి ఒక్కరూ ఒక్కొక్క నాయకుడు కాగలుగుతారు.

— ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ




—స్వరాజ్యలక్ష్మి

## మహిళల సహకార ఆర్థిక సంస్థ

ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ జన్మదినోత్సవ సందర్భంగా పదిలక్షల రూపాయల వ్యయంతో రాష్ట్ర ప్రభుత్వం మహిళల ఆర్థిక సహాయ సంస్థను నెలకొల్పింది. నవంబరు 19 వ తేదీన యీసంస్థను జూబిలీహాలులో ప్రారంభోత్సవం చేసిన ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు. కూరగాయలు, పండ్లు విక్రయించే బీద మహిళలకు 40 వేల రూపాయల మేరకు చెక్కులను పంపిణీచేశారు. అంతర్జాతీయ మహిళాసంవత్సరంలో ప్రారంభమైన యీ ఆర్థిక సహాయ సంస్థ ఆర్థికంగా వెనుకబడిన మహిళల పురోగతికి దోహదం చేస్తుంది. ఔత్సాహిక మహిళలకు ఆర్థిక వసరులను కల్పిస్తుంది.

## పదికోట్ల రూపాయల వ్యయంతో వచ్చే ఐదేళ్ళలో జంటనగరాల అభివృద్ధి

హైదరాబాద్, సికిందరాబాద్ నగరాల అభివృద్ధికి ఒక బృహత్తర పథకాన్ని రూపొందిస్తున్నారు. ఈ పథకం క్రింద జంట నగరాల్లో నాలుగు చెరగులా హోల్‌సేల్ మార్కెట్లు తెరుస్తారు. సికిందరాబాద్‌లోని చిలకలగూడాలో 82 లక్షల రూపాయల వ్యయంతో నిర్మించనున్న మునిసిపల్ మార్కెట్ భవనానికి ముఖ్య మంత్రి శ్రీ జలగం వెంగళరావు యిటీవల శంకుస్థాపన చేశారు. ఈ సందర్భంగా ప్రసంగిస్తూ ముఖ్యమంత్రి హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ పట్టణ అభివృద్ధి సంస్థద్వారా వచ్చే ఐదేళ్ళలోను జంటనగరాల అభివృద్ధికి రూ. 10 కోట్లు ఖర్చు చేయడం జరుగుతుందని అన్నారు. మెట్రోపాలిటన్ సిటీ అభివృద్ధి సంస్థనుండి యిందుకోసం ఆర్థిక సహాయం పొందవచ్చునని కూడా యీ సందర్భంలో తెలియజేశారు.

## ప్రభుత్వోద్యోగాలలో వెనుకబడిన తరగతులకు ప్రాధాన్యత

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వానికి సంబంధించిన ఉద్యోగాలలో ప్రత్యేక ప్రావీణ్యత అవసరమయ్యే కొన్నిటిని మినహాయించి, నేరుగా ఎంపిక చేసి భర్తీ చేసే ఉద్యోగాలను షెడ్యూలు తెగలు, వెనుక బడిన వర్గాలకు ప్రత్యేకించాలని ప్రభుత్వం ఉత్తర్వు జారీ చేసింది. ఈ ఉత్తర్వు 1975 నవంబరు 15 వ తేదీ నుండి అమలు లోనికి వస్తుంది. ప్రత్యేక ప్రావీణ్యత అవసరమయ్యే కొన్ని ఉన్నత ఉద్యోగాలు—కాలేజీ ప్రిన్సిపాల్స్, డిపార్టుమెంటు అధిపతులు—పరిశోధనకు సంబంధించిన ఉద్యోగాలు మొదలయిన వాటిని మాత్రమే రిజర్వేషన్ రూల్సు నుండి మినహాయిస్తారు. రాష్ట్ర ప్రభుత్వ సర్వీసులలో షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు వెనుక బడిన వర్గాల వారికి మరింత ఎక్కువ ప్రాతినిధ్యం కల్పించటమే యీ ఉత్తర్వు ధ్యేయమనీ వీరి అభివృద్ధికి ప్రభుత్వం తీసుకొంటున్న చర్యలలో యిది ఒక భాగమని ఒక అధికార ప్రకటనలో తెలియజేశారు.

## నిరుపేదలకు ఇండ్ల స్థలాలు

పంచాయతీరాజ్ రజతోత్సవాల ముగింపు సందర్భంగా నవంబరు 19న ప్రసంగిస్తూ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు యీ 19 రోజులలోను రాష్ట్రంలో ఒక లక్ష అయిదు వేల మంది బలహీనవర్గాల ప్రజలకు నివేశన స్థలాలకు సంబంధించిన పట్టాలను పంపిణీ చేసినట్లు వెల్లడించారు. రానున్న రెండు సంవత్సరాలలోనూ హరిజనులు, బలహీనవర్గాలకు భూమిలేని యితర పేద ప్రజలకు యిండ్ల స్థలాలను సమకూర్చేందుకు రాష్ట్ర ప్రభుత్వం అన్నివిధాలా చర్యలను తీసుకుంటుందని ఆయన అన్నారు.

గత పంతొమ్మిది రోజులుగానూ జరిగిన పంచాయతీ రాజ్ రజతోత్సవాలకు అపూర్వమైన మద్దతునిచ్చినందుకు అందరికీ కృతజ్ఞతలు తెల్పుతూ, అన్ని రంగాలలోనూ ఉత్పత్తిని పెంచి, సామాన్యుడి జీవన విధానం మెరుగు పరిచేందుకు కృషిచేయాలని విజ్ఞప్తి చేశారు.

## పంచాయతీ రాజ్ సంస్థలలో ప్రధాని చిత్ర పటాల ఆవిష్కరణ

ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని నవంబరు 19వ తేదీన పంచాయతీరాజ్ సంస్థలలో 52,908 చిత్ర పటాలను ఆవిష్కరించారు. ప్రధాని 20 సూత్రాల ప్రణాళికకు మద్దతును ప్రకటిస్తూ ప్రధాని పట్ల తమ ప్రగాఢ విశ్వాసానికి చిహ్నంగా యీ చిత్ర పటాలను రాష్ట్రమంతటా ఆవిష్కరించడం జరిగింది. 15,924 పంచాయతీ బోర్డు కార్యాలయాల లోనూ, 34,349 సమితి పాఠశాలల్లోనూ, 21 జిల్లాపరిషత్ కార్యాలయాల్లోనూ ఒకే సమయంలో యీ ఆవిష్కరణ జరగడం విశేషం. అంతర్జాతీయ మహిళా సంవత్సరం, పంచాయతీరాజ్ రజతోత్సవాల సందర్భంగా వివిధ శాఖల మంత్రులు రాష్ట్రమంతటా పర్యటించి సామాన్యుల సమస్యలను అవగాహన చేసుకొనేందుకు, అభివృద్ధి కార్యక్రమాల అమలు కోసమూ కృషిచేశారు. ప్రధాన మంత్రి ప్రకటించిన నూతన ఆర్థిక కార్యక్రమం పంచాయతీ స్థాయి నుండి అమలు జరిపేందుకు యీ చిత్రపటాల ఆవిష్కరణ స్ఫూర్తినిచ్చింది.

పల్లె సీమల పాలిట వరాలు

# ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు

—శ్రీ కె. వి. కె. రావు

ఆర్థికాభివృద్ధి కృషిలో బ్యాంకులు నిర్వహించే కీలకమైన బాధ్యతల్ని పురస్కరించుకొని వీటి విధానాల్లో సామాజిక లక్ష్యసాధనకు అనువుగా మారిన దృక్పథాన్ని ప్రవేశపెట్టడం కోసం మన ప్రభుత్వం 1968వ సంవత్సరంలో బ్యాంకులపై సామాజిక అదుపును అమలుచేసి 1969 లో 14 షెడ్యూల్డ్ బ్యాంకులను జాతీయం చేసింది. ఈ జాతీయకరణ బ్యాంకుల విస్తరణకు, డిపాజిట్లలోని పెరుగుదలకు, పరపతి విస్తరణకు, పరపతి విధానంలో కొన్ని సడలింపులకు, ప్రత్యేకతరహాకు చెందిన రంగాల అభివృద్ధికి, లాభాలను ప్రభుత్వపరం చేయడానికి తోడ్పడింది. అయితే 80% ప్రజలు నివసించే గ్రామ ప్రాంతాలు, 50% జాతీయాదాయాన్ని సమకూర్చే వ్యవసాయరంగం బ్యాంకుల నుండి సరియైన ఆర్థిక సహాయాన్ని పొందలేక పోయినవి. వాణిజ్య బ్యాంకుల లాభార్జన, ఋణాన్ని మంజూరు చేయడంలో అవి అనుసరించే సాంప్రదాయ పద్ధతులు, వర్తక వాణిజ్యాలకు లభించే ప్రత్యేక శ్రద్ధ, పట్టణప్రాంతాల వైపు యివి ఆకర్షింపబడడం యిందులకు కారణాలని అనవచ్చు.

వివిధ ఆర్థిక కార్యకలాపాలకు అనుబంధంగా భావింపబడిన సహకారవుద్యమంలోని అంతర్భాగంగా వృద్ధిచెందిన సహకార పరపతి సంఘాలు కూడా అధికసంఖ్యాకులైన గ్రామప్రజల ఆర్థికావసరాల్ని తీర్చలేక పోతున్నాయి, పెద్దభూస్వాములకు, ఆర్థికస్తోమత కలిగిన వ్యక్తులకు, రాజకీయ ప్రాబల్యతలకు ఈ సంఘాలు లోబడి పని చేస్తున్నవి. భూమితనఖా బ్యాంకులు, ప్రభుత్వఋణాలు అంతంత మాత్రంగానే వుంటున్నాయి. ఈ కారణాలచేత గ్రామీణపరపతి అవసరాల్ని వడ్డీవ్యాపారులు, దేశీయబ్యాంకర్లు, దళారీలు, కమీషన్ ఏజెంట్లు మొదలగువ్యక్తులు సమకూరుస్తున్నారు. అధికవడ్డీలు, అక్రమపద్ధతులు, అసమంజసమగు షరతులవలన మెక్లగన్ కమిటీ, గ్రామీణ పరపతిపరిశీలనాసంఘం, అఖిలభారత పరపతి సమీక్ష సంఘాలు పేర్కొన్న గ్రామీణ ఋణభారం సంవత్సరసంవత్సరానికీ మరింత బలపడుతూ పెరుగుతోంది.

అత్యవసరపరిస్థితి అనుశాసన పర్వసహాయంతో ఆర్థిక సాంఘిక విప్లవాన్ని సాధించడంలో నూతనఅధ్యాయాన్ని సృష్టిస్తున్న ప్రధాని 20 సూత్రాల ఆర్థికకార్యక్రమంలోని ఒక అంశంగా గ్రామీణ ఋణభారంపై మారటోరియమ్ యిటీవల ప్రకటింపబడింది. దశాబ్దాలుగా ఋణభారంతో క్రుంగుతూ నిరాశ నిస్పృహలకు లోనవుతున్న ప్రజలకు యిది తాత్కాలిక వుపశమనాన్ని కలిగించ కలిగింది. సంస్థాపరమైన పరపతిని గ్రామీణప్రజలకు సమకూర్చడంలో వాణిజ్య బ్యాంకులు సహకారసంస్థలు ఆశించిన ప్రయోజనాలను సాధించలేక పోవడంతో; శాశ్వతంగా గ్రామీణ ఆర్థిక అవసరాల్ని తీరుస్తూ ఋణగ్రస్థతను నివారించడానికి సేవానిరతి-నూతన లక్ష్యాలతో కూడిన నూతన సంస్థలను స్థాపించవలసిన అవసరం ఏర్పడింది. అట్లు ఏర్పరచబడుతూవున్న నూతన సంస్థలే ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు.

భారత ప్రభుత్వం, రాష్ట్రాల ముఖ్యమంత్రులు తీసుకున్న నిర్ణయం ప్రకారం 5 ప్రాంతీయ గ్రామీణ బ్యాంకులు ఈ సంవత్సరం గాంధీజయంతినాడు(అక్టోబరు 2వ తేదీన) ఉత్తరప్రదేశ్, పంజాబ్, హర్యానా, హిమాచలప్రదేశ్ రాష్ట్రాలలో స్థాపించబడినవి. 1975 అంతమయేసరికి కనీసం 15 బ్యాంకులు స్థాపించబడుతూ 1977 ఏప్రిల్ 1వ తేదీనాటికి 50 బ్యాంకులు దేశవ్యాప్తంగా నెలకొల్పబడవలసివుంది. కేటాయింపబడిన ప్రాంతంలో ప్రతి బ్యాంకు 500 శాఖలను ఏర్పరుస్తుంది. అంటే 1977 నాటికి 25,000 గ్రామ ప్రాంతాల్లో బ్యాంకుల కార్యాలయాలు పనిచేస్తూవుంటాయి.

ప్రాంతీయ గ్రామీణ బ్యాంకుల యాజమాన్య నిర్వహణలలో వ్యక్తులకు ఎట్టిస్థానము వుండదు. వీటి మూలధనంలో 50% కేంద్ర ప్రభుత్వం, 15% ప్రధానబ్యాంకు(వాణిజ్యబ్యాంకు), 35% రాష్ట్ర ప్రభుత్వాలచే సమకూర్చబడుతుంది.

ఈ బ్యాంకులకు స్థలాన్ని నిర్ణయించడంలో కొన్ని నిబంధనలను అనుసరింపవలసివుంటుంది. ఇంతవరకు బ్యాంకులు లేని గ్రామప్రాంతాలు: ఆదిమవాసులు గిరిజనులు నివసించుప్రదేశాలు: వుత్పత్తిని పెంచడానికి వీలైన వనరులు లభించే గ్రామప్రాంతాలను ఈ బ్యాంకుల స్థాపనకోసం ఎన్నుకొనవలసివుంటుంది.

గ్రామ ప్రాంతాల్లో పని చేస్తూవుండడంవలన ఈ బ్యాంకులు గ్రామీణ ఆర్థిక వ్యవస్థయొక్క ప్రత్యక్ష పరోక్ష అవసరాల్ని ఎక్కువగా గుర్తింపగలుగుతాయి. వీటి కార్యక్రమాలు గ్రామ ప్రజల అవసరాలతో ముడిపడి వుండడంతో పరపతి సౌకర్యాలు విస్తృతంగా కల్పించబడతాయి. సన్నకారు వ్యవసాయదారులకు, భూమిలేని వ్యవసాయకూలీలకు, వృత్తిదారులకు, చిన్నతరహా గ్రామీణ వుత్పత్తిదారులకు 10-11 శాతం వడ్డీరేటుతో, సహకార సంస్థలవలె, ఈ బ్యాంకులు ఋణాలను మంజూరు చేస్తాయి. వడ్డీ వ్యాపారి, కమిషన్ ఏజెంట్లవంటి వ్యక్తుల నుండి వచ్చే ఋణాలను తగ్గించేందుకు యివి కృషి చేస్తాయి. విద్య, వైద్య సౌకర్యాలవంటి వినియోగ ప్రయోజనాలకు కూడ వీటి నుండి ఋణాలు లభిస్తాయి.

సహకార సంఘాలకు లేని డిపాజిట్ సేకరణ సౌకర్యం ఈ బ్యాంకులకు వుంది. డిపాజిట్లపై వాణిజ్య బ్యాంకులు యిచ్చే వడ్డీరేటుకన్న 0-50 ఎక్కువ బ్యాంకులు యివ్వగలుగుతాయి.

గ్రామీణ ఆర్థిక వ్యవస్థను ప్రభావితం చేయడానికి ఈ బ్యాంకులు హెచ్చు పరిమాణంలో ప్రజలవద్దనుండి డిపాజిట్లను సేకరించ గలగాలి. గ్రామ ప్రజల్లో వీటి నిర్వహణపట్ల నమ్మకం పెంపొందాలి.

1969లో బ్యాంకుల జాతీయకరణ తరువాత లీడ్‌బ్యాంక్ పథకాల ప్రకారం వివిధ జిల్లాల వనరుల్ని పరిశీలించి, పరపతి పథకాల్ని వాణిజ్య బ్యాంకులు సిద్ధంచేసుకున్నాయి. గ్రామ ప్రాంతాల్లో వాణిజ్య బ్యాంకుల శాఖలుకూడా ఈ 5,6 సంవత్సరాలలో హెచ్చుగా నెలకొల్పబడ్డాయి. వీటిని ప్రాంతీయ గ్రామీణ బ్యాంకుల శాఖలుగా విలీనం చేయడం గురించి ఆలోచించటం అవసరమని అనిపిస్తుంది. ఇంతవరకు గ్రామీణ పరపతి సమస్యలమీద వాణిజ్య బ్యాంకులు సేకరించిన సమాచారం, సంపాదించిన అనుభవం ఈ బ్యాంకుల పరం చేస్తే ఎంతో పుపయోగపడుతుంది.

ప్రణాళికాసంఘ సభ్యులైన బి. శివరామన్ అధ్యక్షతలో ఏర్పడిన స్టీరింగ్ కమిటీ ఆధ్వర్యంలో ఈ బ్యాంకులు పనిచేసే తీరు తెన్నుల గురించి నిబంధనావళిని రూపొందించే ప్రయత్నాలు జరుగుతున్నవి. గ్రామీణ ఆర్థిక వ్యవస్థను పునరుజ్జీవింపజేస్తూ గ్రామీణ ఋణభారాన్ని తగ్గింపదలచిన ఈ బ్యాంకుల నిర్వహణ విధానం ఈ క్రింది విషయాలను దృష్టిలో వుంచుకోవలసి వుంటుంది.

వ్యవసాయం లాభసాటిఅయిన వృత్తిగా రూపొందించబడాలి. వ్యవసాయ వుత్పాదకాలను సమకూరుస్తూ విక్రయసౌకర్యాలను కలిగించడానికి కృషిజరగాలి.

అనుబంధ వృత్తుల్ని-పరిశ్రమల్ని గ్రామప్రాంతాల్లోస్థాపించి ప్రజల ఆదాయాన్ని అధికం చేయగలిగే పెట్టుబడులను ప్రోత్సహించాలి. నిపుణుల సలహాలను, ప్రదర్శనలను, శిక్షణలను గ్రామస్థులకు అందజేయాలి. మధ్యవర్తులకు ఎటువంటి స్థానమూ వుండరాదు. మారుతున్నకాలంతో మారుతూ నూతన విలువలతో జాతీయతాభావంతో పనిచేయగలిగిన సుశిక్షితులైన బ్యాంకు సిబ్బంది వుండాలి. వ్యవసాయ కార్యకలాపాలు లేని సమయాల్లో గ్రామాలలోని నిరుద్యోగతను తొలగించగలిగే పథకాలను ప్రవేశపెట్టగలగాలి. వ్యవసాయ వుత్పాదకతను పెంపొందించే పెట్టుబడులు ప్రోత్సహింపబడాలి. వాణిజ్య బ్యాంకుల నిర్వహణ వ్యయంకన్న ఈ బ్యాంకుల నిర్వహణ వ్యయం తక్కువగా వుండాలి.

మన గ్రామీణ ఆర్థిక వ్యవస్థయొక్క అవసరాల్ని తీరుస్తూ మన సర్వతోముఖమైన అభ్యుదయానికి సహకరింపగలవని ఆశిస్తున్న ఈ బ్యాంకుల కార్యకలాపాలపై మన ప్రగతి స్వరూపం ఆధారపడివున్నదనడంలో అతిశయోక్తి కాబోదు.

---

# ఉర్వీజనులు లే లెండోయ్ - ఉరకలెత్తి రారండోయ్

శ్రీ మొక్కపాటి నరసింహమూర్తి

కదలిందోయ్ కదలింది—కష్టజీవి రథచక్రం
ఎదలుపొంగ పేదప్రజల ఈప్సితములు దీర్చుటకై క॥

ఇందిరమ్మసారథిగా విలసయనించె నిదెచూడు
ముందరుండి నడుపుమురా ముఖ్యుడవై నీవు రథము క॥

సందివ్వకు దేశద్రోహ సందోహంబుకు నెప్పుడు
ముందునడచు ప్రజాస్వామ్యముఖ్యులు రథమును లాగగ క॥

సామ్యవాద సరళిలోన సాగిపోవు రథమిప్పుడు
రమ్యముగా ధనికవర్గ రాజకీయముల ద్రుంపుచు క॥

సామ్యవాదభావాల్ల సవాలుచేయు సన్నాసుల
ప్రజాసామ్యభావాలను ప్రతిఘటించు దుర్మార్గుల క॥

మతముపేరుచెప్పి తాము మాయలుపన్నెడు కులటల
చీలిచి, చెండాడుకొనుచు శీఘ్రగతిని పోవుచు తా

దేశభక్తి ధ్యేయముగా - దేశప్రజకు రక్షణగా క॥

బీదప్రజకు భాగ్యముగా - పెన్నిధియె బయలుదేరె క॥
ఎదిరించిన ప్రతిరాయీ ఏమౌతుందో తెలుసా

నలిగి నీరసించి తానె నాశనమైపోతుంది
భారతప్రజలకు భాగ్యం పంచిపెట్ట కదలిందోయ్ క॥

దేశప్రజల దారిద్ర్యం దీసివేయ కదిలిందోయ్
ఉర్వీజనులు లే లెండోయ్—ఉరకలెత్తి రారండోయ్.

# మరుగు పడిన మన్యం వీరుడు

# రామచంద్రయ్య

శ్రీ ఎస్. ఆర్. కోటేశ్వరశర్మ

తెలుగునాట మన్యం సీమ నామం వినని తెలుగువారు అరుదు. ఇది తెలుగు దేశానికి ఈశాన్యదిశలో ఒరిస్సా సరిహద్దుల్లో వుంది. భౌగోళికంగా ప్రకృతి ప్రసాదించిన పెక్కు అనుకూలతలతో మన్యం వీరులకు రక్షణ దుర్గంగా వర్ధిల్లింది. మన్యంసీమలో పలుప్రాంతాల్లో పట్టపగలే కనులు చీకటిలు చేసిచూసినా మార్గాలు కన్పడని దుర్గామారణ్య ప్రదేశాలు అనేకం. దారులేమైనా కన్పించినా అవి వాగులు, నదులు, లోయలు, పరుగులుతీసే జలప్రవాహాల మయం. శత్రువులు కష్టంమీద అందు జొరబడి తుపాకులు కాల్చినా, అవి లెక్కకు మించిన అడుగావున్న గుట్టలకో, చెట్లకో తగులుతాయేగాని దేశీయ వీరులను ఏమీ చేయలేవు. ప్రాంతీయులకు ఆ ప్రదేశమంతా కొట్టిన పిండి కాబట్టి యుద్ధ వ్యూహానికి చక్కని స్థావరం. ఈ ప్రాంతంలోనే సింహబలుడుగా పేరుమోసిన రామచంద్రయ్య తెల్లవారి గుండెలో బల్లెలను గ్రుచ్చాడు. దేశంకోసం రక్తతర్పణం చేసి మరుగుపడిపోయిన మన్యంవీరులలో ఈతడొకడు.

అది పందొమ్మిదవ శతాబ్దపు చివరి భాగం. మన్యంలో అడుగడుగునా స్వాతంత్ర్య సమర చిహ్నాలు ఎదురవుతాయి. ఆ సమర గాథలకు తెలుగుజాతియే గాకుండా భారతజాతి సమస్తం రొమ్ములు విరుచుకొని గర్విస్తుంది. స్ఫూర్తినిపొంది ముందుకు పయనిస్తూంది. ఆంగ్లేయులపై స్వాతంత్ర్య పోరాటం సాగించి అప్రతిహత శౌర్యపరాక్రమాలు ప్రదర్శించిన రామచంద్రయ్య వీర గాథ ప్రతి దేశభక్తుణ్ణి పులకితపరుస్తుంది.

రామచంద్రయ్య జన్మస్థలం బొబ్బిలి. చరిత్రలో బొబ్బిలి కున్న ప్రాధాన్యం సర్వవిదితమైంది ఈ వీరుడు భారీవిగ్రహం గలవాడు. మూర్తీభవించిన తెలుగు వీరుని గుర్తుకు తెచ్చు నిండైన రూపం రామచంద్రయ్యది. అతని మూర్తి మిత్రులకు ఉత్తేజాన్ని, ధైర్యాన్ని కూర్చితే, శత్రువులగు తెల్లదొరల గుండెల్లో బండలు పడవేసి, భయాందోళన పాలుచేసేది.

రామచంద్రయ్య నడిపిన సమర కారణాలు ఆంగ్లాధికారుల అనాగరికకృత్యాలే. కుట్రలతో, కుతంత్రాలతో, పెక్కువీరుల అడ్డంకులు తొలగించి మన్యంసీమను తెల్లవాళ్ళు పాలన సాగిస్తున్నారు. మన్యంలో ప్రవహించే శబరినదికి దక్షిణాన రేఖపల్లిగ్రామం వుంది. వామదిశలో కూనవరం వుంది. కూనవరానికి 28 కిలోమీటర్ల దూరంలో "కుంట" అనే కేంద్రముంది. పరిసర ప్రాంత ప్రజ లందరకూ యిది ముఖ్యకూడలి. ఇక్కడ ప్రతిగురువారం సంత జరుగుతుంది. పలు నిత్యావసర వస్తువులు ఖరీదు చేయుటకు ప్రజలు అధిక సంఖ్యలో వస్తూవుంటారు. ప్రజల్లో కోయవారి సంఖ్య మెండు.

కోయలకు నవనాగరికత లేదు. పైగా ఆచారవ్యవహారాలు, వీటికిజోడైన దారిద్ర్యం మూలాన సరైన దుస్తులే వుండేవికావు. చాలీచాలని గుడ్డలు తొడుక్కున్న ఒక కోయపడతిని ఒకనాటి సంతలో తెల్లఅధికారి (పోలీసు) చూడటం తటస్థపడ్డుంది అర్ధవస్త్రాలను ధరించుకుంటూ వక్షోజాలు కన్పిస్తూవుంటే ఆ ఆంగ్ల అధికారి కర్రతో వినోదానికి ఆమె రొమ్ముపై తట్టాడు.

ఆ ఆంగ్లాధికారి మితిమీరిన చర్యకు అగ్నిగోళాలు బ్రద్దలయినాయి. మానం ప్రాణంకన్న మిన్నగా ఎంచుకొనే మన్యం ప్రజల్లో ఆవేశం పొంగిపొరలింది. ఆంగ్లాధికారులపై తిరుగుబడ్డారు. పోలీసులను రాళ్ళతో, విల్లంబులతో శాస్తి చేశారు. ప్రజలను అణచడానికి క్రొత్త పోలీసు బలగం కుంటకు దిగుమతిచేయ బడింది. బొబ్బిలిలో జన్మించిన చంద్రయ్య శబరికి ఆవలిగట్టున వున్న రేఖపల్లిలో స్థిరనివాసం యేర్పరచుకొని, తన పరాక్రమ విక్రమాలవల్ల అప్పటికే ప్రాంత ప్రజల మన్ననలను చూరగొన్నాడు. ఒక కోయ స్త్రీపై అసభ్యంగా ఆంగ్లేయుడు ప్రవర్తించాడని విని త్రాచులా లేచాడు చంద్రయ్య. క్రొత్త సైనిక బలగం వచ్చిందనే భయంతో ప్రజ రామచంద్రయ్యను ఆదుకోమని కోరారు. అంతే ఈ వీరుడు రణరంగానికురికాడు.

బొబ్బిలి వీరుల క్షాత్రాన్ని హృదయంలో నింపుకొని కదన రంగానికి వురకలు తీశాడు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో (1857) మన్యం వీరుడు, విప్లవ జ్యోతి సుబ్బారెడ్డి త్యాగాలను మననం చేసుకుంటూ ఆంగ్లేయుల్ని ఢీకొన్నాడు. చంద్రయ్య నాయకత్వాన కోయలు తిరుగబడ్డారని గ్రహించి క్రొత్త ఆశ్విక దళాన్ని కూడా ఆంగ్లేయులు పిలిపించారు. రేఖపల్లికి దాపున గల రుద్రమ్మకోట ఆంగ్లేయుల విడిదిగా మారింది. పంట పొలాల్లో సైనిక గుడారాలు వెలిశాయి. రుద్రమ్మ కొఠారులో మందుగుండు సామాను నిల్వచేశారు. మందుగుండు సామాను ఆంగ్లాధికారి పెద్దయెత్తున రక్షణ ఏర్పాట్లు చేశాడు.

అది 1874 వ సంవత్సరం గ్రీష్మఋతువు. బండలు భగ్గుమంటున్నాయి. అడవుల్లో కొయ్యలు కొయ్యలు రాచుకొని కార్చిచ్చు దహించుక పోతూంది. తెల్లవారు గ్రీష్మతాపానికీ, రామచంద్రయ్య గతిగమనాలకూ గుండెల్లో గుప్పిట్లు పెట్టుకొని కాలంగడుపుతున్నారు. బ్రతుకుతెరువుకోసం ఐదువేల మైళ్లదాటి భారతదేశానికి వచ్చినప్పుడే

ఆంగ్లేయులు తమ స్వదేశానికి తమ ప్రాణాలను నీళ్ళు వదులుకున్నారు. ఒకనాడు అర్ధరాత్రి ముగ్గురు బెబ్బులి రామచంద్రయ్య అనుచరులతో రుద్రమ్మ కోట కొతారుపై విరుచుకుపడ్డాడు. చంద్రయ్యను మట్టుపెట్టినంచి అట్టహాసంగా ఎన్నో ప్రయత్నాలు చేసిన తెల్లవారు, దేశీయవీరుల ఖడ్గాలతో కుత్తుకలు తెగగొట్టించుకున్నారు. మందుగుండు కోష్టాన్ని కాపలాకాస్తున్న తెల్లసైనికులంతా నిహతులైనారు. కోష్టం నిప్పంటుకుంది. ఒక తుపాకి పేల్చుకుండానే తుపాకిమందు భగ్గున అంటుకపోయింది. ఆంగ్లేయులకు శృంగభంగమైంది. అనుచరులతో చంద్రయ్య అదృశ్యుడైనాడు, వచ్చిన పని పూర్తికాగానే

అప్పటి నుండి పంచసంవత్సరాలు దేశీయవీరులకు ఆంగ్లేయులకు మన్యం సీమలో చెదురుమదురు యుద్ధాలు, బాహాబాహీ పోరాటాలు, భీకరసమరాలెన్నో కొనసాగాయి. ఆంగ్లేయులపై సహాయ నిరాకరణోద్యమం దేశీయులచే సజావుగానే సాగింది. చంద్రయ్య తెల్లవారికి మన్యంలో మంచినీళ్లు కూడా దొరక్కుండా చేశాడు. మందుగుండు కోష్టం తగులబడటంతో దొరలు బెంబేలుచెంది, తమ కార్యాలయ పత్రాలన్నింటిని పదిలం చేసుకొని లాంచీలపై ఎక్కించి, సంపూర్ణ రక్షణ ఏర్పాట్లు చేసుకొని గోదావరి మధ్యలో లంగర్లువేసి ఆ ఐదు సంవత్సరాలు కాలంగడపాల్సిన గతి పట్టింది.

రుద్రమ్మ కోట విజయంతో చంద్రయ్య, అతని అనుచరులు ఉత్తేజితులైనారు. చంద్రయ్య నాయకత్వాన మన్యం సీమలో ఆమూల అశ్వారావుపేట నుండి ఈ మూల ఎల్లవరం వరకు కోయ ప్రజానీకం యావత్తూ ఒక్కుమ్మడిగా ఆంగ్లేయులను ఎదిరించడానికి నిల్చారు. ఒకరిది ధర్మం కోసం, స్వతంత్రంకోసం యుద్ధం. మరొకరిది అధర్మం కోసం, అధికారం కోసం యుద్ధం.

అనేకానేక యుద్ధాలు జరిగాయి. రామచంద్రయ్య నాయకత్వాన దేశీయ వీరులు గొరిల్లా యుద్ధరీతుల్ని అవలంబించారు. శత్రువులకు అపజయ పరంపరలను అంటగట్టారు. ఎప్పటికప్పుడు క్రొత్త సైన్యాలు బ్రిటిషు అధికారికి అసరాగావస్తూనే వున్నాయి. అన్నింటికన్నా ముఖ్యమైన పోరాటం శ్రీరామగిరిపైన జరిగింది. ఈ సమర వీరచరిత్ర తెలుగుజాతి సమరచరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగింది.

శ్రీ రామగిరి కీకారణ్యపరివృత్తమైంది. అరణ్యంలోను, పర్వతాన సతతం బెబ్బులు నడయాడుతూవుంటాయి. మానవవాస యోగ్యమైన స్థావరంకాదు. అటువంటి భయంకర ప్రదేశాన పులుల్లా రామచంద్రయ్య, అతని అనుచరులు కాపువేశారు. వన్యమృగాల భయం వారికిలేదు. శత్రుమూకను చెండాడుటయే వారి ధ్యేయం. వీరి వునికి తెలిసిన తెల్లదొరలు తమ సైన్యాలు నావల్లో ఎక్కించి, శ్రీరామగిరికి బయలుదేరారు. శత్రువుల వ్యూహం తెలిసిన రామచంద్రయ్య అన్ని కట్టుదిట్టాలుచేసి, రామగిరి కొండలపై యుద్ధసన్నద్ధుడైనాడు. జలప్రయాణంచేసి, తెల్లదొరలు రాత్రివేళ కాగడాల సాయంతో పర్వతాన్ని అధిరోహించడం ప్రారంభించారు. కొన్ని నావలు గట్టుకు చేరుకోవాల్సి వుంది. రామగిరి గోదావరికి అనుకొని వుండటంవల్ల,

ఆంగ్ల సైన్యం పర్వతాన్ని త్వరితగతిన చేరుకుంది. పర్వతంపైకి బలంకొద్ది తెల్ల సైనికులు కాగడాలు విసురుతున్నారు. [illegible] సైన్యం విచక్షణలేకుండా తుపాకీలను పేల్చుతున్నారు. కొండపైన చెట్లు తగులబడుతున్నాయి తుపాకీ దెబ్బలకు. మంటలకు దేశీయ వీరులు హతమవుతారని ఆంగ్లేయులు తలంచారు. కాని వారి ఎత్తుగడలు సాగలేదు. పొంచివున్న దేశీయ వీరులు పెద్ద పెద్ద బండరాళ్ళను క్రిందికు తోస్తున్నారు. కొండ ఎక్కుతున్న సైనికుల బుర్రలు బద్దలవుతున్నాయి. క్రిందవుండి యుద్ధవ్యూహాన్ని నడుపుతున్న తెల్ల నాయకుల తలలుకూడా ముక్కలవుతున్నాయి. ఇంకా గట్టుకు చేరుతున్న సైనిక నావలో బండల తాకిడికి [illegible] తెల్ల సైనికులు సమాధి చెందుతున్నారు. నావలు శకలాలై గోదావరి ప్రవాహంలో చిహ్నాలు లేక కొట్టుకొనిపోతున్నాయి. గెలుపు వరించలేక మిగిలిన సైన్యంతో, బ్రతికున్న తెల్ల నాయకులు వడివడిగా నావల్లో తప్పించుకొని పారిపోయారు. రామచంద్రయ్యను సజీవంగానో లేకపోతే ఆయన శవాన్ని పట్టుకుందామని ఎన్నో ఆశలు పెట్టుకొన్న ఆంగ్లేయులు కన్నులొట్టపోయి విస్పృహతో తిరోగమించారు.

శ్రీరామగిరి సమరం విజయంతో దేశీయ వీరుల ఘనత పెరిగి కొండంత అయింది. వీరి నాయకుడు రామచంద్రయ్యకు ప్రతిచోటా నీరాజనాలు పట్టారు మన్యం ప్రజలు. ఆనాడు దేశీయ నాయకుని సాహస సమర గాథల్ని రుద్రమ్మకోట, కూనవరం, రేఖపల్లి, బొబ్బిలి, ఎడ్డిగూడెం, ఎల్లవరం, అడతీగల ప్రజలు పాటలుగా అల్లుకొని ఉత్సాహంతో, ఉత్తేజంగా పాడుకోసాగారు. గొరిల్లా యుద్ధరీతులు, చురుకుదనం దేశీయ వీరులు సతతం అవలంబిస్తూ, మెరుపుదాడులతో తెల్లవార్ని చెరువునీళ్ళు త్రాగించేవారు.

ఆనాటి మద్రాసు ప్రభుత్వ పత్రాలందు ఆంగ్లేయులు రామచంద్రయ్య పోరాటంగూర్చి పేర్కొన్నారు. ఈ వీరుని సాహస సమర చరిత్రను ఆంధ్రవిజ్ఞాన సర్వస్వకర్తలుకూడా తమ గ్రంథంలో పేర్కొనడం ముదావహం. వివరాలు కావాలంటే మన్యం ప్రాంత ప్రజలవల్లగాని తెలియవు; పరిశోధనల్లో రామచంద్రయ్య సమర చరిత్రగూర్చి మరికొన్ని వివరాలు విపులంగా తెలియగలవు.

అది 1879వ సంవత్సరం. 1874వ సంవత్సరంలో రామచంద్రయ్య కొనసాగించిన సమరచరిత్ర తుది ఘట్టానికి చేరుకుంది. శత్రుమూకల్ని చెండాడి, తెల్లవారిని ముప్పు తిప్పలు పెట్టిన రామచంద్రయ్య అడ్డతీగలవద్ద ఆంగ్లేయుల పెద్దపెట్టున ఎదురుకొన్నాడు. మరెన్నో రెట్ల సైనికబలంతో, ఆయుధబలంతో తెల్లవారు తారసిల్లారు. ఆ సమరం మూడు రోజులు సాగింది. తెల్లవారి సైనికుల సంఖ్య క్షణక్షణం దేశీయ వీరుల హస్తాల్లో తగ్గుముఖం పడ్తున్నా, నూతన సైన్యం వచ్చి తెల్లవారిని చేరుతూనే వుంది. చివరకు తుది ఘడియల్లో రామచంద్రయ్య తన సైన్యాన్ని పరిశీలించుకున్నాడు. శత్రుపక్షంలో అశువులు బాసినవారు పదింతలైనా, తన సైన్యం పల్చబడింది. శేష దేశీయసైన్యం ఎదురులేక వీరావేశంతో పోరు సల్పుతూవుంది. అయినా జయం లభ్యంకావడం కష్టమని గ్రహించాడు. కేవలం ధైర్యసాహసాలు, యుద్ధనిపుణతలే

విజయానికి కారణాలు కావు. సంఖ్యా బలం కావాలి అది తనవైపు బలహీనమైంది సమరాన్ని తప్పించి, శేషసైన్యంతో రణరంగం విడిచిపుచ్చి, వినూత్న బలంతో ఆంగ్లేయులకు గుణపాఠం చెప్పాలని నిశ్చయించుకున్నాడు. తన ఊహాకు రూపకల్పనచేసే సమయానికల్లా, తెల్లవారు వందల సంఖ్యల్లో రామచంద్రయ్యను చుట్టుముట్టారు. తనకు చివరి ఘడియలు ఆసన్నమైనవని గ్రహించి, శత్రువుల చేతులో ఖైదీగా చిక్కి, వీరునకు అవమానకరమైన బ్రతుకు బ్రతికదల్చుకోనలేదు ఒకే మనిషి పందమంది పట్టుగా పోరాడాడు కాని మానవశక్తికి ప్రకృతి సిద్ధమైన హద్దులున్నాయి. విసుగు విరామంలేని యుద్ధంలో అలసిపోయిన రామచంద్రయ్యను అవలీలగా తెల్లవారు పట్టించగల్గారు. సింహం చిక్కింది కాని విహాల స్థితిలో.

రామచంద్రయ్య స్వాతంత్ర్య సమరం ఆనాడు విఫలమైనా తెలుగు జాతికి ఆదర్శప్రాయమైంది. రామచంద్రయ్య సమర గాథలవల్ల స్ఫూర్తిని పొంది, ఆంధ్రవీరుడు అల్లూరి సీతారామ రాజు 20 వ శతాపు తొలి భాగంలో మన్యం ప్రాంతంలో ఆంగ్లేయులపై స్వాతంత్ర్య సమరం నడిపాడు. మన్యం ప్రజల దాస్య విముక్తికోసం, పవిత్ర స్వాతంత్ర్య సమరం జరిపి, బలినొరిగిపోయిన రామచంద్రయ్య లాంటి తెలుగు వీరుని చరిత్ర మరుగున పడిపోయి వుండటం శోచనీయం, నేటికీ ఈ వీరుని గాథను ప్రాంత ప్రజలు మననం చేసుకుంటూ వుంటారు. గ్రామీణ ప్రజ రామచంద్రయ్య వీరోచిత గాథలను పాటలల్లి ఆవేశంతో పాడుకుంటూ వుంది. తెలుగుజాతి చరిత్రకే గర్వకారణమైన ఈ వీరుని త్యాగాలను తెలుగువారందరూ సతతం స్మరించుకుంటూ, భారత స్వాతంత్ర్య సమరవీరుల చరిత్ర గ్రంథాల్లో రామచంద్రయ్యకు సరైన స్థానం కల్పించే అవసరం తెలుగుజాతికి ఎంతైనా వుంది. ఆనాడు యిటువంటి వీరులు వెలిగించిన రుధిర రక్త జ్యోతుల కాంతులలోనే, తదుపరి తెలుగునాట ఆంగ్లేయులపై స్వాతంత్ర్య పోరాటాలు జరిగి, భారత స్వాతంత్ర్య సమరంలో తెలుగుజాతి వెనుకంజ వేయలేదని ఋజువుచేసింది. తెలుగుజాతి బ్రతికి వున్నంతవరకూ ఈ అమరవీరుని చరిత్ర ఉత్సాహాన్నీ, ఉత్తేజాన్నీ కూర్చుతూ నిలచి వుంటుంది.

## శ్రీకాకుళం జిల్లాలో...

(38వ పేజీ నుండి)

చిన్న తరహా పరిశ్రమల నమోదుకు, తద్వారా వాటికి ప్రోత్సాహాల నివ్వడానికి పరిశ్రమలశాఖ ఎన్నో చర్యలు తీసుకొంది.

1973 మార్చి మాసాంతానికి ఈ జిల్లాలో 868 చిన్నతరహా పరిశ్రమల నమోదు చేశారు. 1974 మార్చి మాసాంతానికి మరొక 175 చిన్న పరిశ్రమలు నమోదు చేశారు. ఆగస్టు మాసాంతానికి 32 మొత్తం 1075 నమోదు అయ్యేయి. మరొక 87 చిన్న పరిశ్రమల విభాగాలకు శాశ్వత నమోదు అనుమతి లభించింది. అక్టోబరులో పరిశ్రమల ఉధృత ప్రచారవారం జరిగింది. అందులో మూడు రోజులలో 201 పరిశ్రమలు నమోదు అయ్యేయి.

### ఇప్పుడు ఉన్న పరిశ్రమలు

ప్రస్తుతం జిల్లాలో పనిచేస్తున్న చిన్న తరహా పరిశ్రమల విభాగాలు 465- ఇందులో జీడిపప్పు పరిశ్రమలు 44, ఖండసారి చక్కెర 19, ఉప్పు 45-బియ్యం, నూనె, పిండి మిల్లులు 100, రంపం మిల్లు, కల్లుపనివిభాగాలు 55- ప్రింటింగ్ ప్రెస్‌లు 21, ఆటోమొబైల్ ఇంజనీరింగు-ఇనుము స్టీలు పరిశ్రమలు 62-మంగుళూరు పెంకులు 3-ఇటుక పెంకు పరిశ్రమలు 10-విద్యుత్ అనుబంధ పరిశ్రమలు 15-కాండిల్ తయారీ 6- రెడీమెడ్ దుస్తులు 3-డబ్బాల తయారీ 2-హారాల తయారీ 6 ఉన్నాయి. వీటికి పెట్టుబడి 166.36 లక్షలు-వీటిపై 5571 మంది బ్రతుకుతున్నారు.

ఏగ్రో-బేస్‌డ్, మెరైన్‌బేస్‌డు అటవీ ఆధార పరిశ్రమలు ఖనిజాధార పరిశ్రమలు, లైవ్‌స్టాక్ పరిశ్రమలు, నిత్యావసర వస్తు పరిశ్రమలు. ఎన్నింటికో పరిశ్రమల శాఖ పథకాలు పంపింది.

### కేంద్రసహాయ పరిశ్రమలు

1974 జనవరి నెలలో ఈజిల్లాను సబ్సిడీ పథకంలో చేరుస్తూ ఉత్తరువులు పంపింది. శ్రీకాకుళంమినీ ఎస్టేట్‌లో పేపరు, సంచుల ఫ్యాక్టరీకి, ఆముదాల వలసలో ఐస్ ఫ్యాక్టరీకి, ఇంకా మరికొన్నింటికి కేంద్రం సహాయం చేస్తుంది.

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ సహాయసహకారాలతో చిన్న పరిశ్రమల రంగలో 125 కొత్త పథకాలు ఆమోదం పొందేయి. కొన్ని త్తినిఉత్పకూడా సాధించేయి. పై పథకాలకు 81.98 లక్షలు ఆర్థిక సహాయం లభించింది. ఇందులో 56.313 లక్షలు రాష్ట్ర ఆర్థిక సంస్థ సహాయం చేయగా 20.67 లక్షలు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఋణాలు ఇచ్చింది.

రాష్ట్ర ప్రభుత్వం 12.236 రూపాయలు విలువగల విద్యుత్తు సబ్సిడీ ఇచ్చింది.

ఇవన్నీ ప్రజలు వాడుకొంటే జిల్లా పారిశ్రామికంగా ముందుకు పోతుంది. వనరులు వాడుకోవాలి. పెట్టుబడి వికేంద్రీకృతం చేయాలి. అపుడే ప్రాంతీయాభివృద్ధి సాధ్యం కాగలదు.



సమాజానికి చరిత్ర చెప్పిన పాఠం

# కుటుంబ నియంత్రణ

— శ్రీ రావిపాటి మహానంద

## చిన్న కుటుంబం చింతలు లేని కుటుంబం

మనప్రభుత్వం జనాభా పెరుగుదలను తగ్గించేందుకు కుటుంబనియంత్రణ కార్యక్రమాన్ని చేపట్టి కోట్ల కొలది ధనం ఖర్చుచేస్తోంది. జనాభా పెరుగుదల భారము ప్రభుత్వానికి మాత్రమే పట్టినట్లు భావిస్తున్నారేగాని అసలు పరిమిత కుటుంబము యొక్క లాభాలు తమకున్నట్లు తెలిసికోలేని మూఢత్వంలో వుండి "నారు పోసిన వాడు నీరు పోయడా, పుత్రుడులేనిది పున్నామ నరకం తప్పుతుందా" అనేబూజుపట్టిన సామెతలతో అసలు రహస్యం తెల్సుకోలేకుండావున్నారు. పరిమిత కుటుంబ సమస్యయిప్పటి ప్రభుత్వాల ఆలోచనకు రాకముందే మన పూర్వీకులీ విషయాన్ని అమలు జరిపారు.

లోగడ కలరా, పేగు 'మశూచి', క్షయ మొదలగు జబ్బుల వల్లను, కరువులవల్లా యుద్ధాల వల్లా వేలు లక్షలు జనం చనిపోయారు. ఇలా జనం ఖర్చగుచున్నందున అప్పుడు జనాభా భారము అంతనిపించలేదు. పైగా మనదేశంలో క్రీస్తుపుట్టుకపుడు 10,14 కోట్లు జనాభా వుండెను. ఈ జనాభా 165 సం॥ ఆఖరుకు అలానే నిలకడగా వుందికాని 1891 లో 236 మిలియన్లు 1921 లో 428 మిలియను, 1951 లో 361 మిలియన్లు అనగా 1921. ముందు 30 సంవత్సరాలలో జనాభా 5% పెరిగితే 1921–51 మధ్య 45% పెరిగి 1961 వచ్చేవరకు 439 మిలియన్లు అయి యీ ఒక్క పది సంవత్సరాలలో 11.5% పెరిగింది. ఇప్పుడు 548 మిలియన్లు అయింది. అదేవిధంగా పుట్టుకలు మరణాలు పరిశీలించండి.

| | పుట్టుకలు | మరణాలు |
|---|---|---|
| 1881–91 | 48.9 | 41.3 |
| 1891–1901 | 45.8 | 44.3 |
| 1951–61 | 42.0 | 20.5 |
| 1965 | 41.0 | 17.0 |

యీపై అంకెలవల్ల చావులకన్నా పుట్టుకల శాతం ఎక్కువయింది. కారణం ఆరోగ్య పథకాలు అమలుకొచ్చి శిశు తదితర జబ్బులవల్ల మరణాలు చాలాతగ్గాయి. ఇప్పటికే దేశంలో లక్షలాది నిరుద్యోగులు, కోట్ల కొలది విద్యావిహీనులు వైద్యసదుపాయాలు బొత్తిగా లేని 63% మందికి నెలకు రు 12–14 లమధ్య సంపాదన కలిగి ఆర్థిక దుస్థితిలో వుంటే యింకా పెరిగే జనాభాను ఎలా పోషించాలి? పంచభక్ష్యపరమాన్నాలు, మేడల్లో నివాసం ఏర్పరచలేకపోయినా, కనీస జీవితావసరాలైనా సమకూర్చాలి గదా ఎందరో నిరుపేదలు, తల దాచుకొను నెలవులేక ఎండలో, వానలో బజార్ల పేవుమెంట్లపై కాలక్షేపం చేస్తున్నారు ఆటవికులు, తదితర వెనుకబడిన జాతులు యితర కులాలలో కూడా వకపూట తిండి గడవని వారెందరున్నారో గమనించారా ఎంగిలి విస్తళ్లు పారవేస్తే అందులోని మెతుకుల కొరకు కుక్కలు పందులతో పోట్లాడుతూ ఆ మెతుకులతో పొట్టపోసుకొను జనం లేరంటారా మనదేశంలో! వీరంతాయిలా వుండుటకు వీరి ఖర్మ అంటరా? పూర్వజన్మ ఫలితమంటరాలేక ప్రభుత్వంతప్పంటరా? ప్రభుత్వమెవరు? నీవు-నేనుకదా ప్రభుత్వ పాలనలో తప్పులుంటే నిలదీయవచ్చు మనవంతు కార్యక్రమం కుటుంబ శ్రేయస్సుకు తద్వారా దేశశ్రేయస్సుకు – ఏమిచేస్తున్నామని ఒకక్షణ మాలోచించామా! మనం చేయవలసింది చేయలేదు. బుద్ధి జ్ఞానం వున్న మనమే విస్మరించుతుంటే యిక నూటికి 70, 80 గావున్న నిరక్షరాస్యులు, మూఢాచారాలు గల పామరులను ఏమనాలి?

దేశ జనాభాలో 14 సంవత్సరాలలోపువారు 42.3%గాను, 1–5 సంవత్సరాలలోపు వారు 3 78 నుండి 13%గా వున్నారు. 60 సంవత్సరాల పైబడినవారు 10 %లోపు. అనగా 57% జనాభా 43% జనుల ఆర్జనలపై ఆధారపడి వున్నారు. అందువల్ల ప్రజల జీవన పరిస్థితులు మెరుగుపడకపోగా నిత్యదరిద్రంలో వున్నారు. ఈ జనాభా పెరుగుదల అంటే మనకేమీ పట్టినట్లులేదు. శ్రీ కె. శ్రీనివాసన్ (సెంట్రలు రీసర్చి డిప్యూటీ డైరెక్టరు–ఢిల్లీ) చెప్పినట్లు రోజుకు 52,000 మంది చొప్పున నిముషానికి 36 మంది పుడుతున్నారు. యీ పుట్టుక రేటు తగ్గాలి. అందుకే ప్రభుత్వం కోట్లు ఖర్చుచేసి కుటుంబనియంత్రణ పథకాలు చేపట్టి బహుళ ప్రచారానికి పూనుకొంది. జనాభా సేకరణ కౌటిల్యుని అర్థశాస్త్రంలో సూచించబడింది. అక్బరుపాదుషా తన "అయిన్–ఐ–అక్బరీ" పరిపాలనా నివేదికలో జనాభా, పరిశ్రమలు, సంపద వివరాలు సేకరించారు. అలాగే మన ప్రభుత్వం 1881 నుండి జనాభా వివరాల సేకరణకు పూనుకొంది.

మన దేశంలో మొదటిసారిగా ప్రొ॥ రఘునాథ దొండే కార్వే 1925 ప్రాంతంలో సంతాననిరోధ ఆస్పత్రి తెరిచారు. మైసూరు, మద్రాస్ ప్రభుత్వాలు 1930-32 లో తెరిచాయి 1932లో అఖిలభారత మహిళా సభ లక్నోలో స్త్రీ పురుషులకు శాస్త్రీయ సంతాననిరోధ పద్ధతుల ప్రభుత్వ ఆస్పత్రులలో కల్పించాలని తీర్మానించింది 1935లో భారత జాతీయ కాంగ్రెస్ పండిట్ నెహ్రూ అధ్యక్షతను ఏర్పడిన నేషనల్ ప్లానింగ్ కమిటీకూడా కుటుంబనియంత్రణ పథకాన్ని బలపరచింది. 1940 లో శ్రీ పి. యన్. సప్రూ పార్లమెంటులో ఒక అనధికార తీర్మానం ద్వారా దేశంలో కుటుంబనియంత్రణ ఆస్పత్రులు ఏర్పాటు చేయాలని కోరారు ఇండియా గవర్నమెంటు 1943లో హెల్తుసర్వే అండ్ డెవలప్‌మెంటు కమిటీ శ్రీ జోసెఫ్‌బోరు అధ్యక్షతను ఏర్పడి ప్రతి ఆస్పత్రిలో కుటుంబనియంత్రణ క్లినిక్కులు దేశంలోని తల్లి ఆరోగ్యం కాపాడుటకొరకు తెరవాలని సూచించారు. ఆ విధంగా 1949లో బొంబాయిలో మొదటిసారిగా శ్రీమతి ధన్వంతరి రామారావుగారి అధ్యక్షతను కుటుంబనియంత్రణ అసోషియేషను ఏర్పడి దేశమంతా బహుళ ప్రచారం సాగించారు. అందువల్ల సెంట్రల్ గవర్నమెంటువారు మొదటి పంచవర్షప్రణాళికలో 1951 నుండి యీ కార్యక్రమానికి దోహదమిచ్చారు. మూడో ప్రణాళిక నుండి స్టెరిలైజేషను పద్ధతి అనుసరించబడి జయప్రదమగుచున్నది 1972 డిశంబరు నాటికి 11.37 లక్షల స్టెరిలైజేషనులు కాబడినవి కాని లూపుల పద్ధతి ఆశించినంత జయప్రదం కాలేదు ఇటీవలి సంవత్సరాలలో యీ పథకం అమలుకు అత్యుత్తమ కృషిసల్పి 1974 ఏప్రియల్‌కు 35.4 జననాల సంఖ్య తగ్గించింది. ప్రభుత్వం ముఖ్యంగా సంతానోత్పత్తికి అవకాశమున్న యువతీ యువక జంటలు ముందుకు రావాలి. సంతానం పొందుటలో మధ్య వ్యవధి ఎక్కువ కావాలంటే నిరోధులు, లూపులు వాడుకోవచ్చు. సంపూర్ణ నిరోధముకు ఆపరేషన్లు చేయించుకోవచ్చు. ప్రభుత్వం యిలాంటి కేసులకు ధనసహాయంచేసి తోడ్పడుచున్నది. మన ప్రధాని ఇందిరాగాంధీ "మనదేశ సౌభాగ్యం కొరకు యీ పరిమిత కుటుంబ కార్యక్రమాన్ని చేపట్టాము. కాని మనం యీ మాటను ప్రజలకు చెప్పేదానికన్న యీ పరిమిత కుటుంబంవల్ల తల్లి, తన సంతానము ఆరోగ్యం, విద్య, ఆర్థిక సౌష్ఠవం ఎలా పొందేదీ కండ్లకు కట్టినట్లు ప్రదర్శనల ద్వారా చూపితే ఎంతో మంచి"దని చెప్పారు

## ఆయుర్దాయం : సౌభాగ్యం

ఇతర దేశాలలో ఆయుర్దాయము 60,70 సంవత్సరములు వుంటే మన దేశంలో 52 సంవత్సరాలలోపు వుంది ఇతర దేశాల తలసరి ఆదాయము వేలలోవుంటే మనది 325గా వుంది, ఇది నిస్సత్త్వ జీవితంకాదా కష్ట కాలాలు లేక సుఖసంతోషాలకు వీలు కలిగించు పరిమితకుటుంబం కావాలా? మనసారా ప్రేమించు యిల్లాలు అధికసంతానంతో ఆరోగ్యం చెడి-ముఖం ముడతలుపడి నీరసంతో ఏమకన్నా ముందుగా మంచంపాలుకావడం చూచి సహించగలరా ఎవరైనా? మనం భార్యాభర్తలిరువురు తమ కుటుంబం పచ్చపచ్చగా సంతోషముతో కాలం గడుపుతూ దేశసౌభాగ్యానికి తోడ్పడుటకు కుటుంబనియంత్రణ పద్ధతి అనుసరించాలి. ఇది దేశానికి, జాతికి క్రొత్తదికాదు.

ప్రభుత్వం ముఖ్యంగా యీ ప్రచారాన్ని ఎలిమెంటరీస్కూలు విద్యార్థి దశనుండి మారిపోయాలి పయోజనములకు విద్యగరిపేదానికి ప్రాముఖ్యమివ్వాలి. కుటుంబఆర్థికపరిస్థితులు తక్కువఉన్న వారికి యిప్పుడిచ్చుమొత్తంకన్న హెచ్చుమొత్తం యివ్వాలి. గ్రామాదుల్లో బుర్రకథలు, నాటకములు, తోలుబొమ్మలాటల ద్వారా ప్రచారం జరగాలి. యిందుకు 5 6 పంచాయతీ సమితులకొక దళం ఏర్పరచి ప్రదర్శన లిప్పించాలి వీటివల్ల అభివృద్ధి కార్యక్రమాలకు కూడా ప్రజలతోడ్పాటు పొందవచ్చు తక్కువ సంతానం కోరు తల్లిదండ్రులకు పిల్లల చదువుల-ఉద్యోగాలలో ప్రాముఖ్యత యిచ్చి రాయితీలు కలిగించాలి ఇందుకవసరమైతే రాజ్యాంగాన్ని అయినా సవరించాలి. యువజనులు, విద్యార్థులు, బుద్ధిజీవులు, కవులు, గాయకులు యీ కార్యక్రమాన్ని దేశభక్తియుతంగా తీసుకొని కృషి చేయాలి వట్టి మాటలు కట్టిపెట్టి, గట్టిమేల్ తలపెట్టవోయ్ దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్— అనే గురజాడను మరచిపోతారా?

" అత్యవసర పరిస్థితి ప్రకటించకపూర్వం వున్న మనదేశ రాజకీయపు అనారోగ్య పరిస్థితిని, ఏ భాషలోగానీ, ప్రపంచంలోని ఏ దేశంలోగానీ మామూలు పరిస్థితిగా పరిగణించరు. ఆ విధమైన సంపూర్ణ రాజకీయ విశృంఖలత్వ జీవితానికి మళ్ళీ వెళ్ళేది లేదు. "

—ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ

# మహాభారతము

**శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి**

**92**

## యక్షునకు ధర్మరాజునకు సంవాదము

యక్షుడు :- రాజా! నాచు తీగలను, చేపలను తినునట్టి కొంగను నేను నీ తమ్ములు నా చేతనే మరణించిరి నేనడిగిన ప్రశ్నములకు ఉత్తరములను చెప్పక నీరు త్రాగిన యెడల నీవు, ఈ నలుగురితో పాటు ఐదవ వాడవుగా యమ లోకమునకు అతిథివయ్యెదవు సుమా! నాయనా! ఈ సరస్సుపైన పూర్వము నుండియే నాకు అధికారముగలదు నా ప్రశ్నలకు సదుత్తరములను చెప్పకుండ సాహసముచేసి నీరు త్రాగకుము. ఉత్తరములను చెప్పి త్రాగుము కొనిపొమ్ము.

యుధిష్ఠిరుడు :- నీవు రుద్రులలోనో, వసువులలోనో, మరుత్తుల లోనో ప్రధానుడవు అయియుందువుకాని, శకునిమాత్రము కావు. కనుక దేవా! నీ వెవరని అడుగుచున్నాను 'హిమ వంతము, పారియాత్రము, వింధ్యము, మలయము' అను నాలుగు పర్వతములవలె ధీరులై బలపరాక్రమములు గలిగి యున్న యీ నా సోదరులను ఎవడు పడవేసెను? వీరవర్యా! నీవు చాల గొప్ప కార్యమును చేసితివి. దేవ-గంధర్వ-రాక్షసాదులను గూడ యుద్ధమునందు ఓడించగల యీ వీరులను పడగొట్టి మహాద్భుత కార్యమును చేసితివి. నీవు ఏ పని కొరకు ఈ కార్యమును చేసితివో, యిందులో నీ కోరిక యేమో నాకు తెలియకున్నది. ఈ విషయమై నాకు అత్యంత కౌతూహలము, నీ నుండి భయముగూడ కలుగుచున్నది. నా మనస్సు కలతబారెను శిరోబాధ కలుగుచున్నది. భగవన్! ఇక్కడ నిలుచున్న నీ వెవడవో తెలుపుమని అడుగుచున్నాను.

యక్షుడు :- నీకు మంగళమగుగాక. నేను యక్షుడను. జలచర పక్షిని కాను. పరాక్రమవంతులైన నీతమ్ములు నాచేత చంపబడిరి.

"జనమేజయ మహారాజా! ఆ తరువాత ధర్మరాజు, యక్షుడు పలుకుచున్న పరుషమైన అయమంగళ వాక్యమును విని, యక్షుని సమీపమునకుపోయి నిలబడెను. ఆ యక్షుడు, వికటనేత్రములు, తాటి చెట్టువంటి మహాకాయము గలిగి, జ్వలించుచున్న సూర్యునితో సమానుడై, ఎదుర్కొనుటకు వీలుకాని పర్వత సమానుడై ఒక చెట్టుపైన ఉండగా ధర్మరాజు చూచెను. అతడు మేఘ గంభీర నాదముచేత భయపెట్టుచు బిగ్గరగా అరచుచుండెను" ఇట్లుచెప్పి వైశంపాయనుడు ఆ యిరువురకు నిట్లు సంవాదము జరిగెనని చెప్పదొడగెను :-

యక్షుడు :- రాజా! ఈ నీ సోదరులు నేను అనేక పర్యాయములు నివారించుచున్నప్పటికిని బలాత్కారముగా నీరు తీసికొన దలచినారు. అందుచేత వారిని సంహరించినాను రాజా! బ్రతుకదలచు వారీ సరస్సు నీరు త్రాగకూడదు. పూర్వమునుండి నాయధికారమందున్న ఈ కొలనుయందు నీరు త్రాగు సాహసము నీవు చేయకుము. నాప్రశ్నములకు బదులు చెప్పి నీరు త్రాగుము తీసికొనికూడ పొమ్ము.

యుధిష్ఠి:- యక్షా! నీయధికారమందున్న యీ నీటిని నేను తీసుకొన పోవదలచను. నన్ను నేను ప్రశంసించుకొనను ఆత్మ స్తుతి చేసుకొనుటను ఏసత్పురుషులు గూడ ప్రశంసించరు. నాకు తెలిసినంత వరకు నీప్రశ్నలకు ఉత్తరము చెప్పెదను. అడుగుము

## యక్ష ప్రశ్నములు

యక్షుడు:-సూర్యుని ఎవరు ఉదయింపజేయుదురు? అతని చుట్టుఎవరు సంచరించుచుందురు.? అతనిని అస్తమింపజేయువారెవరు? అతడు దేనియందు ప్రతిష్ఠితుడై (నిలచి) యుండును?

యుధిష్ఠి:- పరబ్రహ్మము సూర్యుని ఉదయింపజేయును. అతని చుట్టు దేవతలు తిరుగుచుందురు. అతనిని ధర్మము అస్తమింప జేయును. అతడు సత్యమును ఆధారము చేసికొని యుండును.

యక్షుడు:- మనుష్యుడు శ్రోత్రియుడుగా దేనిచేనగును? దేనిచేత గొప్ప మహిమను పొందగలడు? అతడు దేనిచేత సహాయ వంతుడగును? రాజా! మనుష్యుడు దేనిచేత బుద్ధిమంతుడగును?

యుధిష్ఠి:-వేదాధ్యయనముచేత మనుష్యుడు శ్రోత్రియుడగును, అతడు తపస్సుచేత గొప్ప మహిమను పొందగలడు, ధైర్యము

చేత సహాయవంతుడగుడు వృద్ధులను (బుధులను) సేవించుటచేత బుద్ధిమంతుడగును.

యక్షుడు.— బ్రాహ్మణుడు దేనిచేత దేవత్వమును పొందును ?
అతడు దేనిచేత సత్పురుష ధర్మాచరణుడగును ?
అతనికి దేనివలన మనుష్యత్వము గలుగును ?
అతడు దేనిచేత అసత్పురుష ధర్మాచరణుడగును?

యుధి :—వేదాధ్యయనముచేత బ్రాహ్మణుడు దేవత్వమును పొందును. అతడు తపస్సుచేత సత్పురుష ధర్మాచరణము చేసినవాడగును. మరణముచేత మనుష్యత్వమును పొందును. అతడు నింద చేయుటచేత అసత్పురుష ధర్మాచరణము చేసిన వాడగును

యక్షుడు:—క్షత్రియునకు దేనివలన దేవత్వము కలుగును ? అతడు దేనిచేత సత్పురుష ధర్మాచరణుడగును ? అతనికి దేనివలన మనుష్యత్వము కలుగును ? దేనిచేత నతడు అసత్పురుష ధర్మాచరణుడగును ?

యుధి:—ధనుర్విద్యాధ్యయనము చేత క్షత్రియునకు దేవత్వము కలుగును. అతనికి యజ్ఞముచేత సత్పురుష ధర్మాచరణము కలుగును. భయముచేత మనుష్య భావము కలుగును. అతడు శరణాగతుని విడుచుట చేత అసత్పురుషా చరణము చేసిన వాడగును.

యక్షుడు:—యజ్ఞియ (యజ్ఞసంబంధ)మైన 'సామ' వస్తువేది ? యజువేది ? యజ్ఞమును వరించు వస్తువేది? ఏవస్తువును యజ్ఞము అతిక్రమించదు ?

యుధి:—ప్రాణమే యజ్ఞసంబంధమైన సామము. మనస్సే యజ్ఞియ యజుస్సు. ఋక్కు మాత్రమే యజ్ఞమును వరించును. ఋక్కునే యజ్ఞము అతిక్రమించదు.

యక్షుడు:—భూమిని దున్ను రైతులకు శ్రేష్ఠమేది ? విత్తనము నాటువారికి ఏది శ్రేష్ఠము ? ప్రతిష్ఠావంతులైన ధనికులకు శ్రేష్ఠవస్తువేది ? సంతానోత్పత్తి చేయు వారలకు శ్రేష్ఠమేది ?

యుధి:—రైతులకు వానశ్రేష్ఠము. విత్తువారికి విత్తనము శ్రేష్ఠము. ప్రతిష్ఠపొందిన ధనవంతులకు గోరక్షణము శ్రేష్ఠము. సంతానోత్పత్తి చేయువారికి పుత్రుడు శ్రేష్ఠ వస్తువు.

యక్షుడు:—బుద్ధిమంతుడై, లోకమునందు సన్మానింప బడినవాడై, సర్వప్రాణులకు పూజనీయుడై, ఇంద్రియ విషయములను (పుష్ప-చందన-వనితాదులు) అనుభవించుచు ఊపిరి పీల్చుచున్నవాడైనను నిజముగా మరణించిన వాడైయున్న పురుషుడెవడు ?

యుధి:—ఇన్నియున్నను దేవతలు, అతిథులు, భృత్యులు, పితరులు, తాను—ఈ దుగురిని ఎవడు పోషించదో అట్టివాడు జీవించియుండియు మరణించిన వానితో సముడు (జీవచ్ఛవము).

యక్షుడు:—భూమి కంటే బరువైనదేది ? ఆకాశము కంటె ఎత్తైనదేది ? వాయువు కంటె శీఘ్రగామి యేది ? గడ్డికంటె అసంఖ్యాకమైనదేది ?

యుధి:—భూమికంటె గురుత్వము గలది తల్లి. ఆకాశము కంటె ఉన్నతుడు తండ్రి. వాయువుకంటె అధికశీఘ్రగామిమనస్సు. గడ్డికంటెను అసంఖ్యాకమైనది చింత.

యక్షుడు:—నిద్రించినను కన్నులు తెరచియుండునదేది ? పుట్టియు చేష్టలు చేయనిదేది ? దేనికి హృదయము లేదు? ఏది వేగముచేత వృద్ధిపొందును ?

యుధి:—చేప నిద్రించుచున్నను కన్నులు తెరవదు. పుట్టినదైనను గ్రుడ్డు కదలిక లేకయుండును రాయికి హృదయములేదు వేగముచేత నది వృద్ధిపొందును.

యక్షుడు:—ప్రవాసము (పరదేశము) నందున్న వానికి మిత్రుడెవడు ? ఇంటనున్న వానికి మిత్రుడెవడు ? రోగికి మిత్రుడెవడు ? మరణించుటకు సిద్ధముగా నున్న వానికి మిత్రుడెవడు ?

యుధి:—ప్రవాసికి, తనతో ప్రయాణము చేయువాడు మిత్రుడు. ఇంటియందు భార్య మిత్రురాలు. రోగికి వైద్యుడు మిత్రుడు మరణించుటకు సిద్ధముగా నున్న వానికి దానము మిత్రము.

యక్షుడు:—ప్రపంచము నందున్న సమస్త ప్రాణులకు అతిథి యెవడు ? సనాతన ధర్మమేది ? ఏది అమృతము? ఈ ప్రపంచ మంతయు ఏమి ?

యుధి:—సర్వప్రాణులకు అతిథి అగ్నియగును, ఆవు పాలు అమృతము, నాశము చెందని నిత్య ధర్మమే సనాతన ధర్మము. వాయువే సర్వజగత్తు స్వరూపము.

యక్షుడు:—ఒంటరిగా ఎవడు తిరుగు చున్నాడు ? ఒకసారి పుట్టి మరల ఎవడు పుట్టును ? మంచుకు మందు ఏది ? పెద్ద క్షేత్రము (పాత్రము) ఏది ?

యుధి:—సూర్యుడు ఒంటరిగా తిరుగు చున్నాడు. చంద్రుడు ఒకసారి పుట్టికూడ మరల పుట్టును. మంచుకుమందు అగ్ని. పెద్ద క్షేత్రము (పాత్రము) భూమియగును.

యక్షుడు:—ధర్మమునకు ముఖ్యస్థానమేది? యశస్సునకు ముఖ్యస్థానమేది ? స్వర్గయోగ్యమైన ముఖ్య స్థానమేది ? సుఖమునకు ముఖ్యస్థానమేది ?

యుధి:—ధర్మమునకు ముఖ్యస్థానము సామర్థ్యము. యశస్సునకు ముఖ్యస్థానము దానము. స్వర్గమునకు ముఖ్యస్థానము సత్యము. సుఖమునకు ముఖ్యస్థానము శీలము.

(సశేషం)

# గ్రంథసమీక్ష

## "తెలుగులో సాహిత్యవిమర్శ: అవతరణ-వికాసములు"

రచయిత : డాక్టర్ ఎస్. వి. రామారావు

ప్రచురణ : పసిడి ప్రచురణలు, రాజమొహల్లా, హైదరాబాదు-29.

ప్రాప్తిస్థానం : ఆంధ్రసారస్వత పరిషత్తు, తిలక్‌రోడ్, హైదరాబాదు-1

లేదా-ఆంధ్రప్రదేశ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్, సికిందరాబాదు-3.

(వెల : సాదాప్రతి. రూ. 15. మేలుప్రతి. రు. 20.)

తెలుగులో సాహిత్యవిమర్శ తక్కువగా ఉన్నదనటం కొంత నిజమే కావచ్చుకాని, మనం కుంచించుకు పోవలసినంత తక్కువ మాత్రమేమీకాదు. తెలుగులో సాహిత్య విమర్శనుగూర్చి సుష్ఠుగా పరిశ్రమించి, పరిశోధన చేసి డాక్టర్ ఎస్. వి. రామారావుగారు వెలువరించిన 'తెలుగులో సాహిత్య విమర్శ : అవతరణ-వికాసములు' అన్న గ్రంథం వల్ల ఈ అంశం స్పష్టమవుతుంది. 'ఉస్మానియా విశ్వవిద్యాలయము నందు పి. హెచ్. డి. పట్టమునకు పాత్రమైన సిద్ధాంతగ్రంథ' మిది. అంతేకాదు. తెలుగులో సాహిత్య విమర్శకు సంబంధించి చారిత్రిక ధోరణిలో వెలువడ్డ మొట్టమొదటి గ్రంథంకూడా.

విమర్శ యొక్క సరియయిన రూపం తెలుగులో ఒక్క తెలుగులో అని ఏమిటి, ఏభాషలోనయినా వచన రచనా వికాసంతో ముడివడి ఉంటుంది తెలుగులో వచనరచన బహువిధంగా, వివిధ ప్రక్రియా రూపాల్లో ఒక్కుమ్మడిగా విస్తరించటం ప్రారంభించింది 19వ శతాబ్దం ఉత్తరార్థంలోనే. ఆధునిక తెలుగు సాహిత్యంలో అనేక వచన రచనా ప్రక్రియలకు బీజావాపన చేసిన శ్రీకందుకూరి వీరేశలింగం పంతులుగారే విమర్శకూడా ఒక సరయిన రూపంలో వెలువడటానికిన్ని బీజావాపకులయినారు. అయితే బీజం వెనుకటిదే అన్నది మాత్రం గమనించవలసిన అంశం. వీరేశలింగంగారి కంటె పూర్వం, మరీ పూర్వమూన్నూ తెలుగులో సాహిత్య విమర్శ ఊరికే చెల్లాచెదురుగా వెదజల్ల బడ్డ బీజాల రూపంలో మాత్రమే ఉండింది. అందుకనే-' తొలి తెలుగు విమర్శనా గ్రంథము వెలయించిన కీర్తిమూర్తి ఆయన. పంతులుగారు రచించిన 'విగ్రహ తంత్ర విమర్శనము' 1975-76లో వివేకవర్ధని పత్రిక యందు వెలువడినది. 'ఆంధ్ర వాఙ్మయమున వెలసిన ప్రప్రథమ సాహిత్య విమర్శనా గ్రంథమిదియే' నంటున్నారు పరిశోధకులు డాక్టర్ రామారావుగారు అంటే, తెలుగులో ఆధునికంగా సాహిత్య విమర్శ ప్రారంభమై ఇప్పటి'. 1975 నాటికి కచ్చితంగా వందయేండ్లయింది. (తెలుగులో ఆధునిక విమర్శ శతాబ్దికి సూచకంగా ఈగ్రంథం ఇప్పుడు వెలువడటం కాకతాళీయమే అయినా హర్షింపదగిన అంశం.) నాడు ప్రారంభమయిన (ఆధునిక) తెలుగు సాహిత్య విమర్శ క్రమంగా వికసిస్తూ ఈనాటికి పరిగణింపదగినంత విశాల పరిణాహాన్ని సంతరించు కున్నది, వైవిధ్యాన్ని సమాకలించు కున్నది. ఈ మొత్తం విమర్శ ప్రదర్శనమే రామారావుగారి గ్రంథం.

తాము సేకరించిన సమాచారాన్నంతా రామారావుగారు-' విమర్శనము : విమర్శకుడు; విమర్శన సిద్ధాంతములు; ప్రాచీన యుగము; పూర్వరంగము; అవతరణము; వికాసము; విస్తరణము; ఉపసంహారము' అని ఎనిమిది ప్రకరణాల్లో ప్రస్తుతీకరించి తెలుగులో సాహిత్య విమర్శ' యొక్క 'అవతరణ-వికాసముల'ను నిరూపించినారు. వారు వివరించిన, సమీకరించిన అంశాలను బట్టిచూస్తే 'అవతరణ-వికాస-విస్తరణ'లన్న ప్రకరణాలు మూడూ, మూడు ప్రత్యేక గ్రంథాలుగా రూపొంద దగినంతవిగా కన్పిస్తాయి. నిజానికి రామారావుగారు పరిశోధనకు తీసుకున్న విషయం చాలా విస్తృతమయింది. ఆధునిక కాలంలోనే దాదాపు నూటయాభయి సంవత్సరాల్లోని సమాచారాన్ని ప్రస్తుతీకరించవలసి వచ్చింది. తాము వివిధ పత్రికలనుండి (ఈ పత్రికలను గూర్చిన పరిచయాలు 'విస్తరణ'లో ఉన్నాయి) గ్రంథాల నుండి, గ్రంథాలయాల (అవతారికలో పేర్కొనబడ్డాయి) నుండి, వ్యక్తులనుండి సేకరించిన సమాచారాన్ని ప్రదర్శించటమే ఎక్కువయి, పరిశీలించి, వివరించే అవకాశం తక్కువయి పోయింది. అయినా విమర్శకు ప్రధానులయిన కందుకూరి, కాశీభట్ట, వేదం, కట్టమంచి, విశ్వనాథ, శ్రీ శ్రీ లగురించి, వారి విమర్శాస్వరూపాన్ని గురించీ కొంత వివరంగానూ, మిగిలిన వారినిగూర్చి కొంత సంక్షిప్తంగానూ వివరించబడింది అయితే శ్రీ రాయప్రోలునుగూర్చి పదింటిలో పదకొండోదిగానే అతి క్లుప్తంగా పరిచయం చేయబడింది-(పు. 284) తప్ప. రమ్యాలోక, మాధురీదర్శన, రూపనవనీతాలనుగూర్చి వలసినంత వివరణ లేక పోవటం అసంతృప్తిని కొంత కలిగిస్తుంది. ఆధునిక విమర్శ సాహిత్యంలో రమ్యాలోకాదులది ఒక విలక్షణ ప్రతిపత్తి. రమ్యాలోకాన్ని ఆధునిక కవుల 'మేనిఫెస్టో'గా శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు ('తెలుగు కవితలో క్రొత్త తెన్నులు'-కవికోకిల గ్రంథావళి-4. పు. 168) అభివర్ణించినారు. ఆధునిక కాలంలో మొట్టమొదటి కవితోద్యమమయిన భావ కవితకు రమ్యాలోక, మాధురీ దర్శనాలు ప్రాచీన స్వరూపంగల ఆధునిక లక్షణ గ్రంథాలు.

కేవలం సాహిత్య విమర్శను గూర్చే కాకుండా. తదనుబంధంగా సాగిన భాషా విమర్శలు, కవితా 'వాగ్యుద్ధాలు' వ్యాఖ్యానాలు, టీకలు, పరిశోధన గ్రంథాలు మొదలైన వాటిని గూర్చిన సమాచారం ఈ గ్రంథం సమగ్రం కావటానికి చాలా తోడ్పడింది. విమర్శను గూర్చి ప్రాథమిక పరిచయాన్ని కల్పించటానికి ప్రాచ్య, పాశ్చాత్య విమర్శన సిద్ధాంతాలు రెండవ ప్రకరణంలో వివరించ

ఒస్తాయి అయితే, అంగంలోనూ, గ్రంథం మొత్తంలోనూ కాల క్రమంగా విమర్శధోరణిలో వచ్చిన పరిణామ రీతిని క్రమంగా గుర్తించట౦ జరుగలేదు అట్లా జరిగితే బాగుండేదనిపిస్తుంది క్రమ వికాసాన్ని గూర్చి పాఠకుడికి కొంత స్ఫూర్తి కలిగేది అయితే కావ్యానికి సంబంధించిన వివిధాంగాలను గూర్చి ప్రక్రియలను గూర్చి వెలువడిన విమర్శలు విడివిడిగా వర్ణించబడినయి దీని వల్ల ఇది ఒక 'ఆకార గ్రంథరూపంగ' ఎక్కువగా ఉపయోగిస్తుంది

రామారావుగారు ప్రస్తుతీకరించిన సమాచారం ద్వారా కొన్ని క్రొత్త అంశాలు వెలుగులోకి వచ్చినయి. రామారావుగారు శ్రీ కట్టమంచి వారిలో 'విమర్శ యుగం ప్రారంభమయినట్టుగా వ్రాసినారు కాని అంతకుముందే ఇది ప్రారంభమయి నట్టు వారు 'అమలిన యుగంలో కూర్చిన సమాచారాన్ని బట్టి అనిపిస్తుంది శ్రీ కట్టమంచి వారికన్న ముందే శ్రీ కాశీభట్ట బ్రహ్మయ శాస్త్రిగారు వీరేశలింగంగారి 'వివేక చంద్రికా విమర్శనము 1896లో వెలువడింది రాజశేఖర చరిత్రపై విమర్శనమది. ఇట్లాగే క్రైస్తవ కళాశాల, ప్రెసిడెన్సీ కళాశాలల్లోని సమాజాల్లో 'ఉపన్యాసాలు' వ్రాసిన శ్రీ పి దక్షిణామూర్తి (1892), శ్రీ వెన్నేటి రామచంద్రరావు (1899)ల విమర్శలు గూడా ఈ సందర్భంలో పరిశీలించదగినవి కాగా ఆధునిక తెలుగు విమర్శ ప్రారంభాన్ని గూర్చి మరింత పునరాలోచించ వలసి ఉన్నట్టు కనిపిస్తుంది ఈ విధంగా రామారావుగారి గ్రంథం కొన్ని అంశాల పునరాలోచనకు అవకాశం కల్పిస్తున్నది

మనకు తెలుగులో విమర్శయితే ఉన్నదిగాని, విమర్శను గూర్చి వివరాలను ప్రస్తుతీకరించే గ్రంథం లేదు ఆ లోటును శ్రీరామారావుగారు ఈ గ్రంథంతో తీర్చినారు 'ఆముఖం'లో డాక్టర్ సి నారాయణ రెడ్డిగారు చెప్పినట్లు, వేయి సంవత్సరాల తెలుగు సాహితిని విహంగ దృష్టితో వీక్షించడమే కాకుండా, వలసిన పట్టులను కుశాగ్రబుద్ధితో విశ్లేషించి, ఇంతవరకు పాయలు పాయలుగా ఉన్న విమర్శలను ఒకచోట గుదిగ్రుచ్చి ప్రామాణిక మతితో ఈ సిద్ధాంతగ్రంథాన్ని రచించిన డాక్టర్ రామారావు కృషి ప్రశంసనీయం' తెలుగు విమర్శ స్వరూపాన్ని సాముదాయిక రూపంలో తెలుసు కోవటానికి రామారావుగారి గ్రంథం ఎంతగానో ఉపయోగకరం.

—సంపత్కుమార

## వికాసం

ప్రచురణ : స్పందన సాహితీ సమాఖ్య 23/182 ఇ. మునిసిపల్ క్వార్టర్స్, మచిలీ పట్టణం 521001,

వెల : రెండు రూపాయలు.

వర్తమాన తెలుగు సాహిత్యానికి రెండే రెండు ప్రక్రియలు ఆయువుపట్టువులుగా నిలుస్తున్నవి. మొదటిది వచనకవిత, రెండవది నవల. అయితే వచన కవిత ప్రక్రియ ద్వారా తెలుగు సాహిత్యంలో వెల్లి విరుస్తున్న చైతన్యం వూహించ లేనంత గరిష్ఠ స్థాయికి చేరుకుంటున్నది. ఒక్క మాటలో చెప్పాలంటే అధునిక తెలుగు సారస్వత ప్రపంచానికి వచన కవితయే వూపిరీ, ప్రాణమూనూ —

ఈ కోవకు చెందిన కవితా సంకలనమే మచిలీపట్టణం 'స్పందన సాహితీ సమాఖ్య' వారు, తెలుగు సంస్కృతికి కవితాంజలిగా సమర్పించిన "వికాసం." మొత్తం 14 కవితలున్న ఈ సంపుటిలోరచయితలంతా వర్ధమానులే. ఇటీవలి ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా తెలుగువాడొక్కసారి వెనుదిరిగి చూసుకుని, ఆహా ఇదికదా నా గతిమ్మ' అనుకుని, తృప్తిగా తలాడించాడు ఇందులోని కవితలన్నీ—ఒక్క 'రామెల్'గారి "అసమర్థుడి జీవయాత్ర" తప్ప తెలుగువారి గత వైభవాన్ని చాటిచెప్పేవే రామెల్‌గారి "అసమర్ధుని జీవయాత్ర" మాత్రం ప్రస్తుత ప్రపంచంలో అతి సామాన్యుడి దుర్భర జీవితాన్ని వెలికి తీసి చూపించి, చివరకు "ఇదా నా సంస్కృతికి ప్రతిబింబం" అంటూ ప్రశ్నించింది. సామాజిక స్పృహ కలిగిన కవితల్లో ఇదొక ఆణిముత్యం.

'స్పందనం జీవ లక్షణం

రస స్పందనం సహృదయ లక్షణం' అన్న సూక్తి నాధారంగా గొని—తమ శక్తికి మించి సైతం కార్యక్రమాల్ని నిర్వహిస్తూ పుస్తక ప్రచురణలు సాగిస్తున్న "స్పందన సాహితీ సమాఖ్య" వారి యీ "వికాసం" సాహితీ ప్రియులందరికీ "మనసోల్లాసమే" అనటంలో అతిశయోక్తి లేదు.

—గుత్తికొండ

# జిల్లాల్లో..

## మెదక్ జిల్లా కోహిర్ గ్రామంలో బాలుర హాస్టలుకు ప్రారంభోత్సవం

మెదక్ జిల్లా జహీరాబాద్ సమితిలోని కోహిర్ గ్రామంలో రాష్ట్ర వైద్య, ఆరోగ్యశాఖ మంత్రి శ్రీ కె. రాజమల్లు 75 వేల రూపాయల ఖర్చుతో నిర్మించబడిన ప్రభుత్వ సాంఘిక సంక్షేమ బాలుర వసతి గృహానికి ప్రారంభోత్సవం చేశారు. ఈసందర్భంగా ప్రసంగిస్తూ, ఆయన దేశ సత్వరాభివృద్ధికి ఆటంకాలు కల్పిస్తున్న సంఘ వ్యతిరేక శక్తులను నిర్మూలించాలన్నారు. ఈ సమావేశానికి జిల్లా కలెక్టర్ శ్రీ వి. చాంగ్‌సన్ అధ్యక్షత వహించారు. శాసన సభ్యులు శ్రీ పి. రామచంద్రారెడ్డి, శ్రీ వి. బాగారెడ్డి ప్రసంగించారు.

## విశాఖలో 30 మందికి సైకిల్ రిక్షాల పంపిణీ

విశాఖ జిల్లా షెడ్యూలు కులాల సేవా సహకార సంఘానికి చెందిన 30 మందికి, బ్యాంక్ ఆఫ్ ఇండియా రుణం క్రింద ఇచ్చిన రూ. 36 వేలతో కొనుగోలు చేయబడిన 35 సైకిల్ రిక్షాలను పంచాయతీరాజ్ శాఖ మంత్రి శ్రీ ఎల్. లక్ష్మణదాసు పంపిణీచేశారు. జిల్లా పరిషత్ అధ్యక్షులు శ్రీ సాగి సీతారామరాజు కార్యక్రమానికి అధ్యక్షత వహించారు.

## విశాఖపట్నంలో 5 కొత్త పరిశ్రమలు ప్రారంభం

నవంబరు 10వ తేదీన విశాఖపట్నంలో 5 పరిశ్రమలు ప్రారంభం అయాయి. అందులో మూడు స్వయం ఉపాధి పథకం క్రింద ప్రారంభించారు. ఈ పరిశ్రమల మొత్తం పెట్టుబడి రూ. 14 లక్షలు. పంచాయతీరాజ్ శాఖమంత్రి శ్రీ ఎల్. లక్ష్మణదాసు ఒక అనుబంధ పరిశ్రమను మెటల్ పరిశ్రమను ప్రారంభించారు. ఆయన పంచాయతీరాజ్ రజతోత్సవాల సందర్భంగా మరొక మెటల్ పరిశ్రమను ప్రారంభించారు. రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి ఐరన్ కాస్టింగ్ పరిశ్రమ, ఫార్మాస్యూటికల్ లాబొరేటరీలు ప్రారంభించారు. పారిశ్రామిక ఎస్టేట్‌లో జరిగిన సభలో ప్రసంగిస్తూ, శ్రీ లక్ష్మణదాసు లఘు పరిశ్రమలు ఎక్కువగా స్థాపించాల్సిన ఆవశ్యకతను వివరించారు. మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి పరిశ్రమలు ప్రారంభించిన అనంతరం ప్రసంగిస్తూ, ఆర్థిక, సాంఘిక అభివృద్ధికి యివి ఎంతో అవసరమని అన్నారు. జిల్లా కలెక్టర్ శ్రీ కె. జయభారతరెడ్డి కొత్త పరిశ్రమలు ప్రారంభించడం పట్ల తమ సంతృప్తిని వ్యక్తం చేశారు. ఈ పరిశ్రమలకు ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్, బ్యాంక్ ఆఫ్ ఇండియా, కెనరా బ్యాంక్, బ్యాంక్ ఆఫ్ బరోడా, యూనియన్ బ్యాంకు సహాయం అందజేశాయి.

## నెల్లూరు జిల్లాలో పడుగుపాడు హరిజన వాడ అభివృద్ధి

నెల్లూరు జిల్లాలోని కోవూరు సమితిలో రూ. 18 వేలతో నిర్మించిన పడుగుపాడు ప్రాథమిక పాఠశాల భవనానికి పంచాయతీ రాజ్ శాఖ మంత్రి శ్రీ లక్ష్మణదాసు ప్రారంభోత్సవం చేశారు. కోవూరు స్టేట్‌బ్యాంక్ ఇచ్చిన రుణసహాయంతో రూ. 5 వేల విలువగల 10 కుట్టు యంత్రాలను మంత్రి పంపిణీ చేశారు. జిల్లా పరిషత్ ఛైర్మన్ శ్రీ ఎం. గోపాలకృష్ణారెడ్డి ప్రధాని 20 అంశాల ఆర్థిక కార్యక్రమం ప్రాధాన్యతను వివరించారు.



హైదరాబాద్ జిల్లా ఘట్‌కేసర్‌లో ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారు పది పడకలు గల ఆస్పత్రికి నవంబరు 4న ప్రారంభోత్సవం చేశారు.

## చిత్తూరులో గ్రంథాలయ వారోత్సవాలు

చిత్తూరులో గ్రంథాలయ వారోత్సవాల శాఖ మంత్రి డాక్టర్ సి. హెచ్. దేవానందరావు ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ ఆయన మహిళలలో నిరక్షరాస్యతను తొలగించడానికి గ్రంథాలయాలను ఏర్పాటు చేయాల్సిన ఆవశ్యకత ఉందని ఉద్ఘాటించారు. మంత్రి బాలల దినోత్సవ ప్రాముఖ్యాన్ని వివరించి, సరిగ్గా నవంబరు 14 వ తేదీనే గ్రంథాలయ వారోత్సవాలు ప్రారంభమౌతున్నందుకు సంతోషం వ్యక్తం చేశారు.

జాతీయ గ్రంథాలయాల సంఘం ఉపాధ్యక్షుడు శ్రీ రాఘవ రెడ్డి ప్రసంగిస్తూ, గ్రంథాలయాల పట్ల శ్రద్ధాసక్తులున్న రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటని అన్నారు. జిల్లా కలెక్టర్ శ్రీ వి. రాజాజీ, జిల్లా పరిషత్ అధ్యక్షుడు శ్రీ వి. రామస్వామిరెడ్డి, జిల్లా కేంద్ర గ్రంథాలయం అధ్యక్షుడు శ్రీ చెంచు కృష్ణారెడ్డి ప్రభృతులు ప్రసంగించారు.

## ఒంగోలులో సబ్‌కోర్టు భవనాలకు గవర్నరు శంకుస్థాపన

ఒంగోలులో 9.42 లక్షల వ్యయంతో జిల్లా కోర్టు ఆవరణలో నిర్మించనున్న సబ్‌కోర్టు, మున్సబుకోర్టు భవనాలకు రాష్ట్ర గవర్నర్ శ్రీ ఎస్. ఓబుల్‌రెడ్డి నవంబరు 13వ తేదీన శంకుస్థాపన చేశారు. కోర్టు భవనాలకు, సిబ్బంది గృహవసతికోసం క్వార్టర్స్ నిర్మాణానికి రాష్ట్ర ప్రభుత్వం పది సంవత్సరాలలో 4 కోట్ల రూపాయలు ఖర్చు చేసేందుకు మంజూరు చేసిందని గవర్నర్ తమ ప్రసంగంలో అన్నారు. జిల్లా జడ్జి శ్రీ సి. యల్. నరసింహారావు కార్యక్రమానికి అధ్యక్షత వహించారు.



ఆర్థిక సమాచార శాఖా మాత్యులు శ్రీ పిడతల రంగారెడ్డిగారు నెల్లూరు టౌను హాలులో నవంబరు 14వ తేదీన పంచాయతీ రాజ్యరజతోత్సవాల సందర్భంగా బలహీన వర్గాల వారికి ఇళ్ళస్థలాల పట్టాలు పంచారు.

## తూర్పు గోదావరి జిల్లాలో హరిజనులకు ఇండ్ల స్థలాలు

తూర్పు గోదావరి జిల్లా ఇంజరం గ్రామ హరిజనులకు 26 మందికి పంచాయతీరాజ్ రజతోత్సవాల సందర్భంగా సహకార శాఖ మంత్రి శ్రీ బత్తిన సుబ్బారావు ఇండ్ల స్థలాలకు సంబంధించిన పట్టాలను బహూకరించారు. జిల్లా పరిషత్ ఛైర్మన్ శ్రీ ఎస్. బి. పి. కె. సత్యనారాయణరాజు, ఇంజరం సర్పంచ్ శ్రీ పి. వి. సత్యనారాయణరాజు-ఇన్‌ఛార్జి కలెక్టర్ శ్రీ ఎం. వి. ఎస్. ప్రసాద్, తాళ్ళరేవు సమితి అధ్యక్షుడు శ్రీ మెర్ల వీరయ్య చౌదరి ప్రభృతులు ప్రసంగించారు.

## కృష్ణా జిల్లాలో పేపర్ మిల్లుకు ప్రారంభోత్సవం

కృష్ణా జిల్లా హనుమాన్ జంక్షన్ సమీపంలో శేరీ నరసన్నపాలెంలో 25 లక్షల రూపాయల వ్యయంతో స్థాపించిన శ్రీ కృష్ణా పేపర్ మిల్స్‌కు రాష్ట్ర రోడ్లు, భవనాల శాఖ మంత్రి శ్రీ చనుమోలు వెంకట్రావు నవంబరు 9వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ, ఆయన రాష్ట్రంలో భూసంస్కరణలు అమలు జరుపబడుతున్నందున, పెద్ద భూస్వాములు ధనవంతులు తమ సంపదను చిన్న, పెద్ద పరిశ్రమల స్థాపనకై వినియోగించేందుకై ధైర్యంగా ముందుకు రావాలని విజ్ఞప్తి చేశారు.

## నెల్లూరు జిల్లాలో అభివృద్ధి సౌకర్యాలు

నెల్లూరు జిల్లా పొదలకూరు పంచాయతీ సమితిలోని కోటితీర్థంపై 2 లక్షల రూపాయల వ్యయంతో నిర్మించనున్న వంతెనకు చిన్న తరహా నీటిపారుదల శాఖ మంత్రి శ్రీ ఆనం వెంకటరెడ్డి శంకుస్థాపన చేశారు

అల్లూర్తి వద్ద నల్లవాగుపై నిర్మించనున్న వంతెనకు కూడా ఆయన శంకుస్థాపన చేశారు. ఈ వంతెన నిర్మాణానికి 6 వేల రూపాయలు వ్యయమౌతుంది.

పెదగోపవరంలో 94 వేల 4 వందల రూపాయల వ్యయంతో నిర్మించిన మైనర్ యిరిగేషన్ చెరువుకు ఆయన ప్రారంభోత్సవం చేశారు.

పొదలకూరు సమితిలోని వెనుకబడిన వర్గాల వారికి 179 నివేశన స్థలాలకు పట్టాలను పంపిణీ చేశారు. 28 మందికి భూములు పంపిణీ చేస్తూ, పట్టాలను బహూకరించారు. రైతులకు వ్యవసాయాభివృద్ధికి 5 వేల రూపాయల రుణాలను పంపిణీ చేశారు.

## శ్రీకాకుళంలో రూపాయకి కిలో బియ్యం

శ్రీకాకుళంలో క్రొత్తగా ఏర్పాటయిన మినీ సూపర్ బజార్‌లో కిలో బియ్యాన్ని ఒక రూపాయికి అమ్మే కార్యక్రమానికి మధ్య తరహా నీటిపారుదల శాఖ మంత్రి శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు నవంబరు 8న ప్రారంభించారు. ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ 20 అంశాల ఆర్థిక కార్యక్రమానికి అనుగుణంగా వుండాలని యీ సందర్భంగా ప్రసంగిస్తూ ఆయన అన్నారు.

## ఖమ్మం జిల్లా గిరిజన ప్రాంతాల విద్యుదీకరణ

ఖమ్మంజిల్లాలో రెండు గిరిజన ప్రాంతాల విద్యుదీకరణకు గ్రామీణ విద్యుదీకరణ సంస్థ 76 లక్షల రూపాయల పథకాన్ని మంజూరు చేసింది. దీని వల్ల భద్రాచలం సమీపంలో వున్న వర రామచంద్రాపురం, కోనవరం బ్లాకులకు ప్రయోజనం చేకూరుతుంది. ధర్మవరం, కదిరి, విశాఖపట్నంలకు 31లక్షల రూపాయలు వ్యయం కాగల మరో మూడు పథకాలను కూడా యీసంస్థ మంజూరు చేసింది. ఈనాలుగు పథకాల క్రింద నూటనాలుగు గ్రామాలకు విద్యుదీకరణ సౌకర్యం కలుగ జేస్తారు. 230 పంపు సెట్లకు, 45 లఘు పరిశ్రమలకు విద్యుచ్ఛక్తి సరఫరా కలిగిస్తారు. 550 ఇళ్ళు, వీధి దీపాల కనెక్షన్లు సమకూరుస్తారు. ఈ వివరాలను సంస్థ అధ్యక్షుడు శ్రీ బుర్రా వెంకటప్పయ్య నవంబరు 7వ తేదీన వెల్లడించారు.

## పశ్చిమ గోదావరి జిల్లా తణుకు పాఠశాలలో "పుస్తకాల బ్యాంకు" ప్రారంభోత్సవం

పశ్చిమ గోదావరి జిల్లా తణుకు బాలుర ఉన్నత పాఠశాలలో యిటీవల విద్యాశాఖమంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు "పుస్తకాల బ్యాంకు"ను ప్రారంభించారు. ఈ సందర్భంగా ప్రసంగిస్తూ ప్రతి పాఠశాలలోను పుస్తకాల బ్యాంకు ఆవశ్యకతను వివరించారు. విద్యార్థులు క్రమశిక్షణతో మెలగాలని ఉద్బోధించారు పాఠశాల విద్యార్థిని కుమారి డి. పద్మావతి సభకు అధ్యక్షత వహించారు.

## కొత్తగూడెంలో యువజనోత్సవాలు

ఆంధ్రప్రదేశ్ శాసన సభ స్పీకర్ శ్రీ రేబాల దశరథ రామిరెడ్డి కొత్తగూడెంలో పంచాయతీ రాజ్ రజతోత్సవాల సందర్భంగా నిర్వహింపబడిన బాలల, యువ జనుల ఉత్సవానికి ప్రారంభోత్సవంచేస్తూ, దేశభవిష్యత్తు బాలలపైన, యువజనులపైనా చాలా వరకు ఆధారపడి వున్నదని అన్నారు.

శ్రీ దశరథ రామిరెడ్డి కొత్తగూడెం కాలరీస్ ఆసుపత్రిలో ఔట్ పేషంట్ల బ్లాకుకు శంకుస్థాపన చేశారు.

## నల్గొండ జిల్లా మిర్యాలగూడాలో పంచాయతీ భవన ప్రారంభోత్సవం

నల్గొండ జిల్లా మిర్యాలగూడాలో పంచాయతీ నూతన భవనానికి సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి యిటీవల ప్రారంభోత్సవం చేశారు. ఈ భవన నిర్మాణానికి 90 వేల రూపాయలు ఖర్చయ్యాయి. ఈ సందర్భంగా మాట్లాడుతూ శ్రీ భాట్టం పేదలు, ధనికుల మధ్య అంతరాలను తొలగించి, సాంఘిక న్యాయాన్ని సాధించేందుకు పంచాయతీరాజ్ సంస్థలు కృషిచేయాలని విజ్ఞప్తి చేశారు. ఈ కార్యక్రమానికి జిల్లా కలెక్టర్ శ్రీ పి. పి. విలియమ్స్ అధ్యక్షత వహించారు.

## మహబూబ్‌నగర్ జిల్లా బిజినేపల్లి గొర్ల కాపర్లకు సహాయం

మహబూబ్‌నగర్ జిల్లాలోని అనావృష్టిప్రాంతాలలో సహాయ కార్యక్రమాల పథకం అడ్మినిస్ట్రేటర్ శ్రీ గురుతేజ్‌సింగ్ బిజినేపల్లి బ్లాక్‌లో ఇటీవల 150 మంది గొర్ల కాపరులకు ఒక్కొక్కరికి వెయ్యి రూపాయల చొప్పున యూనియన్ బ్యాంక్ ఋణాలను పంపిణీచేశారు. ఏడాదికి నూటికి నాలుగు శాతం వడ్డీ చొప్పున ఋణాలిచ్చి, హరిజనుల ఉపాధి కల్పన కోసం కిరాణా సైకిల్ షాప్ తెరవడానికి యూనియన్ బ్యాంక్ స్థానిక శాఖ లక్ష రూపాయల మేరకు ఋణాలిచ్చిందని బ్రాంచి మేనేజర్ శ్రీ సుబ్బారావు వివరించారు.



పంచాయతీ రాజ్య రజతోత్సవాల సందర్భంగా అనంతపురంజిల్లా తాడిపత్రిలో మున్సిపల్ వ్యవహారాల శాఖామాత్యులు శ్రీ చల్లా సుబ్బారాయుడుగారు బలహీన వర్గాల వారికి రిక్షాలు బహూకరిస్తున్న దృశ్యం.

## ఒంగోలులో కుష్ఠు రోగులకు గృహాలు ; గవర్నరు సూచన

ఒంగోలులో నవంబరు 12 వ తేదీన గవర్నరు శ్రీ ఎస్ ఓబుల రెడ్డి ప్రభుత్వ ఆసుపత్రిలో మాట్లాడుతూ కుష్ఠురోగులకు ప్రత్యేకంగా గృహాలను నిర్మించేందుకు అధికారులు ప్రజలు రెడ్‌క్రాస్ వారు, స్వచ్ఛంద సంస్థలు పూనుకోవాలనీ, యిందుకు కావలసిన నిధులను సమకూర్చాల్సిందనీ ఉద్బోధించారు. హైదరాబాద్, తిరుపతి మొదలయిన పట్టణాలలో వలెనే ఒంగోలులో కూడా యీ అవకాశం కల్పించాలని ఆయన ప్రతిపాదించారు ఈ విషయంలో దాతలను కదిలించేందుకు డాక్టర్లు చొరవ తీసుకోవాలనీ, ఒంగోలులో వున్న జనాభాతో పోల్చి చూస్తే యిక్కడ వున్న ఆసుపత్రి చిన్నదనీ, దీని అభివృద్ధికి ప్రజలు ముందంజ వేయాలనీ ఆయన సూచించారు. సమావేశానికి జిల్లా కలెక్టరు శ్రీ. కె. స్వామినాథన్ అధ్యక్షత వహించారు. ఆసుపత్రి సూపరింటెండెంట్ శ్రీ కె. వీరభద్రరావు సభికులకు స్వాగతం పలికారు.

## శ్రీకాకుళం జిల్లాలో పేద వర్గాలకు నివేశన స్థలాలు

శ్రీకాకుళం జిల్లాలో పంచాయతీరాజ్ రజతోత్సవాల సందర్భంగా యిటీవల రణస్థలంలో జరిగిన ఒక సభలో ప్రసంగిస్తూ మధ్య తరహా నీటిపారుదల శాఖా మంత్రి శ్రీ వి. కృష్ణమూర్తి నాయుడు ఆంధ్రప్రదేశ్‌లోని పేదలకు సుమారు 50 లక్షల మందికి ఇళ్ల స్థలాలు యిచ్చేందుకు ప్రభుత్వం నిశ్చయించిందని వెల్లడించారు. ఈ సభకు శాసన మండలి సభ్యుడు శ్రీ కొర్ల శ్రీరాములు నాయుడు అధ్యక్షత వహించారు. సమితి అధ్యక్షుడు శ్రీ. జి. సూర్యనారాయణ నాయుడు సభికులకు స్వాగతం చెప్పారు.

## వరంగల్ జిల్లా కొడకండ్లలో స్టేట్ బ్యాంక్

వరంగల్ జిల్లాలోని కొడకండ్లలో స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా శాఖను ఆర్థిక సమాచార శాఖా మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి ప్రారంభించారు. దేశజనాభాలో 80 శాతం మంది గ్రామాలలో నివసిస్తున్న దృష్ట్యా జాతీయ బ్యాంకులు, తదితర బ్యాంకులు తమ శాఖలను గ్రామీణ ప్రాంతాలకు విస్తరింపజేయాలని విజ్ఞప్తి చేశారు. గ్రామాలలోని చిన్నతరహా రైతులు, వ్యవసాయ కూలీలు, వృత్తిపనివారు నిరుద్యోగులయిన యువకులకు బ్యాంకులు ఋణ సహాయం అందజేయాలని ఆయన అన్నారు. రాష్ట్ర పంచాయతీరాజ్ మండలి అధ్యక్షులు శ్రీయతిరాజారావు సభికులకు స్వాగతం పలికారు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఛీఫ్ జనరల్ మేనేజరు శ్రీ నగార్ ప్రాంతీయ మేనేజరు శ్రీ సుబ్బారావు ప్రభృతులు ప్రసంగించారు.



నవంబరు 7 వ తేదీన మహబూబ్‌నగర్‌లో ఆర్థిక సమాచార శాఖామాత్యులు శ్రీ పిడతల రంగారెడ్డిగారు కూరగాయల మార్కెట్‌కు శంకుస్థాపన చేశారు

## హుజూరాబాద్‌లో హరిజన బాలుర హాస్టల్‌కు ప్రారంభోత్సవం

పంచాయతీ రాజ్ రజతోత్సవాల సందర్భంగా రాష్ట్ర వ్యవసాయ, ప్రజాశాఖల మంత్రి శ్రీ జె. చొక్కారావు హుజూరాబాద్‌లో హరిజన బాలుర హాస్టలు ప్రారంభించారు. ఈ హాస్టల్ లక్ష యిరవై వేల రూపాయల ఖర్చుతో నిర్మించారు.

ఇక్కడ జూనియర్ కళాశాలలో జరిగిన ఒక బహిరంగ సభలో ప్రసంగిస్తూ శ్రీ చొక్కారావు ప్రజాసంక్షేమానికై ప్రభుత్వం తల పెట్టిన కార్యక్రమాలను అమలు చేసేందుకు ప్రజలందరూ తోడ్పడాలని విజ్ఞప్తి చేశారు.

ఐదు గ్రామాలకు చెందిన ఇండ్లులేని పేదహరిజనులకు ఆయన మూడువందల ఇండ్ల స్థలాలకు సంబంధించిన పట్టాలను బహూకరించారు.

## వచ్చే మూడేళ్ళలో రాష్ట్రంలోని బస్సురూట్ల జాతీయకరణ

మేడ్చల్‌లో ఐదున్నర ఎకరాల స్థలంలో రెండు లక్షల రూపాయల వ్యయంతో రోడ్డు రవాణా సంస్థవారు నిర్మిస్తున్న బస్‌స్టేషన్‌కు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, నవంబరు 14 వ తేదీన శంకుస్థాపన చేశారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ ముఖ్యమంత్రి ప్రజల ఆకాంక్షలను, ఆశయాలకు అనుకూలంగా మరింత కృషిచేయాలని ఆర్. టి.సి.కి విజ్ఞప్తి చేశారు వచ్చే మూడేళ్ళ కాలంలో రాష్ట్రంలోని బస్సురూట్లన్నిటినీ జాతీయం చేస్తామని ప్రకటించారు.

## విజయనగరంలో "ఇందిరా ప్రియదర్శిని" మహిళా సూపర్‌బజార్

సహకార సంఘాల రిజిస్ట్రారు శ్రీ టి. లక్ష్మారెడ్డి నవంబరు 12 వ తేదీన విజయనగరంలో "ఇందిరా ప్రియదర్శిని" మహిళా సూపర్‌బజార్‌ను ప్రారంభించారు. రాష్ట్రంలో ఏర్పాటు చేసిన మహిళా సూపర్ బజార్లలో యిది ఏడవ సూపర్ బజార్ అనీ, డిసెంబరు నెలాఖరులోగా మరి నాలుగు మహిళా సూపర్ బజార్లను విశాఖపట్నం, కాకినాడ, గుంటూరు, వరంగల్ పట్టణాలలో ప్రారంభించగలమనీ శ్రీ లక్ష్మారెడ్డి అన్నారు.

## ఖమ్మం జిల్లా నెల్లిపాకలో పాఠశాల భవనానికి శంకు స్థాపన

నవంబరు 13 వ తేదీన రాష్ట్ర దేవాదాయశాఖ మంత్రి శ్రీ సాగి సూర్యనారాయణ రాజు నెల్లిపాకలో 30 వేల రూపాయలు వ్యయమయ్యే అప్పర్ ప్రైమరీ పాఠశాల భవనానికి శంకు స్థాపన చేశారు. ఈ సందర్భంగా ప్రసంగిస్తూ ఆయన ప్రధాని యిరవై సూత్రాల ఆర్థిక కార్యక్రమానికి ప్రజలు మద్దతు నివ్వాలని విజ్ఞప్తి చేశారు. భద్రాచలం తాలూకాలోని వివిధ గ్రామాల హరిజనులకు, గిరిజనులకు ఇళ్ళ స్థలాల పట్టాలను పంపిణీ చేశారు. పాడిపశువుల కొనుగోలు కోసం 65 మందికి 51 వేల రూపాయలు ఋణాలను పంపిణీ చేశారు.

## నిజామాబాదు జిల్లా బీబీపేటలో గ్రంథాలయం

నిజామాబాదు జిల్లా గ్రంథాలయ సంస్థ వారు తమ ఇరవై అయిదవ శాఖను కామారెడ్డి తాలూకాలోని బీబీపేటలో స్థాపించారు. దీనిని దోమకొండ పంచాయతీ సమితి అధ్యక్షుడు శ్రీ వి. గోపాలరావు ప్రారంభించారు. ఈ సందర్భంగా జరిగిన సమావేశానికి జిల్లా గ్రంథాలయ సంస్థ అధ్యక్షుడు శ్రీ బి. గంగారాం అధ్యక్షత వహించారు.

## కర్నూలు జిల్లా ఆదోనిలో ఇందిరానగర్ కాలనీ

పంచాయతీరాజ్ రజతోత్సవాల సందర్భంగా కర్నూలు జిల్లాలోని వివిధ ప్రాంతాలలో పర్యటిస్తూ మంత్రి శ్రీ డి. మునుస్వామి ఆదోనిలో నాల్గవ తరగతి ఉద్యోగులకు సంబంధించిన ఇందిరానగర్ కాలనీకి ప్రారంభోత్సవం చేశారు. ఈ కాలనీలో నిర్మించే 126 గృహాలకు సరిపోయిన స్థలాన్ని 50 వేల రూపాయలకు సేకరించారు. ఎమ్మిగనూరు, ఆలూరు, పేసరబండ, పెద్ద తుంబళం, చిన్నతుంబళం, హెబ్బాటం, చిన్న కొత్తూరు గ్రామాలలో నిర్వహించిన పంచాయతీరాజ్ రజతోత్సవాలకు మంత్రి శ్రీ డి. మునుస్వామి హాజరయ్యారు.

## మాధవరం పంచాయతీ భవనానికి శంకుస్థాపన

మాధవరం గ్రామ పంచాయతీ కార్యాలయ భవనాలకు తుమ్మగింజల వండ్లపల్లిలో నవంబరు 8 వ తేదీన సమితి అధ్యక్షుడు శ్రీ ఎ. కొండారెడ్డి శంకుస్థాపన చేశారు. రాయచోటి సమితి ఉపాధ్యక్షుడు, గ్రామ పంచాయతీ అధ్యక్షుడు శ్రీ ఎస్. రామచంద్రారెడ్డి యీ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. రాయచోటి తాలూకా పౌర సంబంధాల అధికారి శ్రీ జి. రామచంద్రారెడ్డి వందన సమర్పణ చేశారు.

## కోట సమితిలో హరిజనులకు ఇళ్ళ స్థలాలు

పంచాయతీరాజ్ రజతోత్సవాల సందర్భంగా కోట సమితిలో నవంబరు 14 వ తేదీన రాష్ట్ర మంత్రి శ్రీ ఆనం వెంకటరెడ్డి ప్రసంగిస్తూ ప్రధాని 20 సూత్రాల పథకాన్ని ప్రజలు సమర్థించాలని విజ్ఞప్తి చేశారు. వాకాడు, బిల్లవోలు, చింతవరం, ఈరూరు, ముక్కొడిపాలెం, రెట్టపల్లి మొదలగు గ్రామాలకు చెందిన హరిజన గిరిజనులకు శ్రీ వెంకటరెడ్డి 650 యిళ్ల స్థలాల పట్టాలను పంపిణీ చేశారు. శాసన సభ్యుడు శ్రీ ఎన్. శ్రీనివాసులురెడ్డి సభకు అధ్యక్షత వహించారు. కోట సమితి అధ్యక్షుడు శ్రీ ఎన్. చంద్రశేఖర రెడ్డి మంత్రికి స్వాగతం పలికారు.

## చక్రంపేట ప్రాథమికోన్నత పాఠశాల నూతన భవన ప్రారంభోత్సవం

11 వేల రూపాయల ఖర్చుతో ప్రభుత్వంవారు నిర్మించిన చక్రంపేట ప్రాథమికోన్నత పాఠశాల నూతన భవనమునకు నవంబరు 7 న రాజంపేట పంచాయతీ సమితి అధ్యక్షులు శ్రీ కె. మారారెడ్డి ప్రారంభోత్సవము గావించారు. ఈ సందర్భంగా ఏర్పాటైన సభకు శ్రీ కె. మారారెడ్డి అధ్యక్షత వహించి మాట్లాడుతూ గడచిన కొద్ది సంవత్సరములలో చక్రంపేట గ్రామమునకు ప్రభుత్వమువారు చేసిన సహాయము గణనీయ మయినదనీ, చక్రంపేట పంచాయతీలోని పల్లెలలో త్రాగునీటి కొరకు 30 బోరుబావులు త్రవ్వించడమైనదనీ, ఇందుకొరకై ప్రభుత్వమునకు ఒక్కొక్క బోరు బావి త్రవ్వుటకు సుమారు 6 వేల రూపాయలు ఖర్చు అయినదనీ ప్రజలుకూడా ముందుకువచ్చి స్తోమతగల రైతులు విరాళము లిచ్చి 10 వేల రూపాయల ప్రోగుచేసిన గ్రామములో ఒక ఉన్నత పాఠశాల స్థాపించుకొన వచ్చుననీ అన్నారు.

బ్లాకు అభివృద్ధి అధికారి శ్రీ కె. శేషగిరిరావు సభలో ఉపన్యసించారు. పంచాయతీ విస్తరణాధికారి శ్రీ రామదాసు పంచాయతీరాజ్ రజతోత్సవముల ప్రాముఖ్యతను వివరించారు. అంతకు మునుపు గ్రామ సర్పంచ్ శ్రీ ఏ. వెంకటయ్య నాయుడు పంచాయతీ నివేదికను సభలో చదివారు. ప్రధానోపాధ్యాయుడు శ్రీ నరసింహారెడ్డి పాఠశాల నివేదికను చదివారు.

శ్రీ కె. మారారెడ్డి బహుమతి ప్రదానము చేశారు. గ్రామాభివృద్ధి అధికారి శ్రీ కృష్ణమూర్తి వందన సమర్పణ చేశారు.



నవంబరు 14వ తేదీన బాలల దినోత్సవం సందర్భంగా నెల్లూరులో వి. ఆర్. హైస్కూలు మైదానంలో ఆర్థిక, సమాచార శాఖామాత్యులు శ్రీ పిడతల రంగారెడ్డి వందన స్వీకారము చేస్తున్న దృశ్యం.

## ఐక్యరాజ్యసమితి దినోత్సవం

ఉదయగిరిలో ఐక్యరాజ్య సమితి దినోత్సవం అక్టోబరు 24 న ఎ. ఆర్.ఆర్. ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాలు శ్రీ కె. నరసింహయ్య అధ్యక్షతన జరిగింది.

లెక్చరర్లు సర్వ శ్రీ ఆర్. వి. రామాంజనేయులు, సుబ్రమణ్యం గార్లు ఐక్యరాజ్య సమితి పుట్టుపూర్వోత్తరాలు, దాని అంశములు, పనులు గూర్చి కూలంకషముగా విద్యార్థుల నుద్దేశించి మాట్లాడారు.

విద్యార్థులు శ్రీయుతులుఅబ్దుల్ అజీజ్, ఎస్. వెంకటేశ్వర్లు, కె. పిచ్చయ్య కె. వి.ఎ. అల్లాబక్ష, కె. వెంకటస్వామి కూడా మాట్లాడారు.

## నిడదవోలు విద్యార్థుల సేవా సమితి కార్యక్రమాలు

స్థానిక యస్. వి. ఆర్. కె. ప్రభుత్వ డిగ్రీ కళాశాల జాతీయ సేవా పథకము ఆధ్వర్యాన సమిశ్ర గూడెం పంచాయతీ సమితిక

చెందిన బ్రాహ్మణగూడెం గ్రామంలో 20-10-75 నుండి 29-01-75 పదిరోజుల పాటు శిక్షణ శిబిరాన్ని నిర్వహించారు. కాలేజి కమిటీ అధ్యక్షులు శ్రీ సుంకవల్లి వెంకటరత్నం ప్రారంభోత్సవం గావించారు. గ్రామ సర్పంచ్ శ్రీ గారపాటి మునేశ్వరరావు అధ్యక్షత వహించారు. యువజన సంఘం కార్యదర్శి శ్రీ గద్దం వెంకటేశ్వరరావు సభికులకు స్వాగతం పలికారు. కళాశాల అధ్యాపకులు శ్రీ వి. ఎస్. ప్రకాశరావు ఉపన్యసించారు.

పది రోజుల పాటు జరిగిన శిబిరంలో 65 మంది విద్యార్థులు, 35 మంది యువజనులు పాల్గొని బ్రాహ్మణ గూడెం గ్రామంలో మంచి నీటి రేవువద్ద, కొన్ని మురికి వాడలలో సుమారు రెండు ఫర్లాంగుల మేరకు రోడ్డు నిర్మించారు. గ్రామములోని వీధులు, మురుగు కాల్వల పారి శుధ్య పథకాన్ని చేపట్టి నిర్వహించారు. చెరువు గట్టుపై 65 కొబ్బరి చెట్లు నాటారు. ప్రజారోగ్యశాఖాధికారులతో సహకరించి గ్రామస్థులకు టీకాలు వేయించారు. కుటుంబ నియంత్రణ, ప్రధాని 20 అంశాల ఆర్థిక సూత్రాల ప్రాముఖ్యాన్ని గ్రామస్థులకు వివరించారు.



అనంతపురం జిల్లా కదిరి తాలూకా తలుపుల గ్రామంలో ఉన్నత పాఠశాల భవననిర్మాణానికి ప్రజలిచ్చిన విరాళాలు రూ. 42,250 చెక్కును ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు స్వీకరించి జిల్లాపరిషత్ ఛైర్‌మెన్ శ్రీ. జి. నరసిరెడ్డిగారికి అందజేశారు.

ఆఖరి రోజున జరిగిన సభలో శ్రీ గారపాటి సుబ్బారావు సేవాసమితి సభ్యుల కార్య క్రమాలను కొనియాడారు. ప్రాజెక్ట్ మాస్టర్ శ్రీ మైనేని శ్రీనివాసరావు కార్యక్రమాల అమలులో గ్రామస్థుల సహకారానికి కృతజ్ఞతలు తెలియ జేశారు.

నిజామాబాదులో ఆంధ్ర ప్రదేశ్ అవతరణ దినోత్సవ సందర్భంగా నవంబరు 2న జిల్లా కేంద్ర గ్రంథాలయములో స్థానిక కళాశాల విద్యార్థులకు "20 వ శతాబ్దములో తెలుగు సాహిత్యానికి సేవ చేసిన పెద్దలు" అను విషయముపై వక్తృత్వ పోటీలు శ్రీ తిరువగిరి వరసింహాలు గారి అధ్యక్షతన జరిగాయి. పోటీలో పాల్గొన్న 20 మంది విద్యార్థులలో కుమారి వెంకట లక్ష్మి (మహిళా కళాశాల) శ్రీ నాయుడు హనుమంతరావు (గిరిరాజ్ కళాశాల) శ్రీ టి. సాయులు (గిరిరాజ్ కళాశాల) విద్యార్థులు వరుసగా ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు పొందారు. ప్రత్యేక బహుమతి శ్రీహరి గారికి లభించింది.

సాయంత్రం నిజామాబాదు జిల్లా తెలుగు రచయితల సంఘం వారి సౌజన్యంతో "తెలుగు వెలుగు" అనే విషయముపై కవి సమ్మేళనము శ్రీ యు. నాగేశ్వర శర్మగారి అధ్యక్షతన జరిగింది. స్థానిక ప్రముఖ రచయితలగు శ్రీ యుతులు వంబి శ్రీధరరావు, గుండి లింబాద్రి, బహద్దూరి నరసింహం, ఎ. సూర్య ప్రకాశ్, కె. లక్ష్మీనరసింహా చార్యులు, టి. నరసింహాలు, కుమారి కమలాదేవి. శ్రీకంఠం స్వరాజ్య లక్ష్మి, చిరంజీవి వివేకానంద మొదలగు వారనేకులు స్వీయ కవితా గానము గావించారు. శ్రీ కొర్లిమర్ల నాగేశ్వరరావు స్వాగతము చెప్పగా శ్రీటి. వి. వెంకట్రామయ్యగారు వందన సమర్పణగావించారు.

## ఆంధ్ర ప్రదేశ్ అవతరణోత్సవాలు

ఆంధ్ర ప్రదేశ్ అవతరణ 20 వ వార్షికోత్సవాలు, పంచాయతీ రాజ్ రజతోత్సవాలు చిత్తూరు పట్టణంలోని శ్రీరామ విలాస సభా ఆవరణలో నిన్న ఆనందోత్సాహాల మధ్య జయావహంగా జరిగాయి.

సాంప్రదాయకంగా దైవ ప్రార్థన, దేశభక్తి గీతము "మా తెలుగు తల్లికి మల్లెపూదండ" గేయాన్ని నటుడు శ్రీ పులికంటి కృష్ణారెడ్డి తన శ్రావ్యమైన కంఠముతో పాడి ఆహూతుల నానంద పరిచాడు. "మా తెలుగు తల్లికి మల్లె పూదండ" రచయిత శ్రీ శంకరాం బాడి సుందరాచారి చిత్తూరు మండలీయుడు. వారిని ఈ వేడుకల సందర్భంగా ప్రభుత్వ పక్షాన నూట పదహార్లు, శాలువతో గౌరవ పురస్సరంగా సన్మానించారు. సన్మానికి ఉత్సాహ పూరితుడైన శ్రీ సుందరాచారి "మాదేశము, మహామంచి దేశము, బహు గొప్ప దేశము" అంటూ దేశ ఔన్నత్యాన్ని చాటే తాను వ్రాసిన గీతాన్ని ఆలపించారు. ప్రేక్షకుల కోరికపై "మాతెలుగు తల్లికి మల్లెపూదండ" పాటను తానే పాడి వినిపించారు.

జిల్లా పరిషత్ అధ్యక్షులు శ్రీ వారణాశి రామస్వామి రెడ్డి సభకధ్యక్షత వహిస్తూ, ప్రజా స్వామ్యవ్యవస్థను బలపరిచేందుకు అందుకు పునాది అయిన పంచాయతీరాజ్ వ్యవస్థలను ద్విగుణీ కృత ఉత్సాహముతో నిర్వహించాల్సిన అవసరం ఎంతైనా ఉందన్నారు. ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధీ గారి 20 సూత్రాల ఆర్థిక కార్య క్రమము అత్యయిక పరిస్థితి వలన దేశంలో నేడు అన్ని రంగాలలో క్రమ శిక్షణ నెలకొన్నదన్ని, దేశాభ్యుదయం దృష్ట్యా ఈ అత్యయిక పరిస్థితి ఇంకా కొంత కాలం కొనసాగించాలని తన ఆకాంక్షను వెలిబుచ్చారు.

## అప్పర్ ప్రాథమిక పాఠశాలలో హెడ్‌మాష్టర్లుగా శిక్షణ పొందిన పట్టభద్రులు

విద్యాశాఖ మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు, నవంబరు 16న పశ్చిమ గోదావరి జిల్లా పోడూరు పంచాయతీ సమి

తిలో ప్రసంగిస్తూ రాష్ట్రంలో త్వరలోనే అప్పర్ ప్రాథమిక పాఠశాలలో శిక్షణ పొందిన పట్టభద్రులను హెడ్‌మాష్టర్లుగా నియమిస్తారని ప్రకటించారు. పౌష్టిక ఆహారాన్ని తీసుకునే అలవాటును అలవర్చుకోవాలని మహిళలకు ఆయన విజ్ఞప్తి చేశారు. ఈ బ్లాకులో 50 మహిళా మండలులను విజయవంతంగా నిర్వహిస్తున్నందుకు ఆయన సంతృప్తిని వెల్లడించారు. సమాజాభివృద్ధి కార్యక్రమాలలో మహిళలు పాల్గొనడం దేశ ప్రగతికి చిహ్నమని ఆయన అన్నారు. వెనుకబడిన వర్గాలకు రూ. 80 వేలు విలువ చేసే పాడిపశువులను మంత్రి పంపిణీ చేశారు.

జిన్నూరులో పంచాయతీ భవనానికి మంత్రి ప్రారంభోత్సవం చేశారు. పండిత విల్లూరులో అంబర్ చరఖా కేంద్రం, ప్రాథమిక పాఠశాల భవనాలకు ఆయన ప్రారంభోత్సవం చేశారు. ప్రజలు స్వయంగా రూ. 40వేల విలువతో నిర్మించిన పంచాయతీ భవనానికి ఆయన ప్రారంభోత్సవం చేశారు. ఈ పంచాయతీ భవనాన్ని వారు 3నెలల్లో నిర్మించినారు పాఠశాల భవనానికి కూడా ఆయన శంకుస్థాపన చేశారు.

అంతకు ముందు రేలంగిలో ప్రాథమిక పాఠశాల భవనానికి మంత్రి ప్రారంభోత్సవం చేస్తూ తల్లిదండ్రులు తమ పిల్లల విద్యా విషయంలో తగిన శ్రద్ధవహించాలని విజ్ఞప్తి చేశారు.

పెనుమంట్రలో బాల్వాడీకి ప్రారంభోత్సవం చేశారు. ఆ తర్వాత పంచాయతీ సమితి సమావేశంలో ప్రసంగించారు. వెనుకబడిన వర్గాలకు పాడిపశువులు, కుట్టుయంత్రాలు పంపిణీ చేశారు. అలమూరులో పశువుల ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేశారు. పాల దిగుబడి పోటీలో విజేతలకు బహుమతులు యిచ్చారు. మార్టేరులో పంచాయతీ భవనానికి శంకుస్థాపన చేశారు. నెగ్గిపూడిలో ప్రాథమిక పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం చేశారు.

## హరిజనవాడలో విద్యుచ్ఛక్తి సరఫరాకు ప్రారంభోత్సవం

హరిజన సంక్షేమ శాఖ మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి, నవంబరు 16న కడప జిల్లా ప్రొద్దుటూరు పంచాయతీ సమితి దువ్వూరులోని హరిజన వాడలో విద్యుచ్ఛక్తి సరఫరాకు ప్రారంభోత్సవం చేశారు. ఆ తర్వాత ఆయన బహిరంగ సభలో ప్రసంగిస్తూ గ్రామంలో భాగమైన హరిజనవాడలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేసే పథకాన్ని చేర్చుకోని పక్షంలో యిక ముందు గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి పథకాలను మంజూరు చేయరాదని ప్రభుత్వం నిర్ణయించినట్లు వెల్లడించారు. హరిజనులతో పాటు వెనుకబడిన వర్గాలకు కూడా ఇండ్లస్థలాలను పంపిణీ చేయాలని ఆయన అన్నారు. అన్నికులాల వర్గాలవారు కలిసికట్టుగా నివసించని పక్షంలో గ్రామాలలో శాంతి సుహృద్భావం నెలకొనదని ఆయన అన్నారు. 20సూత్రాల ఆర్థిక కార్యక్రమంలో హరిజనులు, వెనుకబడిన తరగతులకు ఇండ్లస్థలాల కేటాయింపు ఒక అంశమని, ఎటువంటి జాప్యం లేకుండా ఈ కార్యక్రమాన్ని అమలు జరపాలని ప్రభుత్వం నిర్ణయించిందని ఆయన అన్నారు. గత 18 సంవత్సరాలలో రూ. 7కోట్ల ఖర్చుతో రెండు లక్షల పట్టాలను పంపిణీ చేశారు ఈ సంవత్సరం హరిజనులకు 4 లక్షల పట్టాలు, వెనుకబడిన వర్గాలకు 1 లక్ష పట్టాలను పంపిణీ చేయాలని ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది. ఈ విధంగా తుదకు రూ. 15కోట్లు ఖర్చుచేస్తారు హరిజనులకు సాంఘికంగా, ఆర్థికంగా వెనుకబడిన వర్గాలవారికి రోడ్లు, నీటి సరఫరా వంటి అన్ని సౌకర్యాలను కల్పిస్తూ తద్వారా తమ ఉనికిని సార్థకం చేసుకోవాలని అన్నారు ఆ తర్వాత మంత్రి కోనగూడూరు వెళ్లారు. అక్కడ వెనుకబడిన తరగతుల బాలల హాస్టల్ భవనానికి శంకుస్థాపన చేశారు. దీని నిర్మాణానికి రూ. 2.6 లక్షలు ఖర్చు అవుతుందని అంచనా 0 40 సెంట్ల భూమిని ప్రొద్దుటూరుకు చెందిన శ్రీ లేపూరు రామయ్య తన తల్లి శ్రీమతి లేపూరు వెంగమ్మ స్మారక చిహ్నంగా విరాళంగా యిచ్చారు. ఈ సందర్భంగా మంత్రి ప్రసంగిస్తూ 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమాన్ని అమలు జరపవలసిన అవసరాన్ని గూర్చి వివరించారు.



నెల్లూరులో నవంబరు 19వ తేదీన గ్రంథాలయ వారోత్సవాల సందర్భంగా కోస్తా ప్రాంతీయ అభివృద్ధి సంఘ అధ్యక్షురాలు శ్రీమతి భవనం జయప్రద గారు డి. పద్మావతమ్మ మహిళా గ్రంథాలయానికి ప్రారంభోత్సవం చేశారు. శ్రీమతి ఆనం వెంకటరమణమ్మ గారు అధ్యక్షత వహించారు.

## సంగారెడ్డిలో బాలల గ్రంథాలయం

మెదకు జిల్లా కలెక్టరు శ్రీ వి. చాంగ్‌సన్ సంగారెడ్డిలో జిల్లా గ్రంథాలయ సంస్థలో బాలల గ్రంథాలయ విభాగానికి ప్రారంభోత్సవం జరిపిన సందర్భంలో ప్రసంగిస్తూ డిసెంబరు 1 నుంచి రెవిన్యూ శిస్తులను వసూలు చేయడానికి ప్రత్యేక చర్యలు తీసుకోవడం జరుగుతుందనీ, మెదకు జిల్లాలో లైబ్రరీ పన్నునుంచి డబ్బు సమృద్ధిగా వుండగలదని తమ ఆశాభావం వెల్లడించారు.

జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ పి. నరసింహారెడ్డి, జిల్లా గ్రంథాలయ సంస్థ అధ్యక్షులు శ్రీ యస్. నరసింహారావు, జిల్లా పరిషత్తు కార్యదర్శి శ్రీ హాష్మీ, అడ్వకేటు శ్రీ కె. కృష్ణమాచారి గారలు కూడా ఈ సభలో ప్రసంగించారు.

## పోలవరంలో విద్యాశాఖా మంత్రి

విద్యాశాఖా మంత్రి శ్రీ యం వి. కృష్ణారావు, నవంబరు 1[illegible]న పోలవరంలో జరిగిన బహిరంగ సభలో ప్రసంగిస్తు గోదావరి జిల్లాల విషయంలో సామరస్యంగా ఒప్పందం కుదిరినందువల్ల, ఇప్పుడు ప్రగతిలో వున్న నాగార్జునసాగరు, పోచంపాడు, శ్రీశైలం ప్రాజెక్టులు పూర్తి అయిన తరువాత రామపాద సాగరం ప్రాజెక్టు విషయం పరిశీలించబడుతుందని చెప్పారు. ఉక్కు ఫ్యాక్టరీ నెలకొల్పబడ నున్న విశాఖపట్టణానికి రామపాద సాగరు ప్రాజెక్టు ఉపయోగపడ గలదని ఆయన అన్నారు. సముద్రంలో కలిసి జలాలు వృధా అవుతున్నందువల్ల వాటిని సాధ్యమైనంత మేరకు ఉపయోగించ వలసిన అవసరం ఎంతైనా వుందని ఆయన చెప్పారు.

మంత్రి శంకుస్థాపనలు జరిపిన సందర్భంలో ఉపయోగించ బడిన నాలుగు వెండి వస్తువులను వేలం పాడగా వచ్చిన రూ. 675లు గిరిజన బాలికల సంక్షేమం కోసం విరాళంగా ఇవ్వబడినాయి.



చిన్నతరహా సేద్యపు నీటిపారుదల శాఖామాత్యులు శ్రీ ఆనం వెంకటరెడ్డిగారు నెల్లూరు జిల్లా రాపూర్‌లో పంచాయతీ రాజ్య రజతోత్సవాల సందర్భంగా బలహీన వర్గాల ఇళ్ళస్థలాల పట్టాలు ఇస్తున్న దృశ్యం (నవంబరు ఆరు.)

ఈ సభకు జిల్లా పరిషత్తు తాత్కాలిక అధ్యక్షులు శ్రీ టి. ముసలయ్య అధ్యక్షత వహించారు

రామపాద సాగర్ ప్రాజెక్టు నిర్మాణం అవసరాన్ని గురించి శాసన సభ్యులైన శ్రీయుతులు కణితి రాములు, సాలె వెంకటరావు గారలు ప్రసంగించారు.

మంత్రి రెండు పాఠశాల భవనాలకు మార్కెటు షెడ్లకు శంకుస్థాపన చేశారు. ఆయన బస్సు స్టాండుకు ప్రారంభోత్సవం జరిపారు. తరువాత రామపాద సాగర్ ప్రాజెక్టు స్థలాన్ని సందర్శించారు.

అంతకుముందు మంత్రి గూటాలలో పంచాయతీ ఆఫీసుకు ప్రారంభోత్సవం జరిపారు. పాత పట్టణంలో ప్రాథమిక పాఠశాల భవనానికి శంకుస్థాపన చేశారు.

## బాలల దినోత్సవం

మునిసిపల్ పరిపాలన శాఖా మంత్రి శ్రీ చల్లా సుబ్బారాయుడు బాలల దినోత్సవం సందర్భంగా కడపలో అంధుల పాఠశాలను సందర్శించినపుడు ఆ పాఠశాలకు సొంతంగా వంద రూపాయల విరాళం యిచ్చారు.

శాసన సభ్యులు శ్రీ జి రంగారెడ్డి, జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ ఆర్. సూర్యనారాయణరెడ్డి గారలు కూడా విరాళాలు యిచ్చారు.

మంత్రి బాలలకు 60 దుప్పట్లను పంచిపెట్టారు. స్థానిక వ్యాపారస్తుడు శ్రీ కోట సుబ్బారాయుడు ఈ దుప్పట్లను విరాళంగా ఇచ్చారు. ఈ పాఠశాలకు కావలసిన సహాయం చేయడం జరుగుతుందని మంత్రి హామీ ఇచ్చారు.

జిల్లా కలెక్టరు శ్రీ పి. యల్. సంజీవరెడ్డి ఈ సభకు అధ్యక్షత వహించిన సందర్భంలో ప్రసంగిస్తూ అందులైన బాలురకు సామాన్య విద్యతోపాటు వృత్తి శిక్షణ కూడా ఇవ్వాలని చెప్పారు. ఈ విషయంలో ప్రభుత్వానికి సూచనలు చేయడానికి పథకం తయారు చేయవలసిందని కలెక్టరు జిల్లా విద్యాశాఖాధికారిని కోరారు.

## కడపలో గ్రంథాలయ భవనానికి శంకుస్థాపన

యాత్రా విషయాల శాఖా మంత్రి డా. సి. హెచ్. దేవానందరావు కడపలో రూ. 4 లక్షల ఖర్చుతో నిర్మాణం కానున్న గ్రంథాలయ భవనానికి నవంబరు 14న శంకుస్థాపన చేశారు ఈ సందర్భంలో ఏర్పాటైన సభకు మునిసిపల్ పరిపాలన శాఖా మంత్రి శ్రీ చల్లా సుబ్బారాయుడు అధ్యక్షత వహించారు. ఈ సందర్భంలో డా. దేవానందరావు ప్రసంగిస్తూ రాష్ట్రంలో జిల్లా గ్రంథాలయాలకు ఆధునిక భవనాలు నిర్మించడానికి ప్రభుత్వం ఒక కార్యక్రమాన్ని చేపట్టిందని తెలిపారు. గ్రంథాలయ భవనానికి అనువైన స్థలాన్ని కేటాయించడానికి మునిసిపల్ శాఖా మంత్రి అంగీకరించినందుకు ఆయనను డా. దేవానందరావు అభినందించారు.

## హరిజనవాడకు కమ్యూనిటీ హాలు

చిన్న తరహా నీటిపారుదల శాఖామంత్రి శ్రీ ఆనం వెంకటరెడ్డి నవంబరు 13న కోట పోలూరు హరిజన వాడలో కమ్యూనిటీ హాలుకు ప్రారంభోత్సవం జరిపారు. అదే గ్రామంలో పాఠశాల భవనానికి శంకుస్థాపన చేశారు. నవంబరు 14న క్రొత్తగా నిర్మించబడిన కదిరి హరిజనవాడ యిండ్లకు కూడా ఆయన ప్రారంభోత్సవం జరిపారు. మంత్రి సూళ్ళూరు, అండగుండాల, వేనాడు, కడులూరు, దేగాలపాలెం, కోటపోలూరు గ్రామాలకు చెందిన హరిజన గిరిజనులకు 329 ఇండ్ల స్థలాల పట్టాలు పంపిణీ చేశారు.

ఈ సందర్భంలో ఆనం భక్తవత్సలరెడ్డి ప్రసంగిస్తూ బలహీన వర్గాల వారికి స్థలాలు, భూములు కేటాయించే విషయంలో రెవిన్యూ అధికారులు చురుకుగా పనులు పూర్తి చేయాలని అభ్యర్థించారు.

## కనుపూరు కాలువకు నిధులు

ఆర్థిక, సమాచార శాఖా మంత్రి శ్రీ పి. రంగారెడ్డి నవంబరు 14న నెల్లూరు జిల్లా వెంకటాచలం పంచాయతీ సమితి కార్యాలయంలో అమరజీవి పొట్టి శ్రీరాములు విగ్రహాన్ని ఆవిష్కరిస్తూ, ప్రధాన మంత్రి ప్రకటించిన 20 సూత్రాల కార్యక్రమం అమలులో పంచాయతీ రాజ్ సంస్థలు భాగస్వాములు కావాలని అన్నారు. హరిజనులకు ఇండ్లస్థలాలు, వ్యవసాయానికి బంజరు భూములు కేటాయించబడే విధంగా గ్రామ పంచాయతీలు చూడాలని అన్నారు.

సమితి అధ్యక్షుడు శ్రీ ఆర్. దశరథ రామిరెడ్డి, కనుపూరు కాలువ పథకం సత్వర అమలుకు సంబంధించి అందజేసిన విజ్ఞాపన పత్రానికి మంత్రి సమాధానమిస్తూ అవసరమైన నిధులను అప్పుడే కేటాయించారని ఆలశ్యం లేకుండా ఈ పథకమును అమలును పూర్తి చేస్తారని అన్నారు. పూర్తి కాకుండా మిగిలిపోయిన పనులకు ప్రాధాన్యత ఇచ్చి అమలు జరుపుతారని ఆయన అన్నారు.

పంచాయతీరాజ్ రజతోత్సవాల సందర్భంగా పంచాయతీ సమితి సభ్యుల సమావేశంలోనూ బహిరంగ సభలోనూ మంత్రి ప్రసంగించారు.

శాసన సభ్యుడు శ్రీ వెంకట సుబ్బయ్య ప్రసంగిస్తూ హరిజనులకు ఇండ్లస్థలాలు ఇవ్వడంలో మరింత ఉదారంగా వ్యవహరించాలని అన్నారు.

ఆయిల్ ఇంజనులకు సేద్యపుబావుల త్రవ్వకానికి ఒక హరిజనునికి ముగ్గురు వెనుకబడిన తరగతుల వారికి రూ. 18,000 రుణ మొత్తాని మంత్రి పంపిణీ చేశారు.

## వయోజన విద్యా కేంద్రానికి ప్రారంభోత్సవం

హరిజన సాంఘిక సంక్షేమశాఖా మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి కడప జిల్లా దొరసాని పల్లిలో గత శుక్రవారంనాడు నెహ్రూ యువక కేంద్రం వారు ఏర్పాటు చేసిన వయోజన విద్యా కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

ఈ సందర్భంగా మంత్రి ప్రసంగిస్తూ ప్రభుత్వానికి ప్రజలకు మధ్య అనుసంధానంగా వ్యవహరించాలని యువజనులను ఉద్బోధించారు. జాతి విస్తృత ప్రయోజనాల దృష్ట్యా నిరంతరం కష్టించి పని చేసే దృక్పథాన్ని పెంపొందించుకోవాలని మంత్రి విద్యార్థులకు సలహా యిచ్చారు.

## నంద్యాలంపేట పంచాయతీ కార్యాలయానికి శంకుస్థాపన.

సాంఘిక సంక్షేమశాఖా మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి కడప జిల్లా నంద్యాలం పేటలో పంచాయతీ కార్యాలయానికి నవంబరు 16 న సాయంత్రం శంకుస్థాపన చేశారు.

ఆ తరువాత మంత్రి గాంధీ నగర్‌లో హరిజనవాడకు ప్రారంభోత్సవం చేశారు. రాంపల్లి గ్రామాలకు చెందిన హరిజనులు అగ్నిప్రమాదానికి గురి అయినందువల్ల ఈ ఇండ్లు నిర్మించారు. ప్రస్తుతం 18 కుటుంబాలకు కేటాయించారు. సేద్యం నిమిత్తం 467 ఎకరాల భూమిని హరిజన అభివృద్ధి సహకార సంఘానికి కేటాయించారు. ప్రస్తుతం ఖరీఫ్ పంట కాలంలో 25 ఎకరాల భూమిని సేద్యం చేశారు. కడప జిల్లా అభివృద్ధి సంస్థ ఈ సంఘానికి రూ. 2 లక్షలు అందజేసింది.



ఆర్థిక, సమాచారశాఖా మాత్యులు శ్రీ పిడతల రంగారెడ్డి ప్రకాశం జిల్లా అద్దంకిలో ప్రకాశం ప్రభుత్వ జూనియర్ కళాశాల కో ఆపరేటివ్ స్టోర్సుకు నవంబరు 19 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.

## ఖమ్మంలో బాలల దినోత్సవం

బాలల దినోత్సవం సందర్భంగా ఖమ్మంలో 14 వ తేదీన బ్రహ్మాండమైన బాలల ఊరేగింపునకు, సామూహిక సంస్కృతిక కార్యక్రమాలకు దేవాదాయ శాఖా మంత్రి శ్రీ సాగిసూర్యనారాయణ రాజు హాజరైనారు.

ఈ సందర్భంగా మంత్రి ప్రసంగిస్తూ మన ప్రియతమ నాయకులు కీ. శే. జవహర్లాల్ నెహ్రూ జీవితాన్ని ఆదర్శంగా తీసుకోవాలని బాలలకు ఉద్బోధించారు.

అంతకుముందు మంత్రి కొతుల వీరమ్మ స్మారక బాలికల ఉన్నత పాఠశాలను సందర్శించి పిల్లలకు మధ్యాహ్న భోజనం పంపిణీ చేశారు.

ఆ తరువాత మంత్రి ఖమ్మంలో జిల్లా సహకార కేంద్ర బ్యాంకు ఆవరణలో అఖిల భారత సహకార వారోత్సవానికి ప్రారంభోత్సవం చేశారు. ప్రస్తుత సంవత్సరంలో రూ. 6.10

కోట్ల మేరకు స్వల్పకాలిక వ్యవసాయ రుణాలను పంపిణీ చేసి రికార్డు సృష్టించినందుకు జిల్లా సహకార కేంద్ర బ్యాంకును అభి నందించారు.



సహకార శాఖామాత్యులు శ్రీ బత్తిన సుబ్బారావుగారు నవంబరు 4 న తేదీన మహిళలకు తూర్పు గోదావరి జిల్లా కపిలేశ్వరపురంలో మహిళామండలి సభ్యులకు కుట్టు మిషన్లు యిస్తున్న దృశ్యం

## ఈమనిలో ఇండ్ల స్థలాల పట్టాల పంపిణీ

రోడ్లు, భవనాల శాఖ మంత్రి శ్రీ చనుమోలు వెంకట్రావు గుంటూరు జిల్లా ఈమని పంచాయతీ సమితి సభ్యుల సమావేశంలో ప్రసంగిస్తూ ఒక కోటి రూపాయల ఖర్చుతో ప్రయివేటు స్థలాలను సేకరించి జిల్లాలోని హరిజనులకు ఇండ్ల స్థలాలను పంపిణీ చేస్తారని అన్నారు. రాష్ట్రంలో డిసెంబరు ఆఖరు నాటికి పేద ప్రజలకు బంజరు భూములను పంపిణీ చేయడం జరుగుతుందని, మార్చి ఆఖరు నాటికి భూసంస్కరణల క్రింద లభించే మిగులు భూము లను పంపిణీచేయడం జరుగుతుందని అన్నారు. ఈమని పంచా యతీ సమితిలో 300 హరిజన కుటుంబాలకు ఇండ్ల స్థలాలను మంత్రి పంపిణీ చేశారు. సమితిలోని 5 మహిళా మండలులకు కుట్టు యంత్రాలనుకూడా మంత్రి పంపిణీ చేశారు ఈమని పంచా యతీసమితి అధ్యక్షుడు శ్రీ పి శ్రీరాములు ప్రసంగిస్తూ కొలక లూరులో ఆదర్శమహిళా మండలివారు ఒక మహిళా సూపర్ బజారును ప్రారంభిస్తారని సభ్యులనుండి వాటాధనంగా రూ. 25 000 సేకరించారని అన్నారు. కొలకలూరులో గిరిజన బాలుర హాస్టల్‌కు, ఈమనిలో మహిళామండలికి మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

## యువజన సంక్షేమ వారోత్సవానికి ప్రారంభోత్సవం

తెలంగాణా ప్రణాళిక అభివృద్ధి సంఘం అధ్యక్షులు శ్రీ జి. జగన్నాథరావు నవంబరు 15 న సంగారెడ్డిలో నెహ్రూ యువక కేంద్రంవారు నిర్వహించిన యువజన సంక్షేమ వారానికి ప్రారంభోత్సవం చేశారు.

అంతకుముందు శ్రీ జగన్నాథరావు పాఠ్యప్రణాళిక బ్యాంకుకు ప్రారంభోత్సవం చేశారు. ఈ కార్యక్రమాన్ని చేపట్టినందుకు నిర్వాహకులను, యూత్‌కోఆర్డినేటరును ఆయన అభినందించారు.

## హరిజనవాడకు సామాజిక కేంద్రం

చిన్నతరహా నీటిపారుదల శాఖా మంత్రి శ్రీ ఆనం వెంకట రెడ్డి నెల్లూరు జిల్లా పాపిరెడ్డి పాలెం హరిజనవాడలో పంచాయతీ రాజ్ రజతోత్సవాల సందర్భంగా గత శనివారం సామాజిక కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపిన సందర్భంలో ప్రసంగిస్తూ, ఈ కేంద్రనిర్మాణానికి ఉదారపూర్వకంగా రూ. 12,000 లు విరాళ మిచ్చిన కీ. శే. శ్రీ అల్లూరి వెంకటరమణారెడ్డిగారి వితరణను కొనియాడారు ఆర్థికంగా చితికిపోయిన ప్రజలు ముఖ్యంగా హరిజన గిరిజనులను బాగుపరచడం 20 సూత్రాల ఆర్థిక కార్య క్రమం లక్ష్యమైవుందని ఆయన అన్నారు. ఈ సభకు అధ్యక్షత వహించిన లోకసభ సభ్యులు శ్రీ డి. కామాక్షయ్య ప్రసంగిస్తూ, మార్చి ఆఖరులోగా హరిజనులు, గిరిజనులు, యితర వెనుకబడిన వర్గాలవారికోసం యిండ్ల స్థలాల కేటాయింపు కార్యక్రమం పూర్తి చేయడానికి ప్రభుత్వం అవసరమైన చర్యలు తీసుకొంటుందని చెప్పారు ఈ కేంద్రానికి విరాళమిచ్చిన కీ. శే అల్లూరి వెంకట రమణారెడ్డి చిత్రపటాన్నికూడా ఆయన ఆవిష్కరించారు.

## పశువైద్య ప్రథమ చికిత్సా కేంద్రానికి ప్రారంభోత్సవం

ఆర్థికశాఖామంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి నవంబరు 18 న ఏపురుపాలెంలో పశువైద్య ప్రథమ చికిత్సా కేంద్రానికి ప్రారం భోత్సవం జరుపుతూ ప్రకాశం జిల్లాలో, మహిళా సంక్షేమంకోసం వివిధ పథకాలు చేపట్టడానికి త్వరలో మహిళా సంస్థ ఆరంభించ బడుతుందని చెప్పారు. సభ్యులు వాటా మూల ధనం క్రింద రూ 25,000 సేకరించగలిగినట్లయితే, మహిళా సూపర్‌బజారు ఆరంభించబడుతుందని ఆయన అన్నారు. షెడ్యూలు జాతులకు చెందిన మహిళా మండలి సభ్యురాండ్రకు మేకలు, ఇతర బీద ప్రజలకు పట్టాలు పంపిణీ చేశారు.

జిల్లా కలెక్టరు శ్రీ కె. స్వామినాథన్, గుంటూరు జిల్లా సెంట్రల్ బ్యాంకు అధ్యక్షులు శ్రీ శ్రీరాములు, ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ ప్రధాన కార్యదర్శి శ్రీ ప్రగడ కోటయ్య మంత్రి వెంట వుండినారు.

## రక్షిత నీటి సరఫరా

పంచాయతీ రాజ్ ఉత్సవాల సందర్భంగా పొదిలి తాలూకా తర్లపాడు గ్రామంలో జిల్లా రెవిన్యూ ఆఫీసరు శ్రీ యస్. లక్ష్మీ నారాయణ రూ. 25,000 లు ఖర్చు కాగల రక్షిత నీటి సరఫరా పథకానికి శంకుస్థాపన చేశారు. ఈ పథకం వల్ల నాలుగు వేల మందికి లాభం కలుగుతుంది. ఆయన 965 ఎకరాల మేరకు 281 వ్యవసాయ భూముల పట్టాలు, 128 ఇండ్ల స్థలాల పట్టాలు, 180

మంది బెస్తలకు 92 కె. జిల నైలాను దారం, మార్కాపురం సిండికేట్ బ్యాంకు మంజూరు చేసిన రూ. 27,000 లను 9 మంది కళాకారులకు మహిళా మండలి సభ్యురాండ్రకు రూ. 1,100 లు కూడా పంపిణీ చేశారు ఈ సభకు తర్లపాడు సమితి అధ్యక్షులు శ్రీ జి. వెంకటరెడ్డి అధ్యక్షత వహించారు.

## బంజరు భూముల పంపిణీ

ఆర్థిక శాఖా మంత్రి శ్రీ పి. రంగారెడ్డి నవంబరు 18వ తేదీన వేటపాలెం పంచాయతీ సమితిలో ఏపూరు పాలెం గ్రామంలో శారదా మహిళా మండలి సభ్యురాండ్రకు మేకలు పంచిపెట్టారు ఆయన భూములు లేని బీదవారికి 25 బంజరు భూముల పట్టాలు కూడా పంపిణీ చేశారు. ఈ సందర్భంలో ఆయన ప్రసంగిస్తూ మహిళలు తమ ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచుకోవడానికి ప్రయోజనకరమైన కార్యక్రమాలు చేపట్టుతున్నందుకు మహిళా మండలి సభ్యురాండ్రకు అభినందించారు. మహిళా మండలి భవనం కోసం స్థలం కేటాయించాలనీ, మినీ సూపర్ బజారును ఆరంభించాలని వారు చేసిన అభ్యర్థనను గురించి ప్రస్తావిస్తూ ఈ విషయంలో అవసరమైన చర్య తీసుకోబడుతుందని హామీ యిచ్చారు.

## గవర్నరు ఆసుపత్రి సందర్శన

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ యస్. ఓబులరెడ్డి, డాక్టర్ శ్రీమతి శకుంతలా ఓబులరెడ్డి కడప జిల్లా కలెక్టరు శ్రీ పి. యల్. సంజీవరెడ్డితో కలసి నవంబరు 19 న కడపలో జిల్లా హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రిని సందర్శించి, అన్ని శాఖలను, అన్ని వార్డులను తనిఖీ చేశారు. హాస్పటల్ నిర్మాణాన్ని గూర్చి వివరంగా తెలుసుకొన్నారు,

ఈ సందర్భంగా గవర్నరు ప్రసంగిస్తూ, రాష్ట్రంలోని అన్ని ఆసుపత్రులలో ఆహార విషయంలో చేసే ఖర్చును ఎక్కువ చేస్తూ ప్రభుత్వం అప్పుడే ఉత్తర్వులు జారీ చేసిందని ఇందువల్ల ప్రభుత్వానికి అదనంగా 1 కోటి రూపాయలు ఖర్చు అవుతాయని అన్నారు. అన్ని వార్డులలో రేడియో డిఫ్యూజన్‌ను ఏర్పాటు చేయడానికి తన రాక సందర్భంగా హెడ్‌క్వార్టర్స్ ఆసుపత్రికి రు. 500 లను విరాళంగా యిస్తామని ప్రకటించారు. దీని నిర్మాణానికి రు. 6 వేలు ఖర్చు అవుతుంది. జిల్లా కలెక్టరు శ్రీ జి సంజీవరెడ్డి ప్రసంగిస్తూ దీని నిర్మాణానికి అయ్యే ఖర్చులో మిగతా భాగాన్ని స్థానికంగా విరాళాల రూపంలో వసూలు చేస్తారని అన్నారు.

డాక్టర్ యస్. శకుంతలా ఓబుల రెడ్డి, రోగులకు పండ్లను, పిల్లలకు ఆహారాన్ని పంపిణీ చేశారు

జిల్లా పరిషత్తువారు సమర్పించిన స్వాగత పత్రానికి డా. యస్. ఓబులరెడ్డి సమాధానమిస్తూ, రాష్ట్రంలో వైద్య సౌకర్యాలను పెంపొందించడానికి ప్రత్యేక పన్నును గాని, అమ్మకం పన్నును పెంచడం గాని చేయవలసిన అవసరం వున్నదని అన్నారు. తమ యీ సూచనను ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు పరిశీలిస్తున్నారని, గ్రామీణ ప్రాంతాలలో వైద్య సౌకర్యాలను పెంపొందించడానికి శ్రద్ధ వహిస్తున్నారని ఆయన అన్నారు.

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ చిత్రపటాన్ని, ఆంధ్ర రాష్ట్రంలో ప్రకాశం మంత్రి వర్గంలో మంత్రిగా పనిచేసిన శ్రీ కడప కోటిరెడ్డి చిత్రపటాన్ని గవర్నరు ఆవిష్కరించారు



పశ్చిమ గోదావరి జిల్లాలో కవిటం గ్రామంలో 40,000 రూపాయలు పూర్తి ప్రజావిరాళంతో నిర్మించిన పంచాయతీ కార్యాలయ భవనానికి మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావుగార్లు ప్రారంభోత్సవం చేసిన సందర్భంగా ఏర్పాటుచేయబడిన బహిరంగ సభ.

## ఆర్థికశాఖ మంత్రిచే ఇండ్ల స్థలాల పట్టాల పంపిణీ

ఆర్థిక, సమాచార శాఖ మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి, నవంబరు 18న వేటపాలెం సంచాయతీ సమితిలో 134 మందిహరిజనులకు ఇండ్ల పట్టాలను పంపిణీచేశారు 36 మంది హరిజనులకు పాడిపశువుల కొనుగోలు నిమిత్తం రు 52 వేల మొత్తానికి సంబంధించిన మంజూరీ పత్రాలను కూడా ఆయన పంపిణీచేశారు. 100 మంది మత్స్యపారిశ్రామికులకు రు. 5 వేల విలువచేసే నైలాన్ దారము పంపిణీచేశారు మహిళామండలి సభ్యురాండ్రకు 3 కుట్టు మిషనులను బహూకరించారు. పంచాయతీరాజ్ రజతోత్సవాల సందర్భంగా వేటపాలెం పంచాయతీ సమితి ఏర్పాటు చేసిన బ్రహ్మాండమైన బహిరంగసభలో శ్రీ పి రంగారెడ్డి ప్రసంగిస్తూ విభేదాలను మరచి, సమస్యలను ధైర్యంగా ఎదుర్కొనాలని అన్ని వర్గాల ప్రజలకు విజ్ఞప్తి చేశారు పంచాయతీరాజ్ ఉత్సవాల సందర్భంగా ప్రభుత్వం 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమాన్ని చిత్తశుద్ధితో అమలు జరుపుతుందని ఆయన అన్నారు. ప్రకాశం జిల్లాలో పేద ప్రజలకు 21 వేల బంజరుభూమిని 6 వేల ఇండ్ల స్థలాలను పంపిణీ చేశారు. అంతకుముందు ఆర్థికమంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి వేటపాలెంలోని సరస్వతి సమితి కార్యాలయం వరకు తీసుకొని వెళ్లారు.

## గ్రామపంచాయతీ మార్కెటు భవనానికి ప్రారంభోత్సవం

చేనేత శాఖామంత్రి శ్రీ కె వి. కేశవులు, నవంబరు 18 న వరంగల్ జిల్లా మహబూబాబాదులో 58 వేలతో నిర్మించిన గ్రామ పంచాయతీ మార్కెటు భవనానికి, అన్నపూర్ణ సూపర్ బజారుకు ప్రారంభోత్సవం చేశారు. ఈ సందర్భంగా జరిగిన బహిరంగ సభలో మంత్రి ప్రసంగిస్తూ వెనుకపడిన వర్గాలకు చౌకధరలకు అత్యవసర వస్తువులను సరఫరా చేయడంలో సూపర్‌బజారులు ప్రముఖపాత్ర వహిస్తాయని అన్నారు.



సాంఘిక సంక్షేమశాఖామాత్యులు శ్రీభాట్టం శ్రీరామమూర్తి నల్గొండ జిల్లాలో పంచాయతీరాజ్ రజతోత్సవాల ముగింపు రోజున టగ్ఆఫ్‌వార్ పోటీలో పాల్గొన్న దృశ్యం. ముందున్న వారు పరిషత్ అధ్యక్షుడు శ్రీ కె. రంగారెడ్డి

## అద్దంకిలో ఆర్థిక మంత్రిచే ఆంధ్రబ్యాంకు శాఖకు ప్రారంభోత్సవం

ఆర్థిక శాఖా మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి ప్రకాశం జిల్లా అద్దంకిలో ఆంధ్ర బ్యాంకు శాఖకు ప్రారంభోత్సవం జరుపుతూ సన్నకారు రైతులు, విద్యావంతులైన నిరుద్యోగుల శ్రేయస్సుకై ఉద్దేశించబడిన పథకాలను జాప్యం చేస్తున్నందుకు తమ విచారాన్ని వ్యక్తపరచారు.

ఆంధ్రప్రదేశ్‌లో ఇంకా ఎక్కువగా బ్యాంకులను స్థాపించవలసిన అవసరాన్ని గురించి ప్రస్తావిస్తూ, మన రాష్ట్రంలో 32 వేల మందికి ఒక బ్యాంకు వుంటున్నదనీ, కేరళ, కర్నాటక, తమిళనాడు రాష్ట్రాలలో వరుసగా ప్రతి 16 వేల మందికి, 17 వేల మందికి, 21 వేల మందికి ఒకటి చొప్పున బ్యాంకులు వ్యాపించి వున్నాయని చెప్పారు. రాష్ట్రంలో 982 బ్యాంకు బ్రాంచీలను స్థాపించడానికి ప్రభుత్వం యిదివరకే యోచించిందనీ, వీటిని యెక్కువగా గ్రామీణ ప్రాంతాలలో స్థాపించడానికి శ్రద్ధ తీసుకోవాలనీ, ఈ బ్యాంకులు స్థాపించే విషయంలో జిల్లాల్లో అసమానత వుండరాదనీ, మంత్రి సూచించారు. ప్రకాశం జిల్లాలో 36 వేల మంది జనాభాకు ఒకటి చొప్పున బ్యాంకు ఉన్నదనీ, ఖమ్మం జిల్లాలో ప్రతి 69 వేల మందికి ఒకటి చొప్పున బ్యాంకు ఉన్నదనీ, ఆయన తెలిపారు.

## మహబూబ్‌నగర్‌లో పంచాయతీ రాజ్ రజతోత్సవాలు

మార్కెటింగ్ శాఖా మంత్రి శ్రీ పి. మహేంద్రనాథ్, నవంబరు 15 వ తేదీన కల్వకుర్తిలో పంచాయతీ రాజ్ రజతోత్సవాల సందర్భంగా జరిగిన నిర్మాణ కార్యకర్తల సమావేశంలో ప్రసంగిస్తూ, గ్రామీణాభివృద్ధికి ముఖ్యంగా గ్రామీణ పేద ప్రజల జీవన ప్రమాణాల పెంపుదలకు భూమి, నీరు వంటి సహజ వనరులను పరీక్షించి అభివృద్ధి చేయడానికి అన్ని విధాల కృషి జరుగవలసిన అవసరం ఉన్నదని అన్నారు. ప్రధాన మంత్రి ప్రకటించిన 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమంలో గ్రామీణాభివృద్ధికి ప్రముఖ స్థానం ఇవ్వబడింది.

10,000 లకు పైగా ప్రజలు పాల్గొన్న ఈ సమావేశానికి శ్రీ లింగారెడ్డి అధ్యక్షత వహించారు. స్థానిక పరిపాలన అభివృద్ధికి మూడంతస్థుల పంచాయతీ రాజ్ పద్ధతి అనువైనదని అందరు అంగీకరిస్తున్నారని వక్తలు అభిప్రాయం వ్యక్తంచేశారు.

పంచాయతీ సమితి తరపున 10 కుట్టు యంత్రాలను మంత్రి పంపిణీ చేశారు. గ్రామ సభలో కూడా ఆయన ప్రసంగించారు.

పాలెంలో ఇండియన్ బ్యాంకు అందజేసిన రూ. 1000 మొత్తాన్ని 189 మంది గొర్రెల పెంపకం దార్లకు మంత్రి పంపిణీ చేస్తూ, ఈ మొత్తాలను సద్వినియోగం చేసుకోవాలని వాటిని ఉద్బోధించారు. పైన్సు ప్రదర్శనకు మంత్రి ప్రారంభోత్సవం చేశారు.

కొల్లాపూరులో రజకులకు మంత్రి ఋణాలను పంపిణీ చేశారు. హరిజన హాస్టల్, హరిజన కాలనీని ఆయన సందర్శించారు.

## బుచ్చి పంచాయతీ సమితిలో రజతోత్సవాలు

ఆంధ్రప్రదేశ్ శాసనసభ స్పీకర్, శ్రీ రేబాల దశరథ రామిరెడ్డి, నెల్లూరు జిల్లా పరిషత్తు అధ్యక్షులు మేనకూరు గోపాల కృష్ణారెడ్డి, బుచ్చిరెడ్డి పాలెం పంచాయతీ సమితి అధ్యక్షులు శ్రీ బాల కృష్ణారెడ్డితో కలసి నవంబరు 15 న బుచ్చి పంచాయతీ సమితి గ్రామాలలో జరిగిన పంచాయతీరాజ్ రజతోత్సవాలలో పాల్గొన్నారు. వెంగల్లు గ్రామంలో పాఠశాల భవనానికి రేడియో గదికి ప్రారంభోత్సవం చేశారు. పాఠశాల భవనానికి విరాళాలు ఇచ్చిన కీ. శే. నూకలపాటి ఆదిశేషారెడ్డి చిత్రపటాన్ని ఆవిష్కరించారు. మర్రిపాడు గ్రామానికి చెందిన హరిజన గిరిజనులను బంజరు భూముల కేటాయింపు పట్టాలను కూడా ఆయన పంపిణీ చేశారు. స్పీకర్ దువ్వూరు గ్రామంలోని హరిజన వాడలో కొబ్బరి మొక్కలను నాటారు. పాడి పశువులను పంపిణీ చేశారు. హరిజన మహిళల నిమిత్తం మహిళా మండలి ప్రారంభించిన వయోజన విద్యా కేంద్రంలోని సభ్యులకు పలకలను పంపిణీ చేశారు. తిరునవోయ గ్రామానికి చెందిన హరిజనులకు 12 ఇండ్ల స్థలాల పట్టాలను ఆయన పంపిణీ చేశారు. మినగల్లులో హరిజనులకు బంజరు భూముల పట్టాలను పంపిణీ చేశారు.

PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION & PUBLIC RELATIONS, ANDHRA PRADESH, HYDERABAD
PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH, AT THE GOVT. CENTRAL PRESS HYDERABAD

